Sachcha Deen-4
(Telugu)

# ఇస్లాం ప్రబోధిని

## (నాల్గవ భాగం)

మూలం

**మౌలానా ముహమ్మద్ యూసుఫ్ ఇస్లాహి**

అనువాదం

**అబ్బాదుల్లా**




**Telugu Islamic Publications Trust (Regd.)**
Sandesha Bhavanam, Lakkadkot, Chatta Bazar,
Hyderabad-500 002. India.

# విషయ సూచిక



ఈ పుస్తకంలో విద్యార్థులకు, యువకులకు ఇస్లామ్ మౌలిక విశ్వాసాలు, ఆరాధన విషయాలతోపాటు దైవప్రవక్తలు, మహా పురుషుల జీవిత గాథలు ఉన్నాయి. నైతిక విలువలు, ప్రవర్తనా సరళి, సామాజిక జీవన విధానం ఇంకా అనేక నిత్య జీవితావసర విషయాలు హృదయానికి హత్తుకునేలా సామాన్యులకు సైతం అర్థమయ్యేలా సరళమైన భాషలో వ్రాయబడ్డాయి. ఈ పుస్తకం పిల్లలకు ఎంతో ఉపయోగపడుతుందని ఆశిస్తూ....

డైరెక్టర్,

తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, హైదరాబాద్

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# 1. మౌలిక విశ్వాసాలు

అల్లాహ్ అనుగ్రహం వల్ల మనం విశ్వాసులం. విశ్వాసం ఎంతో గొప్ప భాగ్యం. విశ్వాసభాగ్యం ఇచ్చి అల్లాహ్ మనకు ఇహపరాల గౌరవం ప్రసాదించాడు. దీనికెంతో మనం అల్లాహ్‌కు రుణపడి ఉన్నాం. ఈ విశ్వాస భాగ్యమే లభించి ఉండకపోతే మనం కూడా మార్గభ్రష్టుల మాదిరిగా దారితప్పి తిరుగుతూ ఇహపరాలు పోగొట్టుకొని రెంటికి చెడ్డ రేవడిలా అయ్యేవారం.

మోమిన్ అంటే విశ్వాసి అని అర్థం. ఈ పదం ఎంత మనోహరంగా ఉంది! నిజమైన, దృఢమైన నమ్మకాన్ని 'ఈమాన్' అంటారు. ఎవరి దగ్గరయితే ఈ విశ్వాసం (ఈమాన్) ఉంటుందో అతని దగ్గర సర్వం ఉన్నట్లే. అలాగే ఎవరి దగ్గరయితే ఈ విశ్వాసం ఉండదో అతని దగ్గర ఏమీ లేనట్లే. విశ్వాసం కలిగివున్న మనిషిని అందరూ గౌరవిస్తారు. అందరి హృదయాల్లో అతనికి స్థానం ఉంటుంది. ఎవరి హృదయంలో విశ్వాసం ఉంటుందో అతడ్నే అల్లాహ్ అభిమానిస్తాడు. అవిశ్వాసి అల్లాహ్ దృష్టిలో కూడా గౌరవహీనుడవుతాడు, లోకం దృష్టిలో కూడా గౌరవహీనుడవుతాడు.

ముస్లిం కావడానికి ఐదు విషయాల పట్ల విశ్వాసం కలిగి ఉండాలి. ఈ విషయాలను విశ్వసించనిదే మనిషి ముస్లిం కాజాలడు. ఇస్లాం సూచించే దారిన నడవలేడు. కనుక ప్రతి ముస్లిం ఈ అయిదు విషయాల పట్ల మనస్ఫూర్తిగా విశ్వాసం కలిగి ఉండాలి. నోటితో కూడా వాటిని ధృవపరచాలి. వాటిలో ఏ ఒక్కదానిని నిరాకరించినా ఆ వ్యక్తి ముస్లిం కాజాలడు. ఏ విధంగా నిప్పులో చెయ్యి పెడితే కాలుతుందని మనకు గట్టి నమ్మకం ఉందో, అదే విధంగా ఈ పంచ విశ్వాసాలను దృఢంగా నమ్మాలి. ఈ పంచ విశ్వాసాల పట్ల ఉండవలసిన దృఢమైన నమ్మకాన్ని 'అఖీద' అని కూడా అంటారు.

ఆ పంచ విశ్వాసాలు ఇలా ఉన్నాయి:

1. **అల్లాహ్ పట్ల విశ్వాసం:** అల్లాహ్ ఒక్కడే ఆయనకు సాటి ఎవరూ లేరు. ఆయన దైవత్వంలో ఎవరూ భాగస్వాములు లేరు.
2. **దైవదూతల పట్ల విశ్వాసం:** అంటే వారు అల్లాహ్‌కు పూర్తిగా విధేయులని, వారసలు అవిధేయత చెయ్యనే చెయ్యరని నమ్మడం.
3. **దైవగ్రంథాల పట్ల విశ్వాసం:** దైవ గ్రంథాల పట్ల విశ్వాసం అంటే దైవం అవతరింపజేసిన అన్ని గ్రంథాలను విశ్వసించాలి. విభిన్న కాలాలలో అల్లాహ్ తన ప్రవక్తలపై గ్రంథాలను అవతరింపజేశాడు. ఆ గ్రంథాలన్నీ సత్యధర్మాన్ని ప్రబోధించాయి. అందులో దైవ శాసనాలున్నాయి. ఆయన మనల నుండి కోరేదేమిటో నిర్ద్వంద్వంగా వాటిలో తెలియజేయబడింది.
4. **ప్రవక్తల పట్ల విశ్వాసం:** ప్రవక్తల పట్ల విశ్వాసం అంటే ప్రతి యుగంలో, ప్రతి జాతిలో అల్లాహ్

సచ్ఛీలురయిన తన దాసులను మనకు ధర్మోపదేశం చేయడానికి పంపాడు. వారు అల్లాహ్ అభిమతం ప్రకారం జీవితం గడిపారు. ఇతరులను కూడా ఆ మార్గాన్నే నడిపింపజేయడానికి ప్రయత్నించారు.

5. **తీర్పుదినం పట్ల విశ్వాసం:** తీర్పుదినం పట్ల విశ్వాసం అంటే మరణానంతరం మనమందరం ఒకరోజు తిరిగి సజీవులమవుతాం. దైవ సమక్షంలో హాజరవుతాం. ఆయన అక్కడ మనల నుండి ఇహలోక జీవితంలో చేసిన కర్మలను గురించి లెక్క తీసుకొంటాడు. పాపపుణ్యాల పరిశీలన జరిపి పుణ్యాత్ములకు స్వర్గం ప్రసాదిస్తాడు. పాపాత్ములను నరకాగ్నిలో పడేస్తాడు.

ఈ పంచ విశ్వాసాలను అర్థం చేసుకోవాలి.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. ఏ సంపత్తిని పొందిన తరువాత (ఇహం, పరం) రెండు లోకాల్లో గౌరవం లభిస్తుంది?
2. ప్రపంచంలో అల్పుడు, అల్లాహ్ దృష్టిలో నీచుడయిన వాడెవడు?
3. ముస్లిం అవడానికి ఎన్ని విషయాల్ని విశ్వసించడం అవసరం?
4. అల్లాహ్‌కు ప్రీతిపాత్రుడయ్యే దాసుడు ఎవరు?
5. ఈమాన్ (విశ్వాసం) నిర్వచనం ఏమిటి?
6. పరలోకంపై విశ్వాసం అంటే మీరేమి భావిస్తారు?

**(ఆ) క్రింది వాటిని జత పరచండి**

| | అ | ఆ |
|---|---|---|
| 1. | ఈమాన్ బిల్ మలాయిక | పరలోకంపై విశ్వాసం |
| 2. | ఈమాన్ బిల్ కుతుబ్ | ప్రవక్తల్ని విశ్వసించటం |
| 3. | ఈమాన్ బిర్ రిసాలత్ | విశ్వాసి |
| 4. | మోమిన్ | దైవగ్రంథాలపై విశ్వాసం |
| 5. | ఈమాన్ బిల్ ఆఖిరత్ | దైవదూతలపై విశ్వాసం |



# 2. అల్లాహ్ పట్ల విశ్వాసం

ఈ విశాల ప్రపంచంలో మనమందరం నివసిస్తున్నాం. నీలిగగనం మనపై ఉంది, కోట్ల సంఖ్యలో నక్షత్రాలు అందులో మెరుస్తున్నాయి. సూర్యుడు ఆకాశం నుండి కాంతి వెదజల్లుతున్నాడు. చంద్రుడు చల్లని వెన్నెలనిస్తున్నాడు. భూమండలంలో సస్యశ్యామలమైన పంటలు పండుతున్నాయి. ఎన్నో పర్వతాలతో, పండ్ల తోటలతో, నదీనదాలతో కూడిన ప్రకృతి సౌందర్యం. అన్నిటిని అల్లాహ్ సృష్టించాడు. ఆయన ఆజ్ఞ వల్లనే ఈ సుందర విశ్వం నడుస్తోంది. ఆయనే ఈ విశ్వానికి ప్రభువు. ఇక్కడున్న అధికారులు, ప్రజలు అందరూ ఆయన దాసులే. ధనికులు, నిరుపేదలు, చిన్నలు, పెద్దలు అందరూ ఆయన మీద ఆధారపడేవారే. ఆయనే అందరి ప్రభువు, సర్వాధికారి. అందరూ ఆయన ఆజ్ఞలకు బద్ధులే. యావత్తు ప్రపంచంపై ఆయన అధికారం ఉంది. ఆయన దైవత్వంలో మరో భాగస్వామి లేడు. భూమ్యాకాశాలలో ఆయన ఆజ్ఞే చెల్లుతుంది. సూర్యచంద్రులు ఆయన ఆజ్ఞ వల్లనే ఉదయిస్తున్నారు, అస్తమిస్తున్నారు. దట్టమైన అరణ్యాలు, పర్వతశ్రేణులు, మహా సముద్రాలు అన్నీ ఆయన సృష్టించినవే. ఆయన సంజ్ఞ ప్రకారమే మేఘాలు ఏర్పడుతున్నాయి. వర్షాలు కురుస్తున్నాయి.

అల్లాహ్ ఒక్కడే. ఆయనలాంటి వారు ఎవరూ లేరు. ఆయనకు సహకారులు ఎవరూ లేరు. అందరూ ఆయన మీద ఆధారపడ్డవారే. ఆయనకు తల్లి లేదు, తండ్రి లేడు, సతీమణి లేదు, సంతానం లేదు. ఆయనకు వంశం లేదు, బంధువర్గం లేదు. ఆయనకు సమానులు ఎవరూ లేరు. ఆయనకు ఆయనే సాటి. ఆయన స్వయంగా ఉనికిలోకి వచ్చాడు. ఆయన్ను ఎవరూ సృష్టించలేదు. ఆయన నిత్యం ఉంటాడు. మన జీవన్మరణాలు ఆయన చేతిలోనే ఉన్నాయి. ప్రాణం ఇచ్చేది ఆయనే, తీసేదీ ఆయనే. ఆయన మనలను సజీవంగా ఉండనిస్తే, చంపేవారు ఎవరూ లేరు. ఆయనే మనల్ని చంపదలిస్తే మనల్ని సజీవంగా ఉంచేవారు ఎవరూ లేరు. నేరం చేసి ఆయన పట్టు నుండి పరారయ్యేవారులేరు. శిక్ష నుండి తప్పించుకోలేరు కూడా. సృష్టి యావత్తు ఆయన అధీనంలోనే ఉంది. జిన్నులు, దైవదూతలు, మానవులు, ప్రవక్తలు, ప్రబోధకులు అందరూ ఆయన అధీనంలోనే ఉన్నారు. అందరూ ఆయన దాసులే. ఆయన సామ్రాజ్యంలో ఎవరికీ ఎలాంటి ప్రమేయం లేదు. ఎవరికీ అధికారం లేదు. ఆయన తలచినది చేస్తాడు. ఎవరూ ఆయనకు అడ్డుపడలేరు. ఆయన తినడు. త్రాగడు. ఆయనకు నిద్రలేదు. కునుకులేదు, అలసట లేదు. ఆయన రహస్యాలను కూడా తెలుసుకొంటాడు. భూమ్యాకాశాలలో ఆయనకు ఏదీ గోప్యంగా లేదు. ఆయన అన్ని చోట్లా ఉన్నాడు. ప్రతి చిన్న, పెద్ద విషయం ఆయనకు తెలుసు.

భూమ్యాకాశాలలో ఉన్నదంతా ఆయనదే. ఏదీ ఆయన అధీనం నుండి బయటలేదు. మంచి చెడులు ఆయన కల్పించినవే. సుఖసంతోషాలు ఆయనే ఇస్తాడు, కష్టదుఃఖాలు ఆయనే కలిగిస్తాడు. గౌరవ అగౌరవాలు, లాభనష్టాలు అన్నీ ఆయన చేతుల్లోనే ఉన్నాయి. ఆయనకు ఏ కొరతా లేదు, ఆయనలో ఏ చెడుగాని, లోపంగాని లేదు. ఆయన దైవత్వంలో, గుణగణాలలో, శక్తిసామర్థ్యాలలో ఎవరూ భాగస్వాములు లేరు. ఆయన కార్యనిర్వహణ కోసం ఎవరిపైనా ఆధారపడడు. ఆయనే అన్ని సుగుణాలకు, శక్తిసామర్థ్యాలకు పుట్టినిల్లు.

అల్లాహ్ పట్ల విశ్వాసం కలిగి ఉండడం వల్ల మనం ఇతర శక్తుల దాస్యం నుండి విముక్తి పొందాం. ఎంత గొప్ప శక్తి అయినా సరే దానికి దాసోహం పలుకం. కేవలం అల్లాహ్‌కే కృతజ్ఞత తెలుపుకొంటాం. ఆయన్నే ఆరాధిస్తాం. సహాయం కోసం ఆయన్నే అర్థిస్తాం. ఏ విపత్తు వచ్చిపడినా ఆయన్నే వేడుకొంటాం. కష్టదుఃఖాలలో కాపాడమని ఆయననే ప్రార్థిస్తాం. ఆయన తప్ప ఇతరులెవ్వరూ ఆరాధనకు అర్హులు కారు. మనం ఎవరికీ భయపడం. మనకు భయం ఉందంటే కేవలం అల్లాహ్ భయమే. ఎవరి దగ్గర ఏముందని భయపడడానికి? ఎవరినైన ఆయన రక్షించదలిస్తే యావత్ప్రపంచం కలసి కూడా అతనిని శిక్షించలేదు. ఆయనే ఎవరినైన శిక్షించదలిస్తే ప్రపంచం మొత్తం కలిసినా అతనిని రక్షించలేరు. మనం ప్రేమించేది ఆయన్నే, మనసు లగ్నపరుచుకునేది ఆయన కోసమే, ఆయన ఆజ్ఞల ప్రకారం నడచుకొంటాం. ఆయన అవిధేయతకు దూరంగా ఉంటాం. ఆయన నిషేధించిన విషయాల దరిదాపులకు కూడా పోము. ఆయన చెయ్యమని చెప్పిన పనులను మనసారా చేస్తాం. ఏ కోరికలు ఎవరితోను కోరం. ఆయనకు మాత్రమే భయపడి జీవిస్తున్నాం. హజ్రత్ ఉమర్ (రజి) ఇలా అన్నారు: "ఎవరైతే దైవానికి భయపడి జీవిస్తారో, వారికి అందరూ భయపడుతారు."

మనం సత్యం పలుకుతాం. మెల్లగా మాట్లాడినా, బిగ్గరగా మాట్లాడినా అల్లాహ్ ఆలకిస్తాడనే దృఢనమ్మకం మనకుంది. నోటితో పలికినా, మనస్సులో తలచినా, అల్లాహ్‌కు అంతా తెలుసు. పగటి వెలుగులో మాట్లాడినా, రాత్రి చీకట్లో మాట్లాడినా అంతా అల్లాహ్‌కు తెలుసునని మన నమ్మకం. చేసిన తప్పుకు అల్లాహ్ మనలను శిక్షిస్తాడని మనకు తెలుసు. ఆయన శిక్ష నుండి మనలను రక్షించే నాథుడు లేడని కూడా మనకు తెలిసిందే. అలాంటప్పుడు మనం అబద్ధం ఎలా పలుకగలం?

మనం ప్రతి చెడుకు దూరంగా ఉంటాం. చెడు చేస్తే అల్లాహ్ మనలను పట్టుకొంటాడు. ఆయన పట్టు పటిష్టమైంది. అందుచేత ఆయనకే భయపడతాం. మంచిని పెంచడానికి పూనుకొంటాం. మంచి వారంటే అల్లాహ్‌కు ఇష్టమని మనకు తెలుసు. స్వయంగా పుణ్యకార్యాలు చేస్తాం, అల్లాహ్ దాసుల శ్రేయాన్ని అభిలషిస్తూ కార్యోన్ముఖులమవుతాం. మంచి పనులు చేసినందుకు అల్లాహ్ సంతోషపడతాడని, మనకు స్వర్గం ప్రసాదిస్తాడని మనం విశ్వసిస్తున్నాం.

మనం సిగ్గుమాలిన పనులు చేయకుండా ఉంటాం. అలాంటి పనులంటే అల్లాహ్‌కు గిట్టవని మనకు బాగుగా తెలుసు. అల్లాహ్ పట్ల విశ్వాసం కలిగి ఆయన ఆజ్ఞల ప్రకారం నడచుకుంటామని మనం ప్రమాణం చేశాం. పాపపు పనుల చెంతకు పోకుండా జాగ్రత్త పడతాం. చెడు తలంపులను రానివ్వం. ఒక మామూలు మనిషి కూడా ఇతరులకు మాట ఇచ్చి దానిని నిలబెట్టుకోవడానికి సర్వవిధాల ప్రయత్నిస్తాడు. అల్లాహ్‌కు మాట ఇచ్చిన తరువాత ఆ మాటను మనం జవదాటగలమా!

మనం అశ్లీల చేష్టలను అసహ్యించుకుంటాం. ఇతరుల గౌరవమర్యాదల్ని మన గౌరవమర్యాదలుగా తలుస్తాం.

మనం ప్రతి ఒక్కరి హక్కుల్ని నెరవేరుస్తాం. తల్లిదండ్రుల హక్కులు, అన్నదమ్ముల హక్కులు,

అక్కచెల్లెళ్ళ హక్కులు, ఇతర బంధువుల హక్కులు పూర్తిగా నెరవేరుస్తాం. ప్రతి ఒక్కరితో సత్సాంగత్యం కలిగి ఉంటాం. ఎన్నడూ ఇతరుల హక్కుల్ని కొల్లగొట్టకుండ ఉంటాం. ఎవరితో ఎలా ప్రవర్తించాలో అలాగే ధర్మానుసారం ప్రవర్తిస్తాం. అనాథలను, వితంతువులను, పేదలను, దుఃఖితులను ఆదుకుంటాం. వారికి సహాయపడి అల్లాహ్ ప్రసన్నత పొందడానికి ప్రయత్నిస్తాం. అల్లాహ్ న్యాయాన్ని కోరుతాడని మనకు తెలుసు. ఆయన ఎవరిపైనా దౌర్జన్యం చెయ్యడు. అందుచేత మనం ఎవరినీ కష్టపెట్టకుండా ఉంటాం. హక్కుల విషయంలో, న్యాయం విషయంలో నా వారు, పరాయి వారని చూడము. అందరిని ఒకే దృష్టితో చూస్తాం. ఇతరులు మన పట్ల అన్యాయంగా ప్రవర్తించరాదని కోరుకుంటాం. ఆలాంటప్పుడు మనం ఇతరులకు అన్యాయం ఎలా తలపెడతాం? తెలిసి కూడా అన్యాయం చేస్తే, తీర్పుదినాన అల్లాహ్ మనల్ని శిక్షిస్తాడు.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. అల్లాహ్‌ను విశ్వసించడం అంటే ఏమిటి?
2. అల్లాహ్‌ను విశ్వసించి మనం ప్రతి ఒక్కరి దాస్యం నుండి ఎలా విముక్తులవుతాము?
3. ఎవరయితే అల్లాహ్‌కు భయపడతారో, ప్రతిదీ ఆయనకు భయపడుతుంది' అని ఎవరన్నారు?
4. ఈ పాఠంలో ఏఏ ప్రజల హక్కులు నెరవేర్చాలని ప్రస్తావించబడింది?
5. సర్వ ప్రపంచంపై అల్లాహ్ ప్రభుత్వం ఉంది' ఈ మాటను విశదీకరించండి?
6. 'అల్లాహ్ ఒక్కడే' దీని ద్వారా మీరేం అర్థం చేసుకుంటారు?
7. అల్లాహ్‌ను విశ్వసించిన తరువాత మనలో ఏ మార్పులు జనిస్తాయి?

**ఆ) క్రింది ఖాళీలను పూరించండి.**

1. చంద్రుడు ఆయన................................. తోనే పొడుస్తాడు.
2. జీవన్మరణాలు ఆయన .................................లో ఉన్నాయి.
3. మేము అల్లాహ్ ............................. నుండి భయపడతాము.
4. అల్లాహ్ న్యాయాన్ని ..............................................

3. ఈ పాఠంలో అల్లాహ్ యొక్క అనేక గుణాలు వివరించబడ్డాయి. కనీసం పది గుణాలను వ్రాయండి.



# 3. దైవదూతల పట్ల విశ్వాసం

ఇస్లాం మౌలిక విశ్వాసాలలో రెండవది దైవదూతల పట్ల విశ్వాసం కలిగి ఉండటం. దైవదూతలంటే ఎవరు? వారేం చేస్తారు? ఈ విషయాలను గురించి మనకు దైవగ్రంథాలలో పేర్కొనబడిన, దైవప్రవక్తలు చెప్పిన మేరకే తెలుస్తుంది. కొందరు దైవదూతల విషయంలో రకరకాల కట్టుకథలు అల్లి ప్రచారంలోకి తెచ్చారు. వారిలో కొందరు దైవదూతలను దేవుని సంతానం అన్నారు. మరికొందరు దైవదూతలకు వర్షం కురిపించే, గాలులు వీచేలా చేసే, చంపే, బ్రతికించే శక్తిసామర్థ్యాలు ఉన్నాయని నమ్ముతారు. అందుకే వారు దైవదూతలను ఆరాధించడం ప్రారంభించారు. వారిని ప్రసన్నం చేసుకోవడానికి కానుకలు, మొక్కు బడులు చెల్లిస్తారు. ఈ విధంగా వారు దైవప్రవక్తల బోధనలను కాదని, చిత్రవిచిత్ర విషయాలు కల్పించు కున్నారు. ఇవన్నీ తప్పుడు విషయాలు.

ఈ ప్రపంచాన్ని ఒకే ఒక దేవుడు సృష్టించాడు. ఆయనే దీని పరిపాలకుడు కూడా. ఆయన దైవ త్వంలో ఎవరూ భాగస్వాములు లేరు. భూమ్యాకాశాల్లో ఆయన పరిపాలన మాత్రమే సాగుతోంది. అన్ని చోట్లా ఆయన అధికారమే చెల్లుతుంది. భూమ్యాకాశాల వ్యవస్థను నిర్వహించడానికి, ప్రతి పనీ నిర్ణీత సమయానికి నియమబద్ధంగా జరగడానికి దేవుడు అనేకమంది దైవదూతలను సృష్టించాడు. దైవదూతలు దేవుని సృష్టితాలే. వారు దేవుని పట్ల ఎంతో వినయ విధేయతలతో మసలుకుంటారు. వారు ఎలాంటి పాపకార్యాలు చేయలేరు. రేయింబవళ్ళు దేవుని ఆజ్ఞలను పాటించడంలో నిమగ్నులయి ఉంటారు. దేవుని నుండి ఏదైనా ఆజ్ఞ లభించీ లభించగానే వారు దాన్ని పాటించడానికి పరుగులు పెడ్తారు. ఎవరు ఏ పనికోసం నియమించబడ్డారో వారు ఆ పనే చేస్తారు. అది తప్ప మరో పని చేయరు. దేవుని ఆజ్ఞ లేనిదే చెట్టు నుండి ఒక ఆకయినా రాలదు. ఆయన ప్రతి పనీ చేయగల సమర్థుడు, సర్వశక్తి మంతుడు. అయినప్పటికీ ఆయన తన యుక్తి మేరకు ఒక పథకం ప్రకారం దైవదూతల ద్వారా భూమ్యా కాశాల నిర్వహణ పనులు చేస్తున్నాడు. ప్రతి పనీ ఆయన ఆజ్ఞ ప్రకారమే జరుగుతోంది. దైవదూతల ప్రమేయం లేకుండా కూడా ఆయన స్వయంగా ప్రతి పనీ చేయగలడు. దైవదూతలతో ఎందుకు చేయి స్తున్నాడో, అందులోని మర్మహేతువు ఏమిటో మానవమాత్రులమయిన మనం అర్థం చేసుకోలేము. ఆయన మేఘాలు లేకుండానే వర్షం కురిపించగలడు. వర్షం లేకుండానే చెట్లను మొలకెత్తించగలుగుతాడు. కాని ఆయన ఈ ప్రపంచాన్ని కార్యకారణ ప్రపంచంగా చేశాడు. ప్రతి పనికీ ఏదో ఒక కారణం నిర్ణయిం చబడింది. దాని ప్రకారమే ఈ విశ్వవ్యవస్థ నడుస్తోంది.

దైవదూతలకు తమదంటూ ఏదైనా శక్తి ఉందని, వారు తలచుకున్న పని చేయగలుగుతారని భావించడం తప్పు. వారికి స్వశక్తి, సొంత నిర్ణయాలు ఏవీ ఉండవు. అంతా దేవుని శక్తితో, ఆయన నిర్ణ యాల మేరకే జరుగుతుంది. ఆయన అభీష్టానికి వ్యతిరేకంగా దైవదూతలు ఏమీ చేయలేరు.

మానవులు మట్టితో సృష్టించబడితే దైవదూతలు కాంతితో సృష్టించబడ్డారు. వారు మనకు కన్పించరు.

దైవదూతలు ఉన్నారని మనకు దైవప్రవక్తలు తెలిపారు. గనుక మనం ఆ విషయాన్ని నమ్ముతున్నాము. దైవదూతలు మనలా స్త్రీ పురుషులుగా ఉండరు. వారు మనలా తినరు, తాగరు, నిద్రించరు. దైవధ్యానమే వారి ఆహారం. రాత్రింబవళ్ళు దైవస్తోత్రం చేస్తూ తమకు దేవుడు నిర్ణయించిన విధులు నిర్వహిస్తుంటారు. దైవదూతలను గురించి ముఖ్యంగా ఈ క్రింది విషయాలను గుర్తుంచుకోవలసిన అవసరం ఉంది:

**దైవదూతల గురించిన మౌలిక విశ్వాసాలు**

1. దైవదూతలు దేవుని సృష్టితాలు. దేవుని సంతానం కాదు. ఆయన దైవత్వంలో వారికి భాగస్వామ్యం లేదు. వారి జీవన్మరణాలు దేవుని అధీనంలోనే ఉన్నాయి. వారికి దైవిక శక్తిసామర్థ్యాలు లేవు. దేవునికి విధేయులయి ఉంటూ అనుక్షణం ఆయన్ని ఆరాధిస్తూ, ఆయన ఆజ్ఞలను పాటించే సృష్టితాలు మాత్రమే.

2. వారి ప్రవృత్తిలోనే దైవవిధేయత ఉంది. వారు ఎన్నటికీ అవిధేయతకు పాల్పడలేరు. దైవాజ్ఞ కోసం ఎదురుచూస్తూ, దైవాజ్ఞ కాగానే దాన్ని పాటించడానికి పరుగులు పెడ్తారు. దేవుని అభీష్టానికి వ్యతిరేకంగా వారేమీ చేయలేరు.

3. వారికి స్వయం నిర్ణయాధికారాలు లేవు. వారు ఏది చేసినా దేవుని ఆజ్ఞ ప్రకారమే చేస్తారు. అందు చేత దేవుడు ఎంత శక్తి ప్రసాదిస్తాడో, ఏ పని చేయమని ఆదేశిస్తాడో ఆ శక్తి మేరకు ఆ పనే వారు చేయగలుగుతారు. అంతకు మించి మరేమీ చేయలేరు. హజ్రత్ ఇజ్రాయీల్ (అలై) జీవరాసుల ప్రాణాలు తీయడానికి నియమించబడిన దైవదూత. అయితే దైవాజ్ఞ లేకుండా ఆయన ఒక దోమ ప్రాణం కూడా తీయలేరు. ప్రతి ప్రాణికీ మృత్యువు నిర్ణయమై ఉంది. ఎప్పుడు ఏ జీవి ప్రాణం తీయాలని దేవుడు ఆజ్ఞాపిస్తాడో అప్పుడు ఆ జీవి ప్రాణం తీస్తారు. ఒక ఘడియ తొందరగాని, లేదా ఆలస్యంగాని చేయలేరు ఆయన.

4. దైవదూతల్లో ఆడా మగా లేరు. వారు ఎలాంటి ఆహారపానీయాలు తీసుకోరు. వారు నిద్రించరు కూడా. ఎల్లప్పుడూ దైవస్తుతి చేస్తుంటారు. అదే వారి ఆహారం. వారు జ్యోతితో సృష్టించబడ్డారు. మానవులకు కన్పించని అగోచర జీవులు. దైవప్రవక్తలు తెలిపారు గనక వారి ఉనికిని మనం విశ్వసిస్తున్నాం.

5. దైవదూతలు ఎంతో నిజాయితీపరులు. అల్లాహ్ ఇచ్చిన సందేశాన్ని దైవప్రవక్తలకు చేరవేస్తారు. మన ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు కూడా హజ్రత్ జిబ్రయీల్ (అలై) దైవసందేశం అంద జేసేవారు. అల్లాహ్ పంపిన సందేశాలను ఆయన ప్రియప్రవక్త(సఅసం)కు ఉన్నవి ఉన్నట్లు యథా తథంగా అందజేశారు.

6. ప్రపంచ వ్యవహారాలు నిర్వహించడానికి అల్లాహ్ దైవదూతలను వివిధ పనులకోసం నియమించాడు. వారు తమకు అప్పగించబడిన పనులు తు.చ. తప్పకుండా పాటిస్తున్నారు. విధుల నిర్వహణలో

వారు ఏమాత్రం నిర్లక్ష్యం వహించడంగాని, ఏమరుపాటుకు గురవడంగాని జరగదు.

7. దైవదూతలు అనేక పనుల కోసం నియమించబడ్డారు.

**దైవదూతల విధులు**

- **దైవప్రవక్తలకు దైవసందేశాన్ని అందజేయడం:** ఈ పని ఇప్పుడు ముగిసింది. మన ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం) అంతిమ దైవప్రవక్త గనక ఆయన తరువాత మరే దైవప్రవక్తా వచ్చే ప్రసక్తి లేదు.
- **జీవరాసుల ప్రాణాలు తీయడం:** ఈ పని కోసం హజ్రత్ ఇజ్రాయిల్ (అలై) నియమితులయ్యారు.
- **జీవరాసులకు ఉపాధి చేరవేయడం:** ఈ పని కోసం హజ్రత్ మీకాయిల్ (అలై) నియమించబడ్డారు.
- **బూర ఊదడం:** ఈ పని కోసం హజ్రత్ ఇస్రాఫీల్ (అలై) నియమించబడ్డారు. ఆయన బూర నోట్లో పెట్టుకొని అల్లాహ్ ఆజ్ఞ కోసం ఎదురు చూస్తున్నారు. ఈ బూర శబ్దం ఎంతో తీవ్రంగా, భయానకంగా ఉంటుంది. మొదటిసారి బూర ఊదగానే మానవులతో సహా యావత్తు జీవరాసులు చచ్చిపోతాయి. రెండవసారి బూర ఊదగానే మానవులంతా పునరుజ్జీవులయి తమ తమ కర్మ పత్రాలు తీసుకొని హషర్ మైదానం వైపు పరుగెత్తుతారు.
- **సమాధిలో మృతులను ప్రశ్నించడం :** ఈ పని కోసం ఇద్దరు దైవదూతలు నియమించబడ్డారు. ఒకరి పేరు 'మున్‌కర్', రెండవ దైవదూత పేరు 'నకీర్.'
- **మానవుల రక్షణ:** ఈ పని కోసం నియమింపబడిన దైవదూతలను 'హఫజ' అంటారు. అంటే రక్షించేవారు లేక భద్రత చేకూర్చేవారని అర్థం.
- **మానవుల కర్మలను నమోదుచేయడం:** ఇహలోకంలో మానవులు చేసే కర్మలను ఎప్పటికప్పుడు నమోదు చేసేందుకు ప్రతి మనిషి వెంట ఇద్దరు దైవదూతలు ఉంటారు. వారిని "కిరామన్ కాతిబీన్" అంటారు. మనం ఎక్కడున్నా, ఏం చేస్తున్నా ఆ దైవదూతలు మన కర్మలను నమోదు చేస్తుంటారు. తరువాత ప్రళయదినాన వారు మన కర్మల చిట్టాలను విశ్వప్రభువు ముందు పెడ్తారు.
- **స్వర్గ నిర్వాహకులు:** ఇక్కడి ప్రధాన దైవదూతను "రిజ్వాన్" అంటారు.
- **నరక నిర్వాహకులు:** ఇక్కడి ప్రధాన దైవదూతను 'మాలిక్' అంటారు.
- **పవిత్ర సమావేశాలలో పాల్గొనడం :** దైవదూతలు నిత్యం దైవ ధ్యానంచేస్తూ ఉంటారు. ఇహలోకంలో ఎక్కడైనా దైవస్మరణ సమావేశాలు జరుగుతుంటే అందులో కూడా వారు పాల్గొంటారు.

పైన తెలిపిన దైవదూతలే గాక అనుక్షణం దైవారాధనలో, దైవధ్యానంలో లీనమయి ఉండే దైవదూతలు కూడా కోటాను కోట్ల మంది ఉన్నారు. ముస్లింల శ్రేయస్సు కోసం దైవాన్ని ప్రార్థించే దైవదూతలు కూడా ఎంతో మంది ఉన్నారు.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. అల్లాహు తఆలా దైవదూతల్ని ఎందుకు సృష్టించాడు?
2. దైవదూతల గురించి మీకేం తెలుసు?
3. దైవదూతలకు సంబంధించి ప్రజలు ఏఏ తప్పు భావనల్ని ఏర్పరచుకున్నారు?
4. ప్రఖ్యాతిగాంచిన నలుగురు దైవదూతల పేర్లు తెలుపండి?

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి**

1. దైవదూతలు ..............................................తో సృష్టించబడ్డారు.
2. దైవదూతలు అల్లాహ్ ........................................................
3. అల్లాహ్ పనుల్లో జోక్యం చేసుకునే ...................... దైవదూతలకు ఎక్కడ?
4. దైవదూతలు అత్యంత .................................. గా సృష్టించబడ్డారు.

**ఇ. ఈ క్రింద పేర్కొన్న దైవదూతల పనులేవి?**

1. హజ్రత్ జిబ్రీల్ (అలై) 2. ముంకర్ నకీర్ 3. హజ్రత్ ఇస్రాఫీల్ అలై 4. కిరామన్ కాతిబీన్

**ఈ) క్రింది వాటిని జతపరచండి**

| | అ | ఇ |
|---|---|---|
| 1. | జీవరాశుల ప్రాణాలు తీయడానికి | కిరామన్ కాతిబీన్ |
| 2. | జీవరాశులకు భుక్తిని సమకూర్చటానికి | మాలిక్ |
| 3. | స్వర్గాన్ని కనిపెట్టి ఉండటానికి | ఇజ్రాయీల్ (అలై) |
| 4. | నరకం పర్యవేక్షణ కోసం | మీకాయీల్ (అలై) |
| 5. | మానవుల కర్మల్ని వ్రాయటానికి | రిజ్వాన్ |



# 4. దైవగ్రంథాల పట్ల విశ్వాసం

మన మూడవ మౌలిక విశ్వాసం, గ్రంథాల పట్ల విశ్వాసం కలిగివుండటం. అంటే దేవుని గ్రంథాల పట్ల విశ్వాసం ఉండడం అన్నమాట. పుస్తకాలు మనందరికీ తెలుసు. ఇప్పుడు మన చేతిలో ఉన్నది గ్రంథమే. అయితే గ్రంథాలలో రెండు రకాలు ఉన్నాయి. ఒకటి, మానవులు ఆలోచించి అర్థం చేసుకొని రాసే గ్రంథాలు. రెండు, దేవుడు తన ప్రవక్తలపై అవతరింపజేసిన గ్రంథాలు. వీటిని దివ్య గ్రంథాలు అంటారు. ముస్లిం కావడానికి దివ్యగ్రంథాలను కూడా విశ్వసించవలసి ఉంటుంది.

అల్లాహ్ మన పట్ల ఎంతో దయామయుడు. ఆయన మనల్ని సృష్టించాడు. తినడానికి, తాగడానికి రకరకాల పదార్థాలు ప్రసాదించాడు. మనకు కావలసిన వస్తువులన్నీ సమకూర్చాడు. అంతకంటే ముఖ్య విషయం, ఆయన మనకు ఇహపరలోకాల సాఫల్యం కోసం రుజుమార్గం, జీవితం గడపడానికి సరయిన జీవన విధానం తెలియజేశాడు. ఆయన మనకు సరయిన జీవన విధానం గనక తెలియజేయకపోయివుంటే మనం దారితప్పి ఎక్కడెక్కడో తిరుగుతుండేవాళ్ళం. ఇలా మార్గభ్రష్టులమయితే పరలోకంలో కూడా దైవ శిక్ష అనుభవించవలసి వస్తుంది. అల్లాహ్ మనల్ని కరుణించి సన్మార్గంలో పెట్టేందుకు దివ్య గ్రంథాలను అవతరింప జేశాడు. ఈ గ్రంథాలలో మంచి పనులకు సంబంధించిన వివరాలు ఉన్నాయి. చెడ్డ పనుల నుండి మనల్ని వారించడం జరిగింది. మంచి జీవితం గడపడానికి సరైన జీవితవిధానం, ఆయన ప్రసన్నతాభాగ్యం పొందడానికి చేయ వలసిన పుణ్యకార్యాలు ఏమిటో తెలియజేశాడు. స్వర్గనరకాలను గురించి ప్రస్తావించాడు. సత్కార్యాల వైపు ప్రేరణ కలిగించాడు. దుష్కార్యాలను గురించి హెచ్చరించాడు. ఆరాధనా పద్ధతులు వివరించాడు. తల్లిదండ్రుల హక్కులు, ఇతర బంధువుల హక్కులు, పేదలు అనాథల పట్ల సత్ప్రవర్తన వగైరా విషయాలన్నీ ఆయన గ్రంథంలో తెలియజేశాడు. వాటిని ఆచరిస్తే ఆయన మనకు ఆయన ప్రసన్నతాభాగ్యంతో పాటు, పరలోకంలో భోగభాగ్యాలతో కూడిన స్వర్గం ప్రసాదిస్తాడు.

స్వర్గనరకాల వివరాలందున్నాయి. మంచి పనులు చేయడానికి ప్రోత్సహించబడింది. చెడు పనుల విపరీతాలేమిటో తెలుపబడ్డాయి. మంచి జీవిత సూత్రాల విద్య నేర్పించబడింది. ఆరాధనా విధానాలు తెలుపబడ్డాయి. తల్లిదండ్రులు, సోదరుల హక్కులు తెలుపబడ్డాయి. బీదవారు, లేమిననుభవించేవారు, అనాథలు మొదలగువారి పట్ల మంచిగా వ్యవహరించే విధానం తెలుపబడింది. అల్లాహ్ మనతో సంతోషపడే మార్గాలన్నీ దివ్యగ్రంథాలలో తెలియజేయబడ్డాయి. ఆయన సంతోషం మనకు స్వర్గప్రదానం. ఈ స్వర్గం నిత్య ఆనందాలకు నిలయం.

మానవులకు రుజుమార్గం చూపడానికి అల్లాహ్ ఎన్నో గ్రంథాలను అవతరింపజేశాడు. వాటి సంఖ్య ఆయనకు మాత్రమే తెలుసు. ఖుర్ఆన్, హదీసుల్లో చెప్పబడిన వరకే మనకు తెలుసు. ఈ దివ్య గ్రంథాలలో ఇప్పుడు ఖుర్ఆన్ మాత్రమే దాని అసలు స్వరూపంలో యధాతథంగా ఉంది. ఇది అంతిమ

దైవగ్రంథం. దీని తరువాత మరే దివ్యగ్రంథం రాలేదు, రాబోదు. దివ్యఖుర్‌ఆన్ యావత్తు మానవాళికి రుజుమార్గం చూపడానికి వచ్చిన గ్రంథం. ఇది మన ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం)పై అవతరించిన దివ్యగ్రంథం.

కుర్‌ఆన్‌లో నాలుగు దివ్యగ్రంథాల ప్రస్తావన వచ్చింది. వాటిలో తౌరాత్ గ్రంథం ప్రవక్త హజ్రత్ మూసా (అలై)పై అవతరింపబడింది. ఇంజీలు (బైబిల్) గ్రంథం హజ్రత్ ఈసా (అలై)పై అవతరింపబడింది. వీటికి తోడు ఇంకా చిన్న చిన్న గ్రంథాలు కొంతమంది దైవప్రవక్తలకు ఇవ్వబడ్డాయి. వాటిని "సహీఫాలు" అంటారు. ఒక్క ఖుర్‌ఆన్ తప్ప మిగిలిన దివ్యగ్రంథాలన్నీ ఇప్పుడు వాటి అసలు రూపంలో లేవు. కొందరి స్వార్థం, నిర్లక్ష్యాల కారణంగా అవి ఎన్నో మార్పులకు, చేర్పులకు గురయిపోయాయి. దేవుడు అవతరింపజేసిన గ్రంథాలన్నిటినీ ముస్లింలు విశ్వసిస్తారు.

**దైవగ్రంథాల పట్ల మన మౌలిక విశ్వాసాలు**

1. సృష్టికర్త పంపిన దివ్యగ్రంథాలన్నీ సత్యాలనే బోధించాయి.
2. యావత్తు దివ్యగ్రంథాలు బోధిస్తున్న సారాంశం ఒక్కటే. అది "అల్లాహ్‌ను తప్ప మరెవరినీ ఆరాధించకండి. ఆయన ప్రవక్తలకు విధేయులయి వారిని అనుసరించండి" అని మాత్రమే.
3. యావత్తు దివ్యగ్రంథాలను విశ్వసించాలి. వాటిలో ఏ ఒక్కదాన్ని విశ్వసించకపోయినా మనం ముస్లింలు కాలేము.
4. ఖుర్‌ఆన్‌కు పూర్వం అవతరించిన దివ్యగ్రంథాలు వాటి అసలు స్వరూపంలో లేవని, కొందరి స్వార్థం, నిర్లక్ష్యాల కారణంగా అవి ఎన్నో మార్పులకు, చేర్పులకు గురయిపోయాయని నమ్మాలి.
5. తౌరాత్, జబూర్, ఇంజీల్ పేరిట నేడు లభిస్తున్న గ్రంథాలు నిజమైన దైవగ్రంథాలని చెప్పలేము. దేవుడు అవతరింపజేసిన అసలు గ్రంథాలనే మనం విశ్వసించాలి. కాకపోతే వాటిలో ఖుర్‌ఆన్ ధృవీకరిస్తున్న కొన్ని భాగాలను మాత్రం మనం విశ్వసిస్తాం.
6. గత గ్రంథాలు ఆయా కాలాలకు అనుగుణంగా ఉండేవి. ఇప్పుడు ప్రళయం వరకు మార్గదర్శకం చేసే గ్రంథం దివ్యఖుర్‌ఆన్ మాత్రమే. ఖుర్‌ఆన్‌ని విశ్వసించకుండా ఎవరూ రుజుమార్గం పొందలేరు.
7. ఖుర్‌ఆన్ అవతరించిననాటి నుండి అది తన అసలు స్వరూపంలో ఉంది. ప్రళయదినం వరకు అది అలాగే సురక్షితంగా ఉంటుంది.
8. ఖుర్‌ఆన్ బోధనలు అన్ని కాలాలకు వర్తిస్తాయి. మన ప్రియప్రవక్త (సఅసం) అంతిమ దైవప్రవక్త అయినట్లే దివ్యఖుర్‌ఆన్ కూడా అంతిమ దైవగ్రంథం. ఖుర్‌ఆన్ ఉండగా ఇప్పుడు ఇతర గ్రంథాల అవసరం లేదు.
9. ఖుర్‌ఆన్ అవతరించిన తరువాత ఇప్పుడు గత గ్రంథాలను పాటించే అవసరం లేదు. ఎవరైనా ఖుర్‌ఆన్‌ని వదలి గత గ్రంథాలను పాటిస్తే అతను ముస్లింగా పరిగణించబడడు.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. 'ఆకాశ గ్రంథాలు' అంటే అర్థం ఏమిటి?
2. దివ్యఖుర్ఆన్ గురించి మీకేమి తెలుసు?
3. అల్లాహ్ మనల్ని ఏఏ విధాలుగా కనికరిస్తున్నాడు?
4. అల్లాహ్ గ్రంథాలలో ఏ విషయాల గురించి బోధించబడింది?

**ఆ) ఖాళీలను పూరించండి.**

1. గడిచిన ఆకాశ గ్రంథాలు ప్రస్తుతం తమ ........................... రూపంలో లేవు.
2. సర్వ ఆకాశ గ్రంథాల ........................................................ ఒక్కటే.
3. దివ్యఖుర్ఆన్ అవతరించినప్పటి నుండి తన అసలు ......................లో ఉంది.
4. ..................ను అంగీకరించనంతవరకు ఎవ్వరూ ఇస్లామ్ సక్రమ మార్గాన్ని పొందలేడు.

**ఇ) సరైన వాక్యంపై (✓) గుర్తును, తప్పు వాక్యంపై (X) గుర్తును పెట్టండి**

1. సర్వ ఆకాశ గ్రంథాల బోధన సత్యమై ఉండేది. ....................................... ( )
2. సర్వ ఆకాశ గ్రంథాల్ని విశ్వసించటం తప్పనిసరి కాదు. ..................... ( )
3. దివ్యఖుర్ఆన్ బోధనలు అన్ని కాలాల కోసం ఉన్నాయి. ..................... ( )
4. దివ్యఖుర్ఆన్ వచ్చేసిన తరువాత గడిచిన గ్రంథాల్ని కూడా అనుసరించటం అవసరం. .................... ( )

**ఈ) ఈ క్రింది వాటిని జతపరచండి**

| | అ | ఇ |
|---|---|---|
| 1. | ఖుర్ఆన్ | హజ్రత్ ఈసా (అలైహిస్సలామ్) |
| 2. | తౌరాత్ | హజ్రత్ దావూద్ (అలైహిస్సలామ్) |
| 3. | జబూర్ | హజ్రత్ మూసా (అలైహిస్సలామ్) |
| 4. | ఇంజీల్ | హజ్రత్ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహివ సల్లం) |



# 5. దైవప్రవక్తల పట్ల విశ్వాసం

నాలుగవ మౌలిక విశ్వాసం, దైవప్రవక్తల పట్ల విశ్వాసం కలిగి ఉండటం. అల్లాహ్ దయ మన మీద ఎంతగానో ఉంది. ఆయన మనకు మన అవసరాలన్నిటినీ సమకూర్చాడు. త్రాగడానికి చల్లని మంచి నీళ్ళు, తినడానికి రుచికరమైన పండ్లు, ధరించడానికి మంచి బట్టలు, నివసించడానికి ఇండ్లు మొదలైన వస్తుసంపదలన్నీ ప్రసాదించాడు. వాటన్నిటికంటే మహాభాగ్యం- ఆయన మనకు రుజుమార్గం చూపించాడు. దైవసందేశం అందజేసి రుజుమార్గం చూపేవారిని దైవప్రవక్తలు అంటారు. ప్రపంచం ఉనికిలోకి వచ్చినప్పటి నుండే దేవుడు మానవాళికి రుజుమార్గం చూపడానికి తన ప్రవక్తలను పంపుతూ వచ్చాడు. ఆ ప్రవక్తలందరూ మనకు దైవసందేశం అందజేశారు. దైవాభీష్టం తెలియజేశారు. ఇస్లాం గురించి బోధించారు. ముక్తిమార్గం ఏమిటో వివరించారు. ప్రవక్తలంతా సత్యవంతులు, నిజాయితీపరులు. వారందరూ వచ్చి ఏకైక దేవుడయిన అల్లాహ్‌ను విశ్వసించండని ఆయన దైవత్వంలో, శక్తిసామర్థ్యాలలో, గుణగణాలలో ఎవరినీ భాగస్వాములు చేయరాదని ఆయన్ని మాత్రమే ఆరాధించాలని ఆయన తప్ప మరెవరూ ఆరాధనకు అర్హులు కారని, తమను అనుసరించండని తమను అనుసరించడంలోనే ఇహపరలోకాల శ్రేయస్సు ఉందని చెప్పారు.

అందరికంటే ముందు ఈ సందేశాన్నే హజ్రత్ ఆదం (అలై) తెచ్చారు. ఆయన తరువాత నూహ్ (అలై), ఇబ్రాహీం (అలై), మూసా (అలై), ఈసా (అలై) వగైరా ఎందరో ప్రవక్తలు వచ్చారు. వారి సంఖ్య దేవునికి మాత్రమే తెలుసు. మనకు వారంతా ఒకే విధమైన సందేశం తెచ్చారు. అందరూ అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించాలని, ఆయన అభిమతం ప్రకారం నడచుకోవాలని బోధించారు. వారు స్వయంగా దేవుని అభీష్టం ప్రకారం నడచుకుంటూ ఇతరులను కూడా దైవాభీష్టం ప్రకారం నడిపించడానికి కృషిచేశారు.

దైవప్రవక్తలు తమ తరఫున ఏమీ చెప్పలేదు. దేవుడు తమకిచ్చిన ఆదేశాలనే యధాతథంగా ప్రజలకు అందజేశారు. దేవుని ఆజ్ఞలలో హెచ్చుతగ్గులు చేయడంగాని, దేన్నయినా దాచడంగాని వారు చేయలేదు. దైవప్రవక్తలు మానవుల శ్రేయోభిలాషులు, పుణ్యపురుషులు, ఎంతో నీతిమంతులు. మంచి స్వభావం కలవారు వారి పవిత్రజీవితాన్ని, నీతినడవడికల్ని చూసి తప్పకుండా వారిని విశ్వసిస్తారు. దైవ ప్రవక్తలు తమను నమ్మి దైవాజ్ఞలను పాటించేవారికి పరలోకంలో భోగభాగ్యాలతో కూడిన స్వర్గం లభిస్తుందని శుభవార్త విన్పిస్తారు. తమను తిరస్కరించి అవిశ్వాసంలోనే పడివుండేవారు నరకయాతనలు అనుభవిస్తారని హెచ్చరిస్తారు. దేవుడు చేసిన మహోపకారాలను గుర్తుచేసి అలాంటి సృష్టికర్తను మాత్రమే ఆరాధించాలని చెప్పేవారు. ఈ విధంగా దైవప్రవక్తలు ప్రజలకు రక రకాలుగా నచ్చజెబుతూ ఎంతో ప్రేమగా, నమ్రతగా దైవధర్మాన్ని గురించి బోధించేవారు.

ముస్లింలు ప్రవక్తలందరినీ విశ్వసిస్తారు. వారిలో ఏమాత్రం వ్యత్యాసం చూపరు. వారు ఒక ప్రవక్తను విశ్వసించి, మరో ప్రవక్తను తిరస్కరించడం చేయరు. దైవప్రవక్తలలో ఏ ఒక్క ప్రవక్తను విశ్వసించకపోయినా

అతను ముస్లిం కాలేడు. ఏ ప్రవక్తల పేర్లు దివ్యఖుర్‌ఆన్‌లో తెలుపబడ్డాయో వారిని మనం పేరు తీసికొని విశ్వసిస్తాం. కాని ఏ దైవప్రవక్తల పేర్లు అందులో తెలుపబడలేదో వారు దైవప్రవక్తలని, లేదా దైవప్రవక్తలు కారని మనం నమ్మకంగా చెప్పలేము.

దైవప్రవక్తలకు అల్లాహ్ నిదర్శనాలు కూడా ఇచ్చాడు. తాము నిజమైన దైవప్రవక్తలమని రుజువు చేసుకోవడానికి వారు ఈ నిదర్శనాలను ప్రజల ముందు ప్రదర్శిస్తారు. ఈ నిదర్శనాలనే మహిమలు అంటాం. హజ్రత్ మూసా (అలై) తన చేతికర్ర కింద పడవేయగానే అది దైవాజ్ఞతో సర్పంగా మారిపోయేది. దాన్ని మళ్ళీ చేతిలోకి తీసుకోగానే యథాప్రకారం కర్రగా మారిపోతుంది. హజ్రత్ ఈసా (అలై) దేవుని ఆజ్ఞతో మృతులను బ్రతికించేవారు. అంధులకు చూపు తెప్పించేవారు. కుష్ఠురోగులకు చికిత్స చేసేవారు. మన ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు అల్లాహ్ అనేక మహిమలు ప్రసాదించాడు. ఒకే ఒక రాత్రి ఆయన్ని సప్తాకాశాల పర్యటన చేయించి, ఆ పర్యటనలో స్వర్గనరకాలు కూడా చూపించాడు. ఈ సంఘటనను "మేరాజ్" అంటారు. మన ప్రియప్రవక్త (సఅసం) చేసిన సైగతో చంద్రుడు రెండు ఖండాలుగా విడిపోయి తిరిగి కలుసుకోవడం జరిగింది. ఆయన తన వ్రేళ్ళకొనల నుంచి నీటిధారలను రప్పించేవారు. ఈ విధంగా ఆయన అనేక మహిమలు చూపారు. అయితే అన్నిటికంటే గొప్ప మహిమ దివ్యఖుర్‌ఆన్. ఇది ప్రళయం దాకా సురక్షితంగా ఉండే దైవగ్రంథం. దీని శైలిని, రచనా కౌశల్యాన్ని ఈనాటికీ ఎవరూ నకలు చేయలేకపోయారు. ఇకముందు కూడా ఎవరూ చేయలేరు.

గత దైవప్రవక్తలు వారి వారి కాలాలకు పరిమితమై ఉన్నారు. కాని మన ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం) రాక ప్రళయం వరకు వర్తిస్తుంది. ఆయన యావత్తు మానవాళి కోసం దైవప్రవక్తగా పంపబడ్డారు. అందుచేత ప్రపంచ మానవులంతా ఆయన్ని, ఆయన తెచ్చిన బోధనలను విశ్వసించవలసి ఉంటుంది. ఆయన్ని విశ్వసించడానికి నిరాకరించేవారు ముస్లింలు కాలేరు. పరలోకంలో వారిపై దేవుని ఆగ్రహం విరుచుకుపడుతుంది. మూసా, ఈసా ప్రవక్తల (అలై)తో పాటు ప్రతి దైవప్రవక్తా అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం)ని విశ్వసించి ఆయన చూపే పద్ధతి ప్రకారం నడచుకోవాలని తమ తమ అనుచర సముదాయాలకు నొక్కి చెప్పారు. కాని కొందరు మాత్రమే తమ ప్రవక్తలు చేసిన ఈ హితవులు పాటించారు. మిగిలినవారు మొండిగా తిరస్కరించి తమ పరలోక జీవితాన్ని నాశనం చేసుకున్నారు.

## దైవప్రవక్తలను గురించి మౌలిక విశ్వాసాలు

1. దైవప్రవక్తలు దేవుని దాసులు, మానవమాత్రులే.
2. దైవప్రవక్తలందరూ సత్యసంధులు. వారు ఎన్నటికీ అబద్ధమాడరు.
3. వారు నిజాయితీపరులు. దైవసందేశాన్ని ఎలాంటి హెచ్చుతగ్గులు చేయకుండా యధాతథంగా ప్రజలకు అందజేస్తారు. ఏ విషయాన్నీ దాచరు.
4. దైవప్రవక్తలందరూ నిజమైన జనశ్రేయోభిలాషులు. వారు పేరు ప్రతిష్ఠలు, స్వార్థప్రయోజనాల

కోసం పని చేసేవారుకారు. దైవప్రసన్నత కోసం దైవసందేశాన్ని ప్రజలకు చేరవేసే నిస్వార్థపరులు.

5. దైవప్రవక్తల వద్దకు దైవసందేశాన్ని దైవదూత హజ్రత్ జిబ్రయీల్ (అలై) తీసికొనివస్తారు.
6. దైవప్రవక్తలు పాపరహితులు. వారు ఎన్నటికీ పాపం చేయరు.
7. వారు దేవుని తరపున ప్రజలకు రుజుమార్గం చూపడానికి నియమించబడతారు.
8. అల్లాహ్ వారికి సామాన్యులకు తెలియని ఎన్నో అగోచర విషయాలు తెలియజేస్తాడు.
9. పాపఫలితం, పుణ్యఫలం, స్వర్గ, నరకాలను వారు కళ్ళారా చూసినంత దృఢంగా నమ్ముతారు.
10. దైవప్రవక్తలు ఒకవైపు స్వయంగా దేవుడ్ని ఆరాధిస్తూ ఆయన ఆజ్ఞలను పాటిస్తారు. మరోవైపు తాము పాటించే విషయాలను ప్రజలకు కూడా బోధిస్తారు.
11. మహనీయ ముహమ్మద్ (స) అంతిమ దైవప్రవక్త. ఇక ప్రళయం వరకు మరే ప్రవక్తా రాడు. ఒకవేళ ఎవరైనా తాను కూడా దైవ ప్రవక్తనని చెప్పుకుంటే అతను అబద్ధం చెబుతున్నాడని, అసత్యప్రవక్తని గ్రహించాలి. మన ప్రియప్రవక్త (స) ప్రవక్తృత్వం యావత్తు ప్రపంచం కోసం ఉంది. మానవులంతా అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ (స)ను విశ్వసించి ఆయన్ని అనుసరించాలి. అందులోనే వారి శ్రేయస్సు ఉంది.

## అభ్యాసం

### (అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి

1. రిసాలత్ (దైవదౌత్యం) దేన్నంటారు?
2. (దైవ) ప్రవక్తలు ప్రజలకు ఏఏ విషయాల గురించి బోధించారు?
3. దైవప్రవక్తల జీవితం ఎలా ఉండేది?
4. హజ్రత్ మూసా(అలై)కు అల్లాహ్ ఏ మహిమను ప్రసాదించాడు?
5. హజ్రత్ ముహమ్మద్(స) గారి దైవదౌత్యం గురించి మీకేం తెలుసు?

### ఆ) ఖాళీ స్థలాల్ని పూరించండి

1. మానవుల పట్ల నిజమైన ...............................
2. ముస్లింలు అందరూ ............... విశ్వసిస్తారు.
3. హజ్రత్ ముహమ్మద్ దైవదౌత్యం ..................వరకు ఉంటుంది.
4. ప్రవక్తలు, అల్లాహ్ దాసులు మరియు ..................

**ఇ) సరైన వాక్యంపై (✓) గుర్తు, తప్పు వాక్యంపై (X) గుర్తు పెట్టండి**

1. ప్రవక్తలందరూ పాపరహితులు ( )
2. దైవప్రవక్తల వద్దకు హ(జత్ మీకాయిల్ (అ) దైవవాణి తీసుకువచ్చేవారు. ( )
3. మహనీయ ముహమ్మద్(స) అన్నిటికన్నా గొప్ప మహిమ దివ్యఖుర్ఆన్ ( )
4. మహనీయ ఆదం (అలై) చిట్టచివరి దైవప్రవక్త. ( )
5. ప్రళయం వరకు ఏ ప్రవక్తా రాడు. ( )

**ఈ) క్రింది ప్రవక్తల పేర్లు వరుస క్రమంలో కాకుండా కింద మీదైపోయాయి. మీరు వారి పేర్లను సరైన వరుస క్రమంలో రాయండి.**

1) మహనీయ మూసా(అలై) 1) ..........................................

2) మహనీయ నూహ్ (అలై) 2) ..........................................

3) మహనీయ ఆదం (అలై) 3) ..........................................

4) మహనీయ ఇబ్రాహీం (అలై) 4) ..........................................

5) మహనీయ ముహమ్మద్(స) 5) ..........................................

6) మహనీయ ఈసా(అలై) 6) ..........................................



# 6. పరలోకం పట్ల విశ్వాసం

మన ఐదవ మౌలిక విశ్వాసం పరలోకం పట్ల విశ్వాసం కలిగివుండటం. అంటే మరణానంతర జీవితం పట్ల విశ్వాసం అన్నమాట. మనుషులు చనిపోయి మట్టిలో పోయాక మళ్ళీ బ్రతికే ప్రశ్నే లేదని చాలామంది అనుకుంటారు. మనుషులు చనిపోయిన తరువాత మరో జన్మ ఎత్తుతారని మరికొందరి నమ్మకం. అంటే పుణ్యకార్యాలు చేసి చనిపోతే వచ్చే జన్మలో మంచి మనుషులుగా పుడ్తారని, పాపకార్యాలు చేసి చనిపోతే వచ్చే జన్మలో ఏ పశువులుగానో పుడ్తారని వారు నమ్ముతున్నారు. వేరొక మాటలో చెప్పాలంటే పుణ్యకార్యాలకు మంచి ప్రతిఫలం, పాపకార్యాలకు శిక్ష ఈ ప్రపంచంలోనే లభిస్తాయని, వాటికోసం మరో ప్రపంచం లేదని అర్థం అన్నమాట!

ఇవన్నీ తప్పుడు అభిప్రాయాలు మానవుల కల్పితాలు. మరణానంతరం ఏం జరుగుతుందో మనం స్వయంగా చూడలేము. చనిపోయినవారిని కలుసుకొని కూడా తెలుసుకోలేము. అలాంటప్పుడు మరణా నంతరం సంభవించే విశేషాలు మనకు ఎలా తెలుస్తాయి? కాని దైవప్రవక్తలను విశ్వసించేవారికి ఇది పెద్ద సమస్య కాదు. దైవప్రవక్తలు మరణానంతరం ఎదురయ్యే పరిస్థితులు కూడా మనకు తెలియజేశారు. మనమంతా చనిపోయిన తరువాత తిరిగి బ్రతికించబడతామని వారు తెలిపారు. ఈ పని దేవునికి అసాధ్యమేమీ కాదు. ఆయనే మనల్ని ఇదివరకు పుట్టించాడు. మనం మళ్ళీ బ్రతికించబడిన తరువాత హాషర్ మైదానంలో గుమిగూడుతాము. అక్కడ దేవుని సన్నిధిలో ప్రవేశపెట్టబడతాము. మన కర్మలను గురించి విచారణ జరుగుతుంది. ప్రతి ఒక్కరికి తమ తమ ఆచరణలను బట్టి ప్రతిఫలం లభిస్తుంది. చనిపోయిన తరువాత తిరిగి బ్రతికించబడి ఆచరణల విచారణ, తీర్పు జరిగే రోజును 'అంతిమ దినం' అంటారు.

ప్రముఖ దైవదూత హజ్రత్ ఇస్రాఫీల్ (అలై) బూర నోట్లో పెట్టుకొని ఎప్పుడు దైవాజ్ఞ అవుతుందా? ఎప్పుడు ఊదాలా? అని ఎదురుచూస్తూ సిద్ధంగా ఉన్నారని మనం గత పేజీలలో తెలుసుకున్నాం. ఆ దైవదూత మొదటి సారి బూర ఊదగానే యావత్తు విశ్వవ్యవస్థ విచ్ఛిన్నమైపోతుంది. ఆ శబ్దానికి ఏ ప్రాణీ సజీవంగా ఉండదు. సర్వనాశనం అవుతుంది. ఫలానా చోట భూకంపం వచ్చిందని, ఫలానా చోట వరదలు వచ్చాయని, ఫలానా చోట ప్లేగు వ్యాధి ప్రబలిందని, లక్షల మంది జనం చనిపోయారని, ఊళ్ళకు ఊళ్ళు నేలమట్టం అయ్యాయని మనం అప్పుడప్పుడు వింటున్నాం. ఈ చిన్న చిన్న భూకంపాలు, వరదలను చిరుప్రళయాలు అంటారు. చివరికి ఏదో రోజు ఉన్నట్లుండి భయంకరమైన భూకంపం వచ్చి యావత్తు ప్రపంచాన్ని ఊపేస్తుంది. క్షణాలలో సర్వనాశనమయి పోతుంది. గ్రామాలు, నగరాలు, కొండలు, నదులు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు- ఒకటేమిటి, యావత్తు విశ్వమే నాశనం అవుతుంది.

ఆ తరువాత హజ్రత్ ఇస్రాఫీల్ (అలై) రెండవసారి బూర ఊదగానే మృతులు తిరిగి సజీవులయి హష్ర్ మైదానంలో గుమిగూడుతారు. ఆచరణల విచారణ జరుగుతుంది. ఒక్కొక్క ఆచరణను గురించి లెక్క తీసుకోవడం జరుగుతుంది. మనం గత పేజీలలో "కిరామన్ కాతిబీన్" దూతలను గురించి కూడా

చదివి ఉన్నాం. ప్రతి మానవుని వెంట అనుక్షణం ఇద్దరు దైవదూతలు ఉంటారు. మనిషి నోట వెలువడే ప్రతి మాటను, అతను చేసే ప్రతి పనినీ వారు నమోదు చేస్తారు. అంతిమ దినాన వారు తమ నివేదికలను విశ్వప్రభువు ముందు పెడతారు. దేవుని ముందు ఏదీ రహస్యంగా ఉండదు. ఆయనకు మానవుల హృదయాలలో మెదిలే విషయాలు కూడా తెలుసు. ఆ రోజు ఎవరూ అబద్ధమాడలేరు. ఎవరికీ ఎవరి బంధుత్వం, స్నేహాలు పనికిరావు. ఎవరూ తప్పుడు సిఫారసు చేయలేరు. ముస్లింలు మరచిపోయి చేసిన పాపాల క్షమాపణ కోసం ప్రియప్రవక్త (స) సిఫారసు చేస్తారు.

ఆ రోజు మానవులంతా రెండు వర్గాలుగా విడిపోతారు. ఒకటి, విశ్వాసుల వర్గం. రెండు, అవిశ్వాసుల వర్గం. దేవుణ్ని, ఆయన ప్రవక్తలను విశ్వసించి సన్మార్గాన నడుస్తూ, దుష్కార్యాలు మాని సత్కార్యాలు చేస్తూ, ప్రతి ఒక్కరి హక్కును నెరవేర్చినవారి పట్ల దేవుడు ప్రసన్నుడవుతాడు. వారికి బహుమానంగా స్వర్గం ప్రసాదిస్తాడు. ఆ స్వర్గంలో వారు శాశ్వతంగా ఉంటారు. వారికి భిన్నంగా దేవుణ్ని, ఆయన ప్రవక్తలను నిరాకరించి తాము స్వయంగా దుష్కార్యాలు చేయడమే గాకుండా ఇతరుల్ని కూడా సన్మార్గం తప్పించి పాపకూపంలో పడవేసినవారిపై, అన్యాయం-అక్రమాలు, దుర్మార్గం-దౌర్జన్యాలతో దేవుని పుడమిపై సంక్షోభం సృష్టించినవారిపై దేవుని ఆగ్రహం విరుచుకుపడుతుంది. ఆయన వారిని నరకంలో పడవేసి కఠిన యాతనలకు గురిచేస్తాడు. ఆ రోజు ఏ ఒక్కడూ దేవుని పట్టు నుండి తప్పించుకోలేడు. అవిశ్వాసులకు ఆ రోజు ఎంతో కఠినమైన దుర్దినం. యావత్తు ప్రపంచ సంపద ఇచ్చినా ఆ రోజు శిక్ష నుండి ఎవరూ తప్పించుకోలేరు.

**స్వర్గం :** స్వర్గం పుణ్యాత్ముల నిలయం. పచ్చటి ఉద్యానవనాలతో, చల్లటి సెలయేరులతో కూడిన ప్రాంతమే స్వర్గం. స్వర్గంలో రకరకాల పండ్లు, ఫలాలు, ఇతర అనేక ఆహార వస్తువులు వగైరా ఉంటాయి. అందమైన, ఖరీదైన బట్టలు కూడా ఉంటాయి. స్వర్గవాసులు తాము కోరిన పదార్థాలు తింటారు, తాగుతారు. తాము కోరుకున్న దుస్తులు ధరిస్తారు. స్వర్గంలో ఎంతో శ్రేష్ఠమైన ఆభరణాలు, అద్భుతమైన మేడలు కూడా ఉంటాయి. ఒక్కమాటలో చెప్పాలంటే అక్కడ భోగభాగ్యాలకు సంబంధించిన సరంజామా అంతా ఉంటుంది. ఎటు చూసినా రంగరంగ వైభవాలే కన్పిస్తాయి. స్వర్గంలో ఎవరూ జబ్బుపడరు. మృత్యువు అసలే ఉండదు. ఎవరికీ ఎలాంటి బాధ, దుఃఖం ఉండవు. సర్వత్రా సుఖసంతోషాలు వెల్లివిరుస్తుంటాయి. కనీ వినీ ఎరగని భోగభాగ్యాలు ఉంటాయి. కోరిన ప్రతి వస్తువూ లభిస్తుంది. స్వర్గంలో ఒకసారి ప్రవేశించినవారికి ఇక అక్కడ్నుంచి తీసేయడం జరగదు. శాశ్వతంగా స్వర్గంలోనే ఉంటారు.

**నరకం :** నరకం సత్యతిరస్కారుల నిలయం. నరకంలో రకరకాల బాధలు, యాతనలు ఉంటాయి. కనీ వినీ ఎరగని కఠినమైన యాతనలు ఉంటాయి. అక్కడ భగభగమండే అగ్నిమంటలు, భయంకరమైన పాములు, తేళ్ళు, కొండ చిలువలు ఉంటాయి. నరకవాసులకు అక్కడ తినడానికి ముళ్ళతో కూడిన చేదు పండ్లు, ఆకులు మాత్రమే లభిస్తాయి. తాగడానికి సలసల మరిగే నీళ్ళు, చీము, నెత్తురు

ఉంటాయి. నరకవాసులు వాటిని తాగగానే వారి నోళ్ళు, ముఖాలు మాడిపోతాయి. ఆ బాధలు భరించలేక వారు మృత్యువుని పిలుస్తారు. కాని వారికి మృత్యువు రాదు. దేవుడు మనల్ని జీవితాంతం సన్మార్గాన నడిపించి ఇహపరలోకాలలో సాఫల్య భాగ్యం ప్రసాదించుగాక!

**పరలోకానికి సంబంధించిన మౌలిక విశ్వాసాలు**

1. ఏదో ఒకరోజు యావత్ప్రపంచం అంతమవుతుంది.
2. మరణం తర్వాత మానవులందర్నీ మళ్ళీ బ్రతికించడం జరుగుతుంది.
3. మానవులందరూ ఆచరణల విచారణ కోసం 'హష్ర్' మైదానంలో గుమిగూడుతారు.
4. మానవుల సదాచరణలు, దురాచరణలు అన్నీ ముందుకు వస్తాయి.
5. అల్లాహ్ స్వయంగా ప్రతి ఒక్కరి నుండి లెక్క తీసుకొని వారి వారి ఆచరణలను బట్టి ప్రతిఫలం ఇస్తాడు.
6. ఆ రోజు ఎవరూ తమ ఆచరణలను దాచలేరు.
7. అక్కడ న్యాయంగా, నిష్పక్షపాతంగా తిరుగులేని తీర్పు జరుగుతుంది.
8. విశ్వాసుల్ని, అవిశ్వాసుల్ని ఒకే దృష్టితో చూడటం జరగదు. ప్రతి ఒక్కడికి అతని కర్మలనుబట్టి స్వర్గం లేక నరకం లభిస్తుంది.
9. అక్కడ ఎవరూ అబద్ధమాడలేరు ఒకరికొకరు తోడ్పడలేరు తప్పుడు సిఫారసు అంగీకరించబడదు.
10. దైవప్రవక్తలు దేవుడు అనుమతించినవారి విషయంలో మాత్రమే సిఫారసు చేస్తారు. అంతేగాని వారంతటవారు ఎవరి విషయంలో కూడా సిఫారసు చేయలేరు.
11. ఆ రోజు ఎవరూ అల్లాహ్ పట్టు నుండి తప్పించుకోలేరు. ఆయన నిర్ణయానికి తిరుగుండదు. అందుకే ముస్లింలు ఇహలోకంలో పరలోక విచారణను గురించి తలచుకుని భయపడుతూ చెడ్డపనుల జోలికిపోరు.
12. విశ్వాసులు శాశ్వతంగా స్వర్గసుఖాలు అనుభవిస్తుంటారు.
13. అవిశ్వాసులు శాశ్వతంగా నరకాగ్నిలో మాడిపోతుంటారు.

رَبَّنَا اصْرِفْ عَنَّا عَذَابَ جَهَنَّمَ إِنَّ عَذَابَهَا كَانَ
غَرَامًا

ఓ మా ప్రభూ! మమ్మల్ని నరక యాతనల నుండి రక్షించు. నరక యాతనలు నిజంగా ఎంతో బాధాకరంగా ఉంటాయి.

**నోటు :** ఈమానె ముఫస్సల్‌లో ఏడు విషయాలపై విశ్వాసం కలిగి ఉండాలని తెలుపబడింది.

ఇక్కడ మేము ఐదు విషయాలను గురించి తెలియజేశాము. అదృష్టం (విధినిర్ణయం)కు సంబంధించిన విశ్వాసం దేవుని పట్ల విశ్వాసంలో చేరివుంది. అదే విధంగా మరణానంతరం జీవించడమనే విషయం పరలోక విశ్వాసంలో చేరివుంది.

## అభ్యాసం

**అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి?**

1. పరలోకం దేన్నంటారు?
2. పరలోకం గురించి ప్రజల భావనలు ఎలా ఉన్నాయి?
3. పరలోకం గురించి దైవప్రవక్తల బోధనలు ఎలా ఉన్నాయి?
4. ప్రళయం రోజు ఏమి జరుగుతుంది?
5. స్వర్గం ఎవరికి లభిస్తుంది?
6. నరకం ఎవరి నివాసమై ఉంటుంది?
7. ప్రళయ మైదానంలో మానవులు ఎందుకని ప్రోగు (జమ) చేయబడతారు?

**ఆ) క్రింది ఖాళీలను పూరించండి.**

1. హజ్రత్ ఇస్రాఫీల్ (అలై) మొదటిసారి .......................... ఊదినప్పుడు ప్రపంచమంతా అతలాకుతలమై సర్వనాశనం అయిపోతుంది.
2. మనిషి యొక్క అన్ని మంచీ చెడు .................. ముందుకు వచ్చేస్తాయి.
3. ప్రళయం రోజు ప్రజలందరూ ............. వర్గాల్లో విభజించబడతారు.
4. ................................... కళకళలాడే పచ్చని ఉద్యాన వనాల పేరు.
5. ................................... అగ్నితో నిండిన ఒక లోతైన గుహ.

**ఇ) చేయవలసిన ఇంకొన్ని పనులు**

స్వర్గం, నరకం గురించి నాలుగేసి వాక్యాల్లో వ్రాయండి.



# 7. జుమా నమాజ్

శుక్రవారం చేసే నమాజును 'ఫరజె ఐన్' అంటారు. అంటే శుక్రవారం రోజు ముస్లింలు తప్పనిసరిగా సామూహిక నమాజు చేయాలి. చేయనవసరంలేదని వాదించేవారు ముస్లింలు కారు. "విశ్వాసులారా! శుక్రవారం సమావేశం (జుమా) రోజున నమాజు కోసం పిలుపునిచ్చినప్పుడు మీరు వెంటనే అమ్మకం, కొనుగోళ్ళ వ్యవహారాలు వదిలేసి దైవస్మరణ (ధర్మబోధ) వైపు పరుగెత్తండి" అని దివ్యఖుర్ఆన్ స్పష్టంగా చెబుతోంది. హదీసులలో కూడా శుక్రవారం నమాజు సామూహికంగా తప్పనిసరిగా చేయాలని నొక్కి చెప్పడం జరిగింది. ఒకసారి మన ప్రియప్రవక్త (సఅసం) ముస్లింలను సంబోధిస్తూ ఇలా అన్నారు: "ముస్లింలారా! శుక్రవారం మీ కోసం అల్లాహ్ పండుగ దినంగా చేశాడు. ఆ రోజు స్నానం చేయండి. సుగంధ పరిమళాలుంటే పూసుకోండి. మిస్వాక్‌తో పళ్ళు తప్పకుండా తోముకోండి." ఇంకా ఆయన (సఅసం) ఇలా అన్నారు: "శుక్రవారం ఇతర దినాలకు సర్దారు లాంటి దినం. ఆరోజు అల్లాహ్‌కు అన్ని రోజుల కంటే శ్రేష్ఠమైన రోజు. పండుగ దినాల కంటే శుక్రవారం అల్లాహ్ దృష్టిలో ఉత్తమ దినంగా భావించబడింది. గత జాతులలో కూడ శుక్రవారం శుభదినంగా పరిగణించబడింది. కాని ఆ జాతుల వారు శుక్రవార పవిత్రతను విస్మరించారు. యూదులు శనివారాన్ని శుభదినంగా చేసు కున్నారు. క్రైస్తవులు ఆదివారాన్ని శుభదినంగా చేసుకున్నారు. కాని ముస్లింలు మొదటి నుండి శుక్ర వారాన్ని శుభదినంగా పరిగణిస్తూ దాని పవిత్రత, ఔన్నత్యాలను నిలబెట్టుకొన్నారు.

### జుమా నమాజు కోసం సన్నాహాలు

మన ప్రియప్రవక్త (సఅసం) గురువారం నుండే శుక్రవారం నమాజు కోసం సన్నాహాలు చేసేవారు. "గురువారం రాత్రి తెల్లరాత్రి, శుక్రవారం పగలు ప్రకాశవంతమైన పగలు. ఎలాంటి కారణం లేకుండా శుక్రవారం జుమా నమాజు చేయనివారు కఠినంగా శిక్షించబడతారు" అన్నారు ఆయన. "శుక్రవారం జుమా నమాజులో పాల్గొననివారి ఇండ్లను తగలబెట్టాలని నా మనస్సుకోరుతుంది" అని కూడా ఆయన అన్నారు. దైవప్రవక్త (సఅసం) ఒకసారి శుక్రవారం ప్రాముఖ్యాన్ని గురించి చెబుతూ, "ఎవరైతే శుక్ర వారం రోజు శుభ్రంగా స్నానం చేసి, తలకు నూనె రాసుకొని, సుగంధ పరిమళాలు పూసుకొని మసీదుకు వెళ్ళి మొదటి నుండి మస్జిదులో కూర్చున్నవారిని లేపకుండా దొరికిన చోట నమ్రతతో కూర్చొని, నఫిల్ నమాజు చేసి, ఇమాంగారు ఇచ్చే 'ఖుత్బా' ఉపన్యాసాన్ని మౌనంగా వింటారో అలాంటివారు గత శుక్రవారం నుండి ఇప్పటి వరకు చేసిన పాపాలను అల్లాహ్ క్షమిస్తాడు" అని అన్నారు.

మనం ప్రతి శుక్రవారం క్రమం తప్పకుండా జామియా మస్జిదులో సామూహిక నమాజు చేస్తుంటాం. గురువారం నుండే జుమా నమాజు కోసం ఎదురు చూస్తుంటాం. బట్టలు ఉతికి శుభ్రం చేసుకుంటాం. అత్తరు తెచ్చుకొంటాం. శుక్రవారం తెల్లవారగానే స్నానం చేసి ఉతికిన బట్టలు వేసుకొంటాం. తలకు నూనె రాసుకుంటాం. అత్తరు పూసుకుంటాం. సుర్మా పెట్టుకుంటాం. శుక్రవారపు సామూహిక నమాజు

కోసం వీలైనంత త్వరగా జామియా మస్జిద్‌కు వెళ్ళి కూర్చుంటాం. నఫిల్, సున్నత్ నమాజులు చేస్తాం. అల్లాహ్‌ను స్తుతిస్తూ కూర్చుంటాం. అందరికన్నా ముందు మస్జిద్‌కు చేరుకొనే వ్యక్తికి దైవమార్గంలో ఒక ఒంటెను ఖుర్బానీ ఇస్తే ఎంత పుణ్యమో అంత పుణ్యం ఆ వ్యక్తికి లభిస్తుంది. తరువాత వచ్చేవారికి ఆవును ఖుర్బానీ చేసినంత పుణ్యం లభిస్తుంది. ఆ తరువాత వచ్చేవారికి కోడిని ఖుర్బానీ చేసినంత పుణ్యం లభిస్తుంది. ఆ తరువాత వచ్చేవారికి దైవమార్గంలో ఒక కోడిగుడ్డు దానం చేసినంత పుణ్యం ఉంటుంది. ఇమాం ఖుత్బా (ఉపన్యాసం) ఇవ్వడం ప్రారంభించగానే దైవదూతలు తమ రిజిస్టర్‌ని మూసేసి ఉపన్యాసం వింటారు.

## జుమా నమాజు తప్పనిసరిగా ఎవరు చేయాలి?

ప్రయాణీకులు, వ్యాధిగ్రస్తులు, అంధులు, మహిళలు, పిల్లలు తప్ప మిగిలిన ముస్లిములందరూ జుమా నమాజు విధిగా చేయాలి. వీలైనంత ఎక్కువ మంది గుమిగూడటానికి ఈ నమాజు జామియా మస్జిద్‌లో చేయాలి. అందరూ కలసి నమాజు చేయడంలో ఇస్లాం ఔన్నత్యం, వైభవాలు బహిర్గతమవుతాయి. జుమా నమాజు విధిగా చేయనవసరంలేని వారు కూడా ఈ నమాజులో పాల్గొంటే వారి జుమా నమాజు నెరవేరుతుంది. ఆ రోజు వారు 'జుహర్' నమాజు చేయనవసరం లేదు. పిల్లలు అలవాటు చేసుకోవడానికి జుమా నమాజు చేస్తూనే ఉన్నారు.

**వేళ :** శుక్రవారపు జుమా నమాజు వేళ మధ్యాహ్నం పొద్దువాలిన తరువాత ప్రారంభమవుతుంది. జుమా నమాజు ప్రారంభ సమయంలో చేయడం ఉత్తమం. దైవప్రవక్త (సఅసం) అనుచరులు జుమా నమాజు చేయనంతవరకు మధ్యాహ్నం విశ్రాంతి తీసుకోరు, భోజనం చేయరు. 'జుహర్' వేళ దాటిపోతే ఇక జుమా నమాజు చేయడం ధర్మసమ్మతం కాదు.

**నమాజు చేసే విధానం:** శుక్రవారం రోజు జుమా నమాజు కోసం మసీదు నుండి అజాన్ (పిలుపు) వినగానే ముస్లింలు తమ తమ పనులు వదిలేసి మస్జిద్ వైపు పరుగెత్తుతారు.

మస్జిద్‌లో నాలుగు రకాతులు సున్నత్ నమాజు చేస్తారు. ఇమాంగారు జుమా ప్రసంగం కోసం మెంబరు (వేదిక)పై కూర్చోగానే ఖుత్బా కోసం ముఅజ్జిన్ రెండవ అజాన్ ఇస్తారు. అజాన్ తరువాత ఇమాంగారు మొదటి ప్రసంగం చేస్తారు. ఆ ఉపన్యాసాన్ని అందరూ నిశ్శబ్దంగా కూర్చొని వింటారు. ఇమామ్ ఉపన్యాసం ఇస్తున్నప్పుడు ఎవరూ మాట్లాడకూడదు. చివరికి సలాం, ప్రతిసలాంలు కూడా చేయకూడదు. అలాగే దుఆ, నఫిల్ నమాజులు కూడా చేయకుండా ప్రసంగాన్ని శ్రద్ధగా వినాలి. మొదటి ఉపన్యాసంలో ఇమాంగారు అల్లాహ్ ఘనతను శ్లాఘిస్తారు. ప్రియప్రవక్త (సఅసం) కోసం దరూద్ సమర్పిస్తారు. ఆ తరువాత దివ్యఖుర్‌ఆన్ నుండి కొన్ని వాక్యాలు, హదీసులలో కొన్నిటిని వినిపిస్తూ ముస్లింలకు హితబోధ చేస్తారు. పరలోక శిక్షలను గురించి హెచ్చరిస్తారు. చెడు పనులకు దూరంగా ఉండాలని ఉద్బోధ చేస్తారు. సత్కార్యాలు చెయ్యడానికి ప్రేరేపిస్తారు. సజ్జనులకు స్వర్గభాగ్యాలు లభిస్తాయని

శుభవార్త వినిపిస్తారు. జుమా ప్రసంగం అరబ్బీ భాషలో ఉంటుంది. అయితే అనేకచోట్ల దాన్ని సంక్షిప్తంగా ఉర్దూలో లేదా ప్రాంతీయ భాషలో అనువదించి విన్పిస్తారు. మొదటి ప్రసంగం ముగిసిన తరువాత ఇమాంగారు కాస్సేపు కూర్చుంటారు. తరువాత లేచి రెండవ ప్రసంగం చేస్తారు. ఇందులో అల్లాహ్ పవిత్రత స్తుతించబడుతుంది. ప్రియప్రవక్త (స)కు దరూద్, సలాంలు సమర్పించబడతాయి. ప్రవక్త సహచరుల గుణగణాలు కొనియాడబడతాయి. వారి కోసం ప్రార్థన చేయబడుతుంది. సాధారణ ముస్లింల కోసం, ఇస్లాం ఉన్నతి కోసం కూడా ప్రార్థనలు చేయబడతాయి. ఆ తరువాత రెండు రకాతుల ఫరజ్ నమాజ్ సామూహికంగా చేయబడుతుంది.

ప్రియప్రవక్త (స) జుమా ప్రసంగం సంక్షిప్తంగా చేసేవారు. నమాజు చేసేందుకు ఖుత్బా కంటే ఎక్కువ సమయం తీసుకునేవారు. అయితే బలహీనులు, పసిపిల్లలు కూడా ఉంటారు గనక నమాజు కూడా సుదీర్ఘంగా చేసేవారుకారు. ఫరజ్ నమాజు తరువాత రెండు లేదా నాలుగు రకాతుల సున్నత్ నమాజు చేయాలి. కొందరు ఆరు రకాతుల సున్నత్ నమాజు చేస్తారు.

**జుమా నమాజు విషయంలో గుర్తుంచుకోవలసిన మాటలు**

1. జుమా నమాజు కోసం ఇచ్చే అజాన్ వినగానే ముస్లింలు తమ వ్యాపారం వగైరా ఉపాధి కార్యకలాపాలు వదలివేయాలి. అజాన్ తరువాత వ్యాపార కార్యకలాపాలలో నిమగ్నమై ఉండడం ధర్మసమ్మతం కాదు.
2. జుమా నమాజు వేళ జుహర్ నమాజు వేళ ఒక్కటే. అయితే జుమా నమాజు ప్రారంభ వేళలోనే చేయడం ఉత్తమం. 'జుహర్' వేళ దాటిపోయిన తరువాత జుమా నమాజు చేయడం ధర్మసమ్మతం కాదు.
3. ముగ్గురు ఉన్నా సరే, జుమా నమాజు సామూహికంగా చేసుకోవాలి. ముగ్గురికన్నా తక్కువ మంది ఉంటే జుహర్ నమాజు చేసుకోవాలి.
4. జుమా నమాజు జామియా మసీదులో చేయాలి. అధిక జనాభా ఉండే పట్టణాలలో జుమా నమాజు చేయాలి.
5. జుమా ప్రసంగం జరుగుతున్నప్పుడు మాట్లాడటం, ఖుర్ఆన్ పఠించడం, సలాం చేయడం, దానికి జవాబివ్వడం ఏవీ చేయకూడదు. నఫిల్, సున్నత్ నమాజులు కూడా చేయకూడదు. ప్రసంగానికి పూర్వమే ఏదైనా నమాజు ప్రారంభిస్తే దాన్ని పూర్తిచేసుకోవాలి.
6. శుక్రవారం రోజు జుమా నమాజుకు ముందు రెండుసార్లు అజాన్ చెబుతారు. మొదటి అజాన్ జుమా ప్రసంగానికి ముందు, రెండవ అజాన్ జుమా ప్రసంగం చేయడానికి ఇమామ్ మింబరుపై కూర్చున్నప్పుడు.
7. శుక్రవారం స్నానం చేయాలి. శుభ్రమైన బట్టలు వేసుకోవాలి. కళ్ళకు సుర్మా పెట్టుకోవాలి. గోళ్ళు కత్తిరించుకోవాలి.

8. మసీదులో స్థలం ఎక్కడ దొరికితే అక్కడ కూర్చోవాలి. కూర్చున్నవాళ్లను తోసుకుంటూ వారి పైనుంచి దాటిపోయి ముందు వరుసలో కూర్చోవడానికి ప్రయత్నించకూడదు. మొదటి వరుసలో కూర్చోదలచుకుంటే ముందుగానే వచ్చి కూర్చోవాలి.
9. పట్టణంలో అందరికంటే ఎక్కువ విద్యాజ్ఞానాలు, పలుకుబడి గల ధర్మపరాయణుడైన మనిషి జుమా ప్రసంగం చేయాలి. అందరూ ఆసక్తితో వినేలా అతను బిగ్గరగా, ఎంతో ఉత్సాహంతో ప్రసంగం చేయాలి.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. జుమా నమాజు హెూదా ఏమిటి?
2. జుమా నమాజును ఫర్జె ఐన్‌గా అంగీకరించని వ్యక్తి గురించి ఆదేశమేమిటి?
3. ప్రియప్రవక్త(స) జుమా గురించి ఏవిధంగా సన్నాహాలు చేసేవారు?
4. ఏ వ్యక్తులపై జుమా నమాజు ఫర్జ్ కాదు?
5. జుమా నమాజు వేళ ఏది?
6. ప్రసంగం (ఖుత్బా) జరుగుతున్నప్పుడు ఏ విషయాలు నిషేధితం?
7. జుమా నమాజు పద్ధతి ఏమిటి?
8. జుమా నమాజు ఎక్కడ చేయాలి?
9. జుమా నమాజు కోసం ఏ విషయాల గురించి ఏర్పాట్లు చేసుకోవాలి?

**ఆ) క్రింది ఖాళీలను పూరించండి.**

1. జుమా రోజు అన్ని రోజులకు ............. లాంటిది.
2. అల్లాహ్ ఆదేశమేమిటంటే ................అజాన్ కాగానే తమ కార్యకలాపాలన్నీ మానేసి అల్లాహ్ స్తోత్రం వైపునకు పరుగెత్తండి.
3. జుమా నమాజు ........... లో నెరవేర్చాలి. (చేయాలి)
4. జుమా నమాజు కోసం ....... అజాన్‌లు అవుతాయి.
5. క్రైస్తవులు ..................... రోజును పవిత్రంగా భావించరు.

6. ప్రియప్రవక్త ........................... క్లుప్తంగా ఇచ్చేవారు, ఇంకా నమాజు ఖుత్బా కన్నా దీర్ఘంగా ఉండేది.

**ఇ) ఈ క్రింది వాక్యాల్లో సరైన వాటిపై ( ✓) గుర్తు, తప్పు వాక్యంపై (X) గుర్తు పెట్టండి**

1. జుమా నమాజు ప్రయాణీకులు, రోగులు, అంధులు, స్త్రీలు, పిల్లలే కాకుండా ముస్లింలందరిపై 'ఫర్జ్' అయివుంది. (   )
2. జుమా నమాజు తమ వీధి మస్జిద్‌లో చేయాలి (   )
3. ముగ్గురు వ్యక్తులు ఉన్నా కూడా జుమా నమాజు చేసుకోవాలి (   )
4. జుమా అజాన్ అయిన తరువాత కూడా క్రయ విక్రయాలు జరుపుకోవచ్చు. (   )
5. జుమా రోజు సువాసన (అత్తర్) రాసుకోవడం సున్నత్. (ప్రవక్త(స)గారి సంప్రదాయం) (   )
6. జుహర్ వేళ గడిచిపోయిన తరువాత కూడా జుమా నమాజు చేసుకోవడం ధర్మసమ్మతమే. (జాయెజ్) (   )

**ఈ) ఈ క్రింది వాటిని జత పరచండి**

| | అ | ఇ |
|---|---|---|
| 1. | యూదుల పవిత్ర దినం | జామె మస్జిద్ |
| 2. | ముస్లింల పవిత్ర దినం | శనివారం |
| 3. | మింబర్ | జుమా (శుక్రవారం) |
| 4. | జుమా నమాజ్ | ఖుత్బా ఇచ్చే (ప్రసంగం చేసే) చోటు |



# 8. పండుగ నమాజు

ముస్లింలకు రెండేరెండు పండుగ నమాజులు ఉన్నాయి. ఒకటి, ఈదుల్ ఫిత్ర్ నమాజ్. అంటే రమజాన్ పండుగ నమాజ్. రెండోది, ఈదుల్ అజ్హా అంటే బక్రీద్ నమాజ్. మన ప్రియప్రవక్త (సఅసం) మక్కా నుండి మదీనాకు వలసపోయినప్పుడు అక్కడివారు రెండు రోజులు పండుగ దినాలుగా పాటించే వారు. దైవప్రవక్త (స) విచారిస్తే, తాము ఇస్లాం స్వీకరించక పూర్వం ఈ రెండు దినాలలో ఆనందోత్సవాలు జరుపుకునేవాళ్ళం అన్నారు మదీనా వాసులు. అప్పుడు దైవప్రవక్త (సఅసం), "మీ కోసం దేవుడు ఈ రెండు రోజులకు బదులు అంతకంటే శ్రేష్ఠమైన రెండు రోజులు పండుగ దినాలుగా నిర్ణయించాడు. అవి ఈదుల్ ఫితర్, ఈదుల్ అజ్హా" అని చెప్పారు.

దేవుడు తన ప్రవక్త ముహమ్మద్ (స)పై ఖుర్ఆన్ లాంటి మహాభాగ్యం అవతరింపజేసినందుకు ముస్లింలు తమ ఆనందోత్సాహాలు వ్యక్తపరచుకుంటూ ఈదుల్ ఫిత్ర్ పండుగ జరుపుకొంటారు. దివ్యఖుర్ఆన్‌లో ఇహపర లోకాల మేళ్ళు ఉన్నాయి. మంచి-చెడులకు సంబంధించిన సమస్త విషయాలు స్పష్టంగా పేర్కొనబడ్డాయి. మనం రమజాన్ నెలంతా తరావీ నమాజులలో కూడా ఖుర్ఆన్ పఠిస్తాము. దేవుడు మనకు విధిగా చేసిన రమజాన్ ఉపవాసాలు కూడా పాటిస్తాం.

ఈ పండుగను మనం షవ్వాల్ నెల మొదటి తారీఖున జరుపుకుంటాం. దేవుడు మనకు రమజాన్ శుభాలను ప్రసాదించినందుకు కృతజ్ఞతగా ఆ రోజు రెండు రకాతులు నమాజు చేస్తాము.

ఈదుల్ అజ్‌హా (బక్రీద్ పండుగ)ను మనం హజ్రత్ ఇస్మాయీల్ (అలై) చేసిన త్యాగం జ్ఞాపకార్థంగా, హజ్ యాత్ర సంతోషంలో జరుపుకొంటాం. మనం హజ్ విధి నిర్వహించడానికి, ఖుర్బానీ సంప్రదాయాన్ని సజీవంగా ఉంచడానికి దేవుడు మనకు ఈ శుభదినాన్ని నిర్ణయించాడు. యావత్తు మానవులు దేవుని దాసులని, ఒక్క దేవుడు మాత్రమే ఆరాధనకు అర్హుడని, ఆయన తప్ప మరెవరూ ఆరాధనకు, ప్రశంసలకు అర్హుడు కాడని, మానవులంతా సమానులని, ఎవరిపై ఎవరికీ ఆధిక్యత లేదని మనం హజ్ ద్వారా ప్రకటిస్తున్నాం.

మనం ఈ పండుగ సమయంలో ఖుర్బానీ (జంతుబలి) ఇస్తాం. ఎందుకు? హజ్రత్ ఇబ్రాహీం (అలై) అల్లాహ్ ప్రసన్నత కోసం తన ప్రియ కుమారుని గొంతుపై కత్తిపెట్టి బలివ్వడానికి సిద్ధమయ్యారు. హజ్రత్ ఇస్మాయీల్ (అలై) కూడా సంతోషంగా దేవుని కోసం తన ప్రాణం ఇవ్వడానికి ముందుకు వచ్చారు. అందుకే మనం కూడా అవసరమయితే దైవమార్గంలో ప్రాణత్యాగం చెయ్యడానికి సిద్ధంగా ఉంటామని ఈ ఖుర్బానీ (జంతు బలి) ద్వారా ప్రకటిస్తున్నాము. అసలు మన నమాజులు, ఖుర్బానీలు, జీవన్మరణాలు అన్నీ ఆయన కోసమే కదా! ఈ భాగ్యాలు ప్రసాదించినందుకే దేవునికి కృతజ్ఞతగా జిల్‌హజ్జ నెల పదో తేదీన మనం రెండు రకాతులు నమాజ్ చేస్తున్నాం.

ఈదుల్ ఫిత్ర్, ఈదుల్ అజ్‌హా (పండుగ) నమాజులు మనం ఈద్‌గాహ్ వెళ్ళి చేస్తాం. పండుగ

రోజు స్నానం చేస్తాం, మిస్వాక్‌తో పళ్ళు తోముకొంటాం. మంచి దుస్తులు ధరిస్తాం. అత్తరు పూసుకొంటాం. అమితానందంతో కాలినడకన ఉదయాన్నే నమాజు కోసం ఈద్‌గాహ్ చేరుకుంటాం. ఈదుల్ ఫిత్ర్ పండుగ అయితే కొద్ది తీపి పదార్థం తిని మెల్లగా తక్బీర్ పఠిస్తూ ఈద్‌గాహ్ వెళ్తాం. ఖుర్బానీ పండుగయితే ఏమీ తినకుండా బిగ్గరగా తక్బీర్ చదువుతూ ఈద్గాహ్ వెళ్తాం. పండుగ రోజు పఠించే తక్బీర్‌లో అల్లాహ్ ఘనతను, ఆయన ఏకత్వాన్ని ప్రకటిస్తాం. పట్టణం దేవుని ఏకత్వం, ఆయన ఔన్నత్యపు నినాదాలతో మార్మోగేందుకు మనం ఈద్గాహ్‌కు ఒక దారిన వెళ్ళి, మరో దారిన తిరిగి వస్తాం.

తక్బీర్ పదాలు :

اَللّٰهُ اَكْبَرُ اَللّٰهُ اَكْبَرُ لَآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَاللّٰهُ اَكْبَرُ اَللّٰهُ اَكْبَرُ وَلِلّٰهِ الْحَمْدُ-

**అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్ లా యిలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్ వ లిల్లాహిల్‌హమ్ద్.**

అల్లాహ్ అందరికన్నా గొప్పవాడు
అల్లాహ్ అందరికన్నా గొప్పవాడు
అల్లాహ్ తప్ప మరెవరూ ఆరాధనకు అర్హులు కారు.
అల్లాహ్ అందరికన్నా గొప్పవాడు
అల్లాహ్ (యే) అందరికన్నా గొప్పవాడు.
సమస్త స్తుతి స్తోత్రాలు ఆయనకే చెల్లు.

ఈద్‌గాహ్ చేరాక బారులు తీరి ఎంతో అణకువతో కూర్చుంటాం. మరొకరి స్థలంలో బలవంతంగా కూర్చోము. అత్యధిక సంఖ్యలో వచ్చిన భక్త జనాన్ని చూసి సంతోషిస్తాం. ఈద్‌గాహ్‌లో మనం నఫిల్ నమాజు చేయము. మహాప్రవక్త (సఅసం) పండుగ నమాజుకు ముందు, ఆ తర్వాత ఈద్గాహ్‌లో ఇతర నమాజులు చేసేవారు కారు.

పండుగ నమాజు కోసం అజాన్ ఇవ్వబడదు. ఇఖామత్ కూడా ఉండదు. అందరూ నిర్ణీత సమయానికి ఈద్గాహ్ చేరుకొని రెండు రకాతులు పండుగ నమాజు చేస్తారు. తరువాత ఇమాం చేసే ఈద్ ప్రసంగం వింటారు. ఆ తరువాత ఇళ్ళకు తిరిగొచ్చి ఖుర్బానీ ఇస్తారు.

**పండుగ నమాజు ఆజ్ఞ**

ప్రియప్రవక్త (సఅసం), ఆయన సహచరులు ఏనాడూ పండుగ నమాజును వదలలేదు. పండుగ రోజు మహాప్రవక్త (సఅసం) పండుగ సన్నాహాలు చేసి మొదట రెండు రకాతులు పండుగ నమాజు చేసేవారు. ఆ తరువాతే ఇతర పనులు చేసేవారు. రెండు రకాతులు పండుగ నమాజు చేయడం వాజిబ్ (విధి). కొందరు ఈ నమాజును ఫర్జ్‌గా తలుస్తారు. మొత్తం సంవత్సరంలో రెండే రెండు పండుగలు ఉన్నాయి. వీటిని ఎవరు వదలుకుంటారు?

**సమయం :** రెండు పండుగల నమాజు సమయం ఒక్కటే. సూర్యోదయమై కాస్త పొద్దెక్కగానే ఈ నమాజుల వేళ ప్రారంభమయి మిట్టమధ్యాహ్నానికి కొంచెం ముందువరకు ఉంటుంది. ఖుర్బానీ ఇవ్వడానికి వీలుగా ఈదుల్ అజ్‌హా నమాజు కాస్త పెందలకడనే చేస్తాము. నమాజు చేసిన తర్వాతనే ఖుర్బానీ ఇవ్వాలి. నమాజుకు ముందు ఇవ్వడం ధర్మసమ్మతం కాదు. అయితే పండుగ నమాజు కోసం గ్రామాల నుండి పట్టణాలకు వచ్చేవారు మాత్రం నమాజు ముందు ఖుర్బానీ ఇవ్వవచ్చు. మనం ఈదుల్ ఫితర్ నమాజును పొద్దెక్కిన తరువాత కొంచెం ఆలస్యంగా చేస్తాము.

**పండుగ నమాజు చేసే విధానం**

పండుగ నమాజులు తప్పనిసరిగా సామూహికంగానే చేయాలి. ఉజూ చేయకుండా నమాజు ఏ విధంగా నెరవేరదో, జమాఅత్ లేకుండా పండుగ నమాజు నెరవేరదు. అందుకే మనం జమాఅత్ ఎక్కడ తప్పిపోతుందోనన్న భయంతో ఉదయాన్నే సిద్ధమయి ఈద్గాహ్‌కు చేరుకుంటాం. జమాఅత్ తప్పిపోతే పండుగ నమాజును ఒంటరిగా చేయలేము.

ఇమామ్ వెనుక నిలబడి మనం ఆరు అదనపు తక్బీర్‌లతో సహా రెండు రకాతులు ఈదుల్ ఫిత్ర్ లేక ఈదుల్ అజ్హా నమాజు చేస్తున్నామని సంకల్పించు కుంటాము. ఇమామ్‌తోపాటు తక్బీర్ తహ్రీమా చెబుతూ రెండు చేతులు ఎత్తి కట్టుకుంటాము. తరువాత సనా, దుఆ చదువుతాము. ఆ తరువాత అదనపు తక్బీర్‌లు పలుకుతాము. చివరి తక్బీర్ పలికి చేతులు కట్టుకొని ఖిరత్ (ఖుర్ఆన్ పఠనం) వింటాము. రెండవ రకాత్‌లో మళ్ళీ అదనపు తక్బీర్‌లు పలికి నమాజు ముగిస్తాము.

**ఖుత్బా (ప్రసంగం) :** నమాజు తరువాత ఖుత్బా (ప్రసంగం) వింటాము. ఖుత్బా వినడం కూడా అవసరమే. ఈదుల్ ఫితర్ ప్రసంగంలో ఇమామ్‌గారు దైవస్తుతి తరువాత ఫిత్రా ఆదేశాలు విన్పిస్తారు సత్కార్యాల వైపు ప్రేరేపిస్తూ దుష్కార్యాల పర్యవసానం గురించి హెచ్చరిస్తారు. ఈదుల్‌అజ్హా ప్రసంగంలో ఖుర్బానీ, తక్బీర్ తష్రీఖ్ వగైరా ఆదేశాలు విన్పిస్తారు. హజ్ యాత్ర పట్ల ఆసక్తి కలిగిస్తారు. హజ్రత్ ఇబ్రాహీం (అలై), హజ్రత్ ఇస్మాయీల్ (అలై)ల చారిత్రక సంఘటనలను విన్పించి ఇస్లాం కోసం అవసరమైతే ప్రాణత్యాగం కూడా చేయడానికి సిద్ధంగా ఉండాలని చెబుతారు. ప్రసంగం మధ్యలో మాటిమాటికి తక్బీర్ పఠిస్తారు. మొదటి ప్రసంగంలో తొమ్మిది సార్లు, రెండవ ప్రసంగంలో ఏడుసార్లు తక్బీర్ పఠిస్తారు. తక్బీర్‌తోనే ప్రసంగం మొదలవుతుంది.

ఈదుల్ ఫిత్ర్ రోజు మనం నమాజుకు ముందు ఫిత్రా చెల్లిస్తాం. ఫిత్రా స్వీకరించిన నిరుపేదలు కూడా నిశ్చింతగా మనతోపాటు పండుగ నమాజులో పాల్గొనడానికి వీలుగా మనం ఇలా చేస్తాము. అలాగే ఈదుల్ అజ్హా రోజు కూడా నిరుపేదలు అందరితోపాటు మాంసం తిని సంతోషంగా పండుగ జరుపుకోవడానికి మనం ఖుర్బానీ ఇస్తాము.

**తక్బీరె తష్రీఖ్ :** జిల్‌హజ్ నెల 9వ తేదీని 'అర్ఫా' అంటారు. 10వ తేదీన పండుగ జరుగుతుంది. 11,12,13 తేదీలను తష్రీఖ్ దినాలని అంటారు. 9వ తేదీన అర్ఫా రోజు ఉదయం నమాజు నుండి

13వ తేదీన అసర్ నమాజు వరకు (23 నమాజుల వరకు) ప్రతి ఫర్జ్ నమాజు తరువాత బిగ్గరగా తక్బీరె తష్రీఖ్ చదవాలి. ప్రతి ముస్లిం ఈ తక్బీర్‌ను చదవాలి. మహిళలు, ప్రయాణీకులు ఈ తక్బీరు పఠించనవసరం లేదు. తక్బీరె తష్రీఖ్ ఈద్‌గాహ్ వెళ్ళే సమయంలో పఠించే తక్బీర్ మాత్రమే. ఈ తక్బీర్‌ను ఇమాం ఖుత్బాలో కూడా పఠిస్తారు.

اَللّٰهُ اَكْبَرُ اَللّٰهُ اَكْبَرُ لَا اِلٰهَ اِلَّا اللّٰهُ وَاللّٰهُ اَكْبَرُ اللّٰهُ اَكْبَرُ وَلِلّٰهِ الْحَمْدُ۔

**పండుగ విషయంలో గుర్తుంచుకోవాల్సిన విషయాలు**

1. పండుగ నమాజులు యావన్మంది ముస్లింలు విధిగా చేయాలి.
2. పండుగ నమాజు రెండు రకాతులు చేయాలి. నమాజు తరువాత ఉపన్యాసం (ఖుత్బా) ఉంటుంది.
3. పండుగ నమాజులో అజాన్ ఉండదు, ఇఖామత్ ఉండదు.
4. ఈదుల్ ఫితర్ నమాజులో కొద్దిగా తీపి పదార్థం తిని ఈద్‌గాహ్ వెళ్ళడం సున్నత్. ఈదుల్ అజ్‌హాలో ఏమీ తినకుండా వెళ్ళడం సున్నత్.
5. పండుగ నమాజులు ఈద్‌గాహ్‌లో చేయడం సున్నత్. ఈద్‌గాహ్ వరకు కాలినడకన వెళ్ళడం కూడ సున్నత్.
6. ఈద్‌గాహ్‌లో నమాజుకు ముందు ఆ తరువాత కూడ ఏ నఫిల్ నమాజులు చేయరాదు.
7. పండుగ నమాజులలో ఆరు లేదా 12 తక్బీర్లు అదనంగా ఉంటాయి.
8. ఈద్‌గాహ్‌కు ఒక దారిన వెళ్ళి మరో దారిన తిరిగి రావాలి. దారి పొడుగూతూ తక్బీర్ చెప్పడం సున్నత్.
9. జిల్‌హజ్ 9వ తేది ఉదయపు నమాజు నుండి 13వ తేది జిల్‌హజ్ అసరు నమాజు వరకు ప్రతి ఫరజు నమాజు తరువాత తక్బీరె తష్రీఖ్ పఠించాలి.
10. పండుగ నమాజులు తప్పనిసరిగా సామూహికంగానే చేయాలి. అందుచేత తొందరగా ఈద్‌గాహ్ చేరుకోవాలి. జమాఅత్‌తో నమాజు తప్పిపోతే ఆ నమాజును ఒంటరిగా చేయలేము.

## అభ్యాసం

**అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి?**

1. 'ఈదుల్ ఫిత్ర్', 'ఈదుల్ అజ్‌హా'లను మనమెందుకని జరుపుకుంటాము?
2. 'ఖుర్బానీ' ఎందుకు ఇవ్వబడుతుంది?
3. ఈద్‌నమాజ్ గురించి ఆదేశమేమిటి?
4. ఈద్ నమాజ్ వేళ ఎప్పుడు?
5. ఈద్ ఖుత్బాకు (ప్రసంగానికి) గల ప్రాముఖ్యత ఏమిటి?
6. ఫిత్రాదానం ఎందుకని ఇవ్వబడుతుంది?
7. ఏ రోజుల్ని 'అయ్యామె తష్రీఖ్'గా పిలుస్తారు?
8. 'తక్బీరె తష్‌రీఖ్' ఏది?

**ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1. ఈదుల్ ఫిత్ర్ రోజు మనం నమాజు కంటే ముందు ............ ఇచ్చేస్తాము.
2. ఈదైన్ నమాజుల్లో ........................ నమాజ్ తరువాత ఇవ్వబడుతుంది.
3. ఈద్గాహ్‌లో నమాజ్ కంటేముందుగాని, లేక నమాజ్ తరువాత గాని ఏ ఇతర నమాజు చేయడం ................................
4. ఈదైన్ నమాజుల్లో అజాన్ ఇవ్వబడదు ....... పలుకబడదు.
5. ఈదుల్ ఫిత్ర్, ఈదుల్ అజ్‌హా నమాజులు మనం ........... లో చేస్తాము.
6. అల్లాహ్ ప్రియప్రవక్త (స)పై .................... లాంటి వరాన్ని అవతరింపజేశాడు.
7. నా నమాజు, నా ......................, నా జీవితం మరియు మరణం సర్వం అల్లాహ్ కోసమే.
8. తక్బీరె .......... ఫర్జ్ నమాజుల తరువాత బిగ్గర స్వరంలో పలకాలి.

**ఇ) క్రింది వాటిని జతపరచండి?**

| | అ | ఇ |
|---|---|---|
| 1. | తక్బీరె తష్‌రీఖ్ | జిల్‌హిజ్జ తొమ్మిదవ తేదీ |
| 2. | ఈదుల్ ఫిత్ర్ | జిల్‌హిజ్జ పదవ తేదీ |
| 3. | ఈదుల్ అజ్‌హా | షవ్వాల్ మొదటిరోజు |
| 4. | అర్ఫా | జిల్‌హిజ్జ 9వ తేదీ ఫజ్ర్ మొదలుకొని జిల్‌హిజ్జ 13వ తేదీ అస్ర్ వరకు, బిగ్గర స్వరంతో పలుకబడే తక్బీర్ |

## చేయాల్సిన మరి కొన్ని పనులు

ఈదుల్ అజ్‌హా, ఈదుల్ ఫిత్ర్‌పై ఎనిమిది పంక్తుల వ్యాసం వ్రాయండి.

# 9. జనాజా నమాజ్

## (మృతుని కోసం చేసే నమాజు)

మృత్యువు నుండి ఎవరూ తప్పించుకోలేరు. ప్రతి ఒక్కరు మరణించక తప్పదు. కంచుకోటల్లో దాకున్నా, మరే ఇతర సురక్షిత భవనాల్లో ఉన్నా సరే, ఒకానొక రోజు మరణించక తప్పదు. ఒక మంచి మనిషి మరణిస్తే ఇరుగు పొరుగువాళ్ళు, బంధువులు వస్తారు. ఇంట్లోని వారంతా దుఃఖిస్తారు. కొందరు వారిని ఓదార్చుతూ బిగ్గరగా రోదించరాదని చెబుతారు. ఎవరైనా మరణవార్త వింటే 'ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్' (మేమందరం అల్లాహ్‌కు చెందినవారం. చివరికి ఆయన దగ్గరికే పోవలసిన వాళ్ళము) అని చెప్పాలి. మృతుని పాపాలు క్షమించమని దైవాన్ని ప్రార్థించాలి. దానధర్మాలు చేసి అతనికి పుణ్యం చేకూర్చాలి.

మృతదేహానికి స్నానం చేయించి 'కఫన్' వస్త్రాలు కట్టి జనాజా (శవ పేటిక)ను మసీదుకు తీసుకొని వెళ్తారు. జనాజా వెంట అనేక మంది ఉంటారు. ఇమాంగారు జనాజా ముందు నిలబడి, వచ్చినవారిని తన వెనుక వరుసలు తీర్చి నిలబెట్టుతారు. బేసి సంఖ్యలో వరుసలుంటాయి. జనాజా నమాజు చేయబడుతుంది. ఆ తరువాత మృతదేహాన్ని శ్మశానానికి తీసికెళ్ళి ఖననం చేస్తారు.

**జనాజా నమాజు ఆజ్ఞ :** జనాజా నమాజును 'ఫర్జె కిఫాయా' అంటారు. అంటే ఆ ప్రాంతంలోని కొంతమంది ఈ నమాజులో పాల్గొన్నా ఆ విధి (ఫర్జ్) అందరి తరపున నెరవేరుతుంది. ఒకవేళ ఆ ప్రాంతంవారిలో ఒక్కరు కూడా జనాజా నమాజులో పాల్గొనకపోతే అందరూ పాపం చేసిన వారవుతారు. మరణవార్త వినగానే అందరు జనాజా నమాజులో పాల్గొనడానికి ప్రయత్నించాలి. ఒకానొక రోజు మనమూ చనిపోతామని, అప్పుడు మన జనాజా నమాజు కూడా ఇతరులు చేయవలసి ఉంటుందని భావించి జనాజా నమాజులో పాల్గొనాలి.

జనాజా నమాజును ముస్లింల ఖలీఫా చేయించాలి లేదా పట్టణ ఖాజీ చేయించాలి. వారు లేకపోతే మృతుని కుటుంబీకులలో ఎక్కువ ధర్మజ్ఞానం, ధర్మపరాయణత కలిగిన పెద్ద మనిషి ఈ నమాజు చేయించాలి. కుటుంబీకుల అనుమతితో వీధి మసీదు ఇమామ్ కూడా ఈ నమాజు చేయించవచ్చు.

### జనాజా నమాజులో రెండు ఫర్జ్‌లు ఉన్నాయి

1. నాలుగుసార్లు అల్లాహు అక్బర్ చెప్పాలి.
2. నిలబడి జనాజా నమాజు చేయించాలి.

### ఈ నమాజులో మూడు సున్నతులున్నాయి

1. అల్లాహ్‌ను స్తుతించడం.
2. ప్రియప్రవక్త (సఅసం) కోసం దరూద్ చదవడం.
3. మృతుని పాపక్షమాపణ కోసం ప్రార్థించడం.

జనాజా నమాజు ఇతర నమాజుల కంటె భిన్నమైనది. ఇందులో రుకూ, సజ్దా, ఖాయిదాలు ఉండవు. ఇతర నమాజులకు జమాఅత్ ఉండాలన్న షరతు లేనట్టే జనాజా నమాజుకు కూడా జమాఅత్ షరతు లేదు. ఒక వ్యక్తి ఉన్నా జనాజా నమాజు చేయవచ్చు. ఆ వ్యక్తి మహిళ కావచ్చు, పురుషుడు కావచ్చు. జమాఅత్ అయితే మంచిది. అనేకమంది కలసి మృతుని పాపక్షమాపణ కోసం ప్రార్థన చేసే అవకాశం ఉంటుంది. కాని జమాఅత్ కోసం జనాజా నమాజును ఆపి ఉంచడం సరికాదు.

**జనాజా నమాజు విధానం**

ఇమామ్ జనాజా (శవపేటిక)ను ముందు పెట్టి శవం ఎదకు ఎదురుగా నిలబడతాడు. అతని వెనుక కనీసం మూడు వరుసలలో మిగిలినవారు నిలబడతారు. అందరూ జనాజా నమాజు చేస్తున్నామని సంకల్పిస్తారు. ఈ సంకల్పం ఏ భాషలోనైనా చేయవచ్చు.

**జనాజా నమాజు సంకల్పం :**

نَوَيْتُ اَنْ اُصَلِّيَ صَلوٰةَ الْجَنَازَةِ لِلّٰهِ تَعَالٰى وَالدُّ عَاءُ لِلْمَيِّتِ۔

**అర్థం:** నేను జనాజా నమాజు చేయడానికి సంకల్పించాను. అల్లాహ్ కోసం నమాజు, మృతుని కోసం దుఆ చేస్తున్నాను.

ఇమామ్‌గారి తక్బీర్ తరువాత రెండు చేతులు ఎత్తి అల్లాహు అక్బర్ అంటూ పై విధంగా సంకల్పం చేస్తాం. తరువాత 'సనా' పఠిస్తాం.

**సనా :**

سُبْحَانَكَ اللّٰهُمَّ وَبِحَمْدِكَ وَتَبَارَكَ اسْمُكَ وَتَعَالٰى جَدُّكَ
وَجَلَّ ثَنَآءُكَ وَلَآ اِلٰهَ غَيْرُكَ۔

**అర్థం:** దేవా! నీవు ఎంతో పవిత్రుడవు. సమస్త ప్రశంసలు నీకే శోభిస్తాయి. నీ పేరు శుభప్రదమైనది. నీ హుందాతనం ఎంతో ఉన్నతమైనది. నీ కీర్తి అనూహ్యామైనది. నీవు తప్ప మరే ఆరాధ్యుడు లేదు.

మళ్ళీ తక్బీర్ చెప్పి దరూద్ పఠిస్తాం. మృతవ్యక్తి స్త్రీ అయినా పురుషుడైనా మేజరు అయివుంటే ఈ 'దుఆ' చేస్తాం.

**పెద్దల శవ ప్రార్థన :** اَللّٰهُمَّ اغْفِرْ لِحَيِّنَا وَمَيِّتِنَا وَشَاهِدِنَا وَغَآئِبِنَا وَصَغِيْرِنَا وَكَبِيْرِنَا وَذَكَرِنَا وَاُنْثَانَا اَللّٰهُمَّ مَنْ اَحْيَيْتَهٗ مِنَّا فَاَحْيِهٖ عَلَى الْاِسْلَامِ وَمَنْ تَوَفَّيْتَهٗ مِنَّا فَتَوَفَّهٗ عَلَى الْاِيْمَانِ۔

**అర్థం:** ఓ అల్లాహ్! మాలో జీవించి ఉన్నవారిని, చనిపోయినవారిని, ఇక్కడ హాజరయినవారిని, హాజరుకానివారిని, మాలోని పిన్నలను, పెద్దలను, మా స్త్రీలను, పురుషులను క్షమించు. దేవా! మాలో నీవు ఎవరెవరిని సజీవంగా ఉంచావో వారిని జీవితాంతం ఇస్లాంలో స్థిరంగా ఉంచు. మాలో నీవు ఎవరికి మృత్యువు కలిగిస్తావో వారికి విశ్వాస స్థితిలో మృత్యువు కలిగించు.

కొందరు ఈ క్రింది 'దుఆ' కూడా చేస్తారు.

اَللّٰهُمَّ اغْفِرْلَهٗ وَارْحَمْهُ وَعَافِهٖ وَاعْفُ عَنْهُ وَاَكْرِمْ نُزُلَهٗ وَوَسِّعْ مَدْخَلَهٗ وَاغْسِلْهُ بِالْمَآءِ وَالثَّلْجِ وَالْبَرْدِ وَ نَقِّهٖ مِنَ الْخَطَايَا كَمَا يُنَقَّى الثَّوْبُ الْاَبْيَضُ مِنَ الدَّنَسِ وَاَبْدِلْهُ دَارًا خَيْرًا مِّنْ دَارِهٖ وَاَهْلًا خَيْرًا مِّنْ اَهْلِهٖ وَ زَوْجًا خَيْرًا مِنْ زَوْجِهٖ وَادْخِلْهُ الْجَنَّةَ وَ اَعِذْهُ مِنْ عَذَابِ الْقَبْرِ وَعَذَابِ النَّارِ۔

**అర్థం:** ఓ అల్లాహ్! ఈ మృతుడ్ని క్షమించు, కనికరించు. ఇతని పాపాలను క్షమించు. మహాభాగ్యాలతో ఇతడ్ని స్వాగతించు. ఇతని సమాధిని విశాలం చెయ్యి. ఇతని పాపాలను నీటితో, మంచుతో, వడగళ్ళతో కడిగివెయ్యి. తెల్ల బట్టలకు అంటిన మురికిని కడిగి శుభ్రం చేసినట్లు ఇతని పాపాలను ప్రక్షాళనం చెయ్యి. ఇతనికి ఇహలోకపు ఇంటికంటే శ్రేష్ఠమైన ఇంటిని ప్రసాదించు. ఇహలోకంలోని సన్నిహితులకంటే మేలైన సన్నిహితులను ఇవ్వు. ఇహలోకంలోని భార్య కంటే మంచి భార్యను ప్రసాదించు. ఇతడ్ని స్వర్గంలో ప్రవేశింపజేయి. ఇతడ్ని సమాధి యాతనల నుండి, నరక యాతనల నుండి కాపాడు.

**బాలుడి శవ ప్రార్థన:**

మృతవ్యక్తి మైనరు బాలుడు అయితే ఈ 'దుఆ' చేస్తాం.

اَللّٰهُمَّ اجْعَلْهُ لَنَا فَرَطاً وَّجْعَلْهُ لَنَآ اَجْرًا وَّذُخْرًا وَّاجْعَلْهُ لَنَا شَافِعًا وَّمُشَفَّعاً۔

**అర్థం:** దేవా! ఈ మృతుడ్ని మాకంటే ముందు తన అసలు గృహానికి చేరుకొని మా కోసం మంచి సామగ్రి ఏర్పాటు చేసేలా చెయ్యి. ఇతడ్ని మా కోసం పరలోకంలో పుణ్యఫలం సాధనంగా, సిఫారసు చేసేవానిగా చెయ్యి. ఇతని సిఫారసు స్వీకరించు.

**బాలిక శవ ప్రార్థన:**

మృతవ్యక్తి మైనరు బాలిక అయితే ఈ 'దుఆ' చేస్తాం.

اَللّٰهُمَّ اجْعَلْهَا لَنَا فَرَطًا وَّاجْعَلْهَا لَنَآ اَجْرًا وَّذُخْرًا وَّاجْعَلْهَا لَنَا شَافِعَةً وَّمُشَفَّعَةً۔

అర్థం: దేవా! ఈ బాలికను మాకంటే ముందు తన అసలు గృహానికి చేరుకొని మా కోసం మంచి సామగ్రి ఏర్పాటు చేసేలా చెయ్యి. ఈమెను మా కోసం పరలోకంలో పుణ్యఫల సాధనంగా, సిఫారసు చేసే బాలికగా చెయ్యి. ఈమె సిఫారసు స్వీకరించు.

మనపై బ్రతికున్న ముస్లింలకు హక్కులున్నట్లే, చనిపోయిన ముస్లింలకు కూడా హక్కులున్నాయి. జనాజా నమాజులో పాల్గొనడానికి ప్రయత్నించాలి. అదీగాక మృతుని పాప క్షమాపణ కోసం దుఆ కూడా చేస్తూ ఉండాలి. దేవుని పేరుతో అతని కోసం దానధర్మాలు చేయాలి. అయితే దైవప్రవక్త (సఅసం) తెలియజేయని ఆచారాలు మానెయ్యాలి.

## అభ్యాసం

**అ) ఈ క్రింది వాటికి సమాధానాలు వ్రాయండి**

1. జనాజా నమాజు గురించిన ఆదేశమేమిటి?
2. జనాజా నమాజు ఎవరు చేయించాలి?
3. జనాజా నమాజులో ఎన్ని ఫర్జ్‌లు, ఎన్ని సున్నత్‌లు ఉంటాయి?
4. జనాజా నమాజు పద్ధతి ఏమిటి?
5. జనాజా నమాజులో ఎన్ని తక్బీర్‌లు పలుకబడతాయి?
6. మృతులకు మనపై గల హక్కు ఏమిటి?
7. ఫర్జ్ ఏ కిఫాయ అంటే అర్థం ఏమిటి?

**ఆ) క్రింది ఖాళీలను పూరించండి**

1. ఒకరి మరణవార్తను విన్నప్పుడు .............................. పఠించాలి.
2. జనాజా నమాజు ........................................ అనబడుతుంది.
3. జనాజా నమాజు ఇతర నమాజుల కన్నా .................... ఉంటుంది.
4. జనాజా నమాజు కోసం కూడా ............................ షరతు కాదు.

**ఇ) సరైన వాక్యానికి (✓) గుర్తు, తప్పు వాక్యానికి (X) గుర్తుపెట్టండి**

1. ఒకరి మరణంపై పెడబొబ్బలు పెడుతూ, అరుస్తూ ఏడ్వకూడదని ప్రియప్రవక్త(స) వారించారు ( )
2. జనాజా నమాజు కోసం వేళ షరతుకాదు ( )
3. వీధిలోని ఇమాం గారు, ఇంటి వారి అనుమతిలేకుండానే జనాజా నమాజు చేయించవచ్చు. ( )
4. జనాజా నమాజులో పాల్గొనేందుకు ప్రయత్నించాలి. ( )

## చేయాల్సిన మరి కొన్ని పనులు

జనాజా నమాజులో పఠించే దుఆలు, వాటి అనువాదాలు కంఠస్థం చేసి తరగతిలో వినిపించండి.



# 10. జకాత్

నమాజు, ఉపవాసాల మాదిరిగానే జకాత్ చెల్లింపు కూడా ముస్లింలు విధిగా పాటించాలి. కాకపోతే నమాజు, రోజాలు పేద-ధనిక అనే తేడా లేకుండా అందరూ పాటించాలి. జకాత్ మాత్రం ధనికుల మీదనే విధిగా ఉంది. నమాజు, రోజాలు శారీరక ఆరాధనలు. జకాతు ఆర్థిక ఆరాధన. నమాజు, రోజాలు దేవుని హక్కులు. జకాతులో దేవుని హక్కుతో పాటు తోటి మానవుల హక్కులు కూడా ఉన్నాయి. జకాతు కూడా ఇస్లాం మూలస్తంభాలలో ఒకటి. ఇది ఫర్జ్ (విధి) అని ఖుర్‌ఆన్‌లో స్పష్టంగా పేర్కొనబడింది. అందుచేత జకాత్ ఫర్జ్ కాదని నిరాకరించేవారు ముస్లింలు కాలేరు. ధనికుడయి ఉండి కూడా జకాత్ చెల్లించని ముస్లిం ఘోరమైన పాపాత్ముడవుతాడు.

నమాజ్ చేసే, ఉపవాసం పాటించేవారికి మాత్రమే ఖుర్‌ఆన్ ద్వారా సన్మార్గావలంబన బుద్ధి లభిస్తుంది. అంటే జకాత్ చెల్లించనివారికి సద్బుద్ధి లభించదన్న మాట. దీన్నిబట్టి జకాత్ ప్రాముఖ్యం ఏమిటో అర్థం చేసుకోవచ్చు. దివ్యఖుర్‌ఆన్‌లో దాదాపు ఎనభై రెండు చోట్ల జకాత్‌ను గురించి నొక్కి చెప్పడం జరిగింది. ముప్పయి రెండు చోట్ల నమాజ్ లాంటి ఆరాధనతో కలిపి జకాత్ ప్రస్తావన పేర్కొనబడింది. జకాత్ చెల్లించనివారిని బహుదైవారాధకులతో, కపట విశ్వాసులతో పోల్చడం జరిగింది. జకాత్ చెల్లించేవారికి స్వర్గంలో సమస్త విధాల మహాభాగ్యాలు లభిస్తాయి. జకాత్ ఎగవేసేవారికి భయంకరమైన శిక్ష పడుతుందని హెచ్చరించబడింది. ఆ శిక్ష గురించి వింటేనే శరీరం జలదరిస్తుంది. "వెండి బంగారాలను దైవమార్గంలో ఖర్చుపెట్టకుండా కూడబెట్టేవారికి దుర్భర శిక్ష పడుతుందని శుభవార్త విన్పించు. వారు కూడబెట్టిన వెండి బంగారాలను ఆ రోజు అగ్నిలో కాల్చి వారి పక్కలపై, నుదుళ్ళపై, వీపులపై వాతలు పెట్టడం జరుగుతుంది. అప్పుడు వారితో, ఇవి మీరు కూడబెట్టుకున్న వెండి బంగారాలే. మీరు కూడబెట్టుకున్నవాటి రుచి చూడండి." (తౌబా సూరా)

ఇది ఖుర్‌ఆన్‌లో చెప్పబడిన శిక్ష. హదీసుల్లో కూడా కఠిన శిక్షల ప్రస్తావన ఉంది. మన ప్రియప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు: "ఎవరికి దేవుడు ఐశ్వర్యం ప్రసాదించాడో వారు జకాత్ చెల్లించకపోతే ప్రళయదినాన వారి ధనం భయంకర మైన ఓ పెద్ద విషసర్పంలా మారి వారి మెడకు చుట్టుకుంటుంది. అది వారి దవడల మీద కాటువేస్తూ 'నేను నీవు కూడబెట్టుకున్న ధనాన్ని, నేను నీ నిధిని' అని అంటుంది."

ఇదెంత కఠినమైన శిక్షో చూడండి. ఇలాంటి శిక్ష గురించి విని కూడా ఏ ముస్లిం జకాత్ చెల్లించడు? దైవప్రవక్త (సఅసం) తదనంతరం హజ్రత్ అబూబకర్ (రజి) ఖలీఫా అయినప్పుడు కొందరు జకాత్ చెల్లించడానికి నిరాకరించారు. దాంతో హజ్రత్ అబూబకర్ (రజి) వారిపై యుద్ధం (జిహాద్) ప్రకటించారు. హజ్రత్ ఉమర్ (రజి) యుద్ధ ప్రకటన సంగతి విని, "వీరు కలిమా పఠించి నమాజు చేస్తున్నారు కదా! అలాంటి వారితో యుద్ధం ఎలా చేస్తారు?" అని అడిగారు. దానికి హజ్రత్ అబూబకర్ (రజి) సమాధాన మిస్తూ, "దైవసాక్షిగా చెబుతున్నాను. నమాజ్, జకాత్‌ల మధ్య తేడా చూపేవారితో నేను తప్పకుండా

యుద్ధం చేస్తాను. దైవసాక్షి! వారు పూర్వం నుండి ఇస్తున్నవాటిలో ఒంటె తాడు సైతం ఇవ్వకపోయినా సరే నేను వారితో యుద్ధం చేస్తాను" అని చెప్పారు. ఈ సంఘటనను బట్టి జకాత్ ఎంత ముఖ్యమైన విషయమో తెలుస్తోంది.

జకాత్ చెల్లించడంలో మన ఇహపరలోకాల శ్రేయస్సు ఉంది. జకాత్ చెల్లించడం వల్ల మన సంపద ప్రక్షాళనం అవుతుంది. మన హృదయం నుండి ధనవ్యామోహం తగ్గిపోతుంది. పేదవాళ్ళకు సహాయం అందుతుంది. సానుభూతి జనిస్తుంది. సరిగా ధనవిభజన జరుగుతుంది. కొందరు భోగభాగ్యాల్లో తేలియాడటం, మరికొందరు గంజినీళ్ళు కూడా దొరక్క ఆకలితో నకనకలాడటం అంటూ జరగదు. ఆనాడు ప్రవక్త అనుచరులు (రజి) తమ అవసరాలకు మించి ఒక్క పైసా కూడా తమ దగ్గర ఉంచుకునే వారు కాదు. హజ్రత్ అబూజర్ గఫ్ఫారీ (రజి) అయితే ఎక్కడైనా కొందరు జనం కన్పిస్తే చాలు, వారికి జకాత్ గురించి హితబోధ చేసేవారు.

**జకాత్ అంటే అర్థం :** బంగారం, వెండి, వ్యాపార సరుకులు మొదలైన వస్తువులు ఒక సంవత్సరందాకా నిలువ ఉంటే వాటి విలువ మొత్తంలో నలభయ్యో వంతు తీసి పేదలకు ఇవ్వడాన్నే జకాత్ అంటారు. జకాతు ఫరజ్ (విధి) కావడానికి ఈ క్రింది విధంగా ఆరు షరతులు ఉన్నాయి.

1. జకాత్ చెల్లించే వ్యక్తి ముస్లిం అయి ఉండాలి. ముస్లిమేతరులు జకాత్ చెల్లించనవసరం లేదు. ఇస్లామీయ రాజ్యంలో ఉండే ముస్లిమేతరుల నుండి ప్రభుత్వం జకాత్ వసూలు చేయదు.
2. స్పృహ కలిగినవాడయి ఉండాలి. పిచ్చివాళ్ళు, మతిస్థిమితం లేనివాళ్ళపై జకాత్ విధి లేదు.
3. వయోజనుడయి ఉండాలి. యుక్తవయస్సుకు రాని బాలబాలికల వద్ద ఎంత ధనం ఉన్నప్పటికీ వారు జకాత్ చెల్లించనవసరం లేదు.
4. సాహబ్-యె-నిసాబ్ కావాలి. అంటే జకాతు చెల్లించే స్తోమత ఉన్న వ్యక్తి అయివుండాలి.
5. ఒక సంవత్సరం పూర్తిగా గడవాలి. అంటే బంగారం, వెండి, డబ్బు, ఇతర వస్తు సంపదలు జకాతు చెల్లించే వ్యక్తి దగ్గర ఒక సంవత్సరంపాటు ఉండాలి.
6. తిండి, బట్ట, ఇల్లు, వృత్తిపరమైన పరికరాలు మొదలైన కనీస అవసరాలకు మించిన ధనం ఉండాలి.

**నిసాబ్ :** ధనసంపద, జంతువులు, వెండి, బంగారాల నిర్ణీత పరిమాణాలపై ఒక సంవత్సరం గడిచిన తరువాత జకాతు చెల్లింపు విధి అవుతుంది. ఆ నిర్ణీత పరిమాణాన్నే 'నిసాబ్' అంటారు. బంగారం, జంతువుల నిసాబ్‌లు వేరు వేరుగా ఉంటాయి.

వెండి, బంగారాల నిసాబ్ : కనీసం 52 1/2 తులాల వెండిగాని, లేదా 7 1/2 తులాల బంగారంగాని ఒక సంవత్సరంపాటు దగ్గర ఉంచుకున్న వ్యక్తి అందులో నుంచి నలభయ్యో వంతు తీసి జకాత్ చెల్లించాలి. లేదా ఆ వెండి, బంగారాల విలువ ఎన్ని రూపాయలవుతాయో వాటిలో రెండున్నర శాతం చొప్పున తీసి

జకాత్ చెల్లించాలి. కేవలం డబ్బు మాత్రమే ఉంటే ఆ డబ్బు నిసాబ్‌ను వెండి బంగారాలతో అంచనా కట్టాలి. ఒక మనిషి దగ్గర ఓ సంవత్సరం పాటు కనీసం 52 1/2 తులాల వెండి విలువంత డబ్బు ఉంటే అతను విధిగా జకాత్ చెల్లించవలసి ఉంటుంది.

నగలపై కూడా జకాతు ఉంటుంది. ఒకసారి ప్రియప్రవక్త (సఅసం) దగ్గరకు ఇద్దరు మహిళలు చేతులకు బంగారు గాజులు ధరించి వచ్చారు. ప్రియప్రవక్త (సఅసం) వాటిని చూసి "వీటిపై మీరు జకాత్ చెల్లిస్తున్నారా?" అని అడిగారు. దానికి వారు లేదని చెప్పారు. "మరి వీటికి బదులు మీరు అగ్ని గాజులు తొడుక్కోవడానికి సిద్ధంగా ఉన్నారా?" అని ప్రశ్నించారు ప్రియప్రవక్త (సఅసం). 'లేదండీ' అన్నారు వారు. "అయితే వీటికి సంబంధించిన జకాతు చెల్లించండ"ని ఆదేశించారు ప్రియప్రవక్త (సఅసం).

వ్యాపార వస్తువులపై కూడా జకాత్ ఉంది. వాటి విలువ కనీసం 52 1/2 తులాల వెండి విలువ అయివుండి ఒక సంవత్సరంపాటు నిలువ ఉంటే వాటి మొత్తం విలువపై జకాతు చెల్లించాలి.

**జంతువుల నిసాబ్ :** కనీసం నలభై మేకలు లేక గొర్రెలు ఉన్న ఆసామి వాటిలో నుంచి ఒక మేకను లేక గొర్రెను జకాతుగా ఇవ్వాలి. ఇలా 120 జంతువుల వరకున్నా ఒకే జంతువును జకాతుగా ఇవ్వాలి. 121 నుండి 200 జంతువుల వరకు ఉంటే రెండు జంతువులను జకాతుగా ఇవ్వాలి. 201 నుండి 399 జంతువుల వరకు ఉంటే 3 జంతువులను జకాతుగా ఇవ్వాలి. 400 జంతువులుంటే 4 జంతువులను జకాతుగా ఇవ్వాలి. 400కు పైగా ఉంటే ప్రతి నూటికి ఒక జంతువు చొప్పున జకాతుగా ఇవ్వాలి. ఈ లెక్క ప్రకారం నూటికి కొన్ని జంతువులు తక్కువగాని, ఎక్కువగాని ఉంటే వాటిపై జకాత్ ఇవ్వనవసరం లేదు. ఇవన్నీ మేకలు, గొర్రెలకు సంబంధించిన విషయాలు.

ఆవులు, గేదెలు 30 ఉంటే వాటిలో కనీసం ఒక సంవత్సరం వయసుగల పశువును జకాతుగా ఇవ్వాలి. 40 పశువులుంటే రెండేళ్ల వయసున్న పశువును జకాతుగా ఇవ్వాలి. 41 నుండి 59 వరకు పశువులుంటే ఏమీ ఇవ్వనవసరంలేదు. 60 పశువులుంటే 30 పశువుల నిసాబ్ ప్రకారం రెండు 'నిసాబ్'లు అవుతాయి. అందుచేత ఏడాది వయసున్న రెండు పశువులను జకాతుగా చెల్లించాలి. 60 పశువులకంటే ఎక్కువ వుంటే ప్రతి 30 పశువులపై ఏడాది వయసుండే ఒక పశువునుగాని, లేదా ప్రతి 40 పశువులపై రెండేళ్ళ వయసుండే ఒక పశువునుగాని జకాత్‌గా చెల్లించుకోవాలి.

ఎవరి దగ్గరన్నా ఐదు ఒంటెలు ఉంటే ఒక మేక లేక గొర్రెను, 10 ఉంటే 2 మేకలు లేక గొర్రెలను, 15 ఉంటే 3 మేకలు లేక గొర్రెలను, 20 ఉంటే 4 మేకలు లేక గొర్రెలను, 25 ఒంటెలుంటే ఒక ఒంటె పిల్లను జకాతుగా చెల్లించుకోవాలి.

**ఉష్ర్ :** భూసంబంధమైన ఉత్పత్తులపై చెల్లించే జకాత్‌ను 'ఉష్ర్' అంటారు. ఉష్ర్ ఆజ్ఞలకు, జకాత్ ఆజ్ఞలకు కొంచెం తేడా ఉంది. ఖుర్‌ఆన్‌లో కూడా దీని ప్రస్తావన ఉంది. "ధర్మసమ్మతమైన సంపాదన నుండి తీసి దైవమార్గంలో ఖర్చుపెట్టండి. మేము మీకు నేల నుండి తీసిచ్చిన ఉత్పత్తులలో కూడా కొంత దైవమార్గంలో ఖర్చుపెట్టండి" అని ఉంది. మరోచోట "ఆ తోటలలో పండ్లు కాసినప్పుడు వాటిని మీరు

తినండి, ఆ ఉత్పత్తి హక్కు (అంటే ఉష్ర్) కూడా నెరవేర్చండి" అని పేర్కొనబడింది. "నేల నుండి ఉత్పత్తి అయ్యేవాటిలో నుంచి దానం చేయండ"ని మన ప్రియప్రవక్త (సఅసం) కూడా చెప్పారు. ఆయన అనుచరులు (సహాబీలు) ధాన్యం, పండ్లు, తేనెలపై ఉష్ర్ తీసి దానం చేసేవారు. ఉష్ర్ ప్రతి ముస్లింకు విధిగా చేయబడింది. అందులో పిల్లలు–పెద్దలు, స్పృహ ఉన్నవారు–లేనివారు అన్న తేడా లేదు. అలాగే నిసాబ్ నిర్ణీత పరిమాణం ఉండాలని, ఒక సంవత్సరం గడవాలని షరతులు లేవు.

**ఉష్ర్ రేటు :** నీటిపారుదలతో గాకుండా వర్షం వల్ల పండిన పంటయితే పంటలో పదో వంతు ఉష్ర్‌గా చెల్లించాలి. వర్షం వల్ల గాకుండా నీటిపారుదల ద్వారా పండిన పంటయితే పంటలో ఇరవయ్యో వంతు ఉష్ర్‌గా చెల్లించాలి.

**జకాతు తీసుకోవడానికి అర్హులైనవారు :** జకాతు స్వీకరించడానికి అర్హులైన వారు ఎనిమిది విధాలుగా ఉన్నారు.

1. **ఫకీర్ (పేదవాడు) :** ఆదాయ మార్గం ఉన్నప్పటికీ కనీస అవసరాలు కూడా తీర్చుకోలేకపోయేవారు లేదా వరదలు, తుఫాన్, అల్లర్లు వగైరాల వల్ల అకస్మాత్తుగా సర్వం కోల్పోయినవారు.
2. **మిస్కీన్ (నిర్భాగ్యులు) :** సంపాదనా శక్తిలేని, తినడానికి తిండి కూడా లేనివారు. ఏ ఆధారం లేనివారు, అనాథలు, వితంతువులు కూడా ఈ కోవకు చెందుతారు.
3. **ఆమిల్ :** జకాతు వసూలు చేసేవారు.
4. **ముఅల్లిఫతుల్ ఖులూబ్ :** ఎవరిలోనైతే ఇస్లాం పట్ల ఆసక్తి కలిగించవలసి ఉంటుందో ఆ ముస్లిమేతరులు, లేదా ఎవరిని ఇస్లాంలో స్థిరంగా ఉంచవలసి ఉంటుందో ఆ నవముస్లింలు.
5. **అర్రిఖాబ్ :** బానిసలు లేదా యుద్ధఖైదీలు.
6. **గారిమ్ :** రుణబాధ నుండి విముక్తి పొందలేని రుణగ్రస్థులు.
7. **దైవమార్గంలో :** ధర్మసంస్థాపన కోసం శత్రువులతో పోరాడే యోధులు, ధర్మసేవ చేసేవారు. వారి అవసరాల కోసం జకాత్ డబ్బు ఇవ్వవచ్చు.
8. **ఇబ్నె సబీల్ :** అంటే ప్రయాణీకుడు. ప్రయాణీకుడు ఎంత ధనవంతుడు అయినప్పటికీ ప్రయాణావస్థలో ఉన్నప్పుడు అతనికి ఏదైనా అవసరం వస్తుంది. అందుచేత అలాంటి మనిషికి జకాత్ ఇవ్వవచ్చు.

జకాతు బైతుల్‌మాల్ (ధనాగారం)లో జమచేయాలి. బైతుల్‌మాల్ సొమ్మును పై ఎనిమిది విధాలవారి కోసం ఖర్చుపెట్టాలి. బైతుల్‌మాల్ లేనట్లయితే, దానిని నెలకొల్పేందుకు ప్రయత్నించాలి. అలా కాకపోతే స్వయంగా పైన తెలిపిన వారి కోసం ఖర్చుపెట్టాలి. జకాత్ లెక్క చాంద్రమానం ప్రకారం ఉండాలి. జకాత్ ఇచ్చేటప్పుడు నేను దైవప్రసన్నత కోసం ఇస్తున్నానని సంకల్పించు కోవాలి. జకాత్ స్వీకరించేవారికి దాన్ని గురించి తెలియజేయనవసరం లేదు.

## అభ్యాసం

**అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి?**

1. జకాత్‌కు నిర్వచనం ఏమిటి?
2. జకాత్ ఫర్జ్ (విధి) అవడానికి గల షరతులు ఏమిటి?
3. జకాత్‌కు గల ప్రాముఖ్యత ఎలాంటిది?
4. 'నిసాబ్' దేన్నంటారు? వెండి, బంగారాల నిసాబ్ ఎంత?
5. 'ఉష్ర్'కు నిర్వచనం ఏమిటి?
6. జకాత్ ఎక్కడ జమ చేయాలి?
7. దివ్యఖుర్‌ఆన్‌లో నమాజుతో పాటు జకాత్ తాకీదు ఎన్ని చోట్లలో వచ్చింది?

**ఆ) ఖాళీల్ని పూరించండి?**

1. నమాజు, రోజా లాగానే ........................... కూడా ముస్లింలపై ఫర్జ్ అయి వుంది.
2. జకాత్‌ను .................. యొక్క గుర్తింపుగా తెలుపడం జరిగింది.
3. దివ్యఖుర్‌ఆన్‌లో దాదాపు ......................... చోట్ల జకాత్ గురించి తాకీదు చేయబడింది.
4. నమాజు, ఉపవాసం శారీరక ఆరాధనలు మరియు జకాత్ .......................
5. ఒకవేళ పంట కేవలం వర్షాధారంగా అయితే మొత్తం పంటలో.............. వ భాగం ఇవ్వాల్సి ఉంటుంది. ఒకవేళ పంట నీటిపారుదల ద్వారా అయితే మొత్తం పంటలో ....... వ భాగం ఉష్ర్ కింద ఇవ్వాల్సి ఉంటుంది.

**ఇ) సరైన వాక్యంపై ( ✓) గుర్తు, తప్పు వాక్యంపై (X) గుర్తు పెట్టండి.**

1. జకాత్ ఇస్లామ్‌లోని ఒక మూలస్థంభం. (మౌలిక అంశం) (   )
2. జకాత్‌ను ఇవ్వడంలో ఇహపరాల నష్టం (   )
3. జకాత్ ఇవ్వకపోవడాన్ని కపటుల గుర్తింపుగా తెలుపబడింది (   )
4. ప్రయాణికునికి జకాత్ ఇవ్వడం ధర్మసమ్మతం కాదు (   )



# 11. హజ్

అనేక సంవత్సరాల క్రితం హజ్రత్ ఇబ్రాహీమ్ (అలై), ఆయన కుమారుడు హజ్రత్ ఇస్మాయీల్(అలై) కలసి మక్కాలో అల్లాహ్‌ను ఆరాధించేందుకు ఒక గృహాన్ని నిర్మించారు. దీనినే 'ఖానయె కాబా' లేదా 'బైతుల్లాహ్' అంటారు. మక్కాలో మన ప్రియప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (సఅసం) పుట్టిన రోజుల్లో కొందరు చాదస్తపు మనుషులు కాబా గృహంలో కొన్ని రాతి విగ్రహాలు పెట్టి వాటిని పూజిస్తూ ఉండే వారు. మన ప్రియప్రవక్త (సఅసం) ఆ విగ్రహాలన్నిటినీ తీసేసి దైవగృహాన్ని శుద్ధిచేశారు. యావత్తు ప్రపంచంలో ఏకేశ్వరోపాసనను వ్యాపింప జేయడానికి, ఏక దైవారాధనను గురించి ప్రచారం చేయడానికి కాబా గృహం ప్రధాన కేంద్రంగా పరిగణించబడింది.

**హజ్ :** నిర్ణీత దినాలలో కాబా గృహాన్ని సందర్శించి, అర్ఫాత్ మైదానంలో ప్రార్థనలు చేయడాన్ని "హజ్" అంటారు. హజ్ ఇస్లాంలో ఎంతో ముఖ్యమైన ఆరాధన. నమాజ్, రోజాలు శారీరక ఆరాధనలు జకాత్ ధనసంబంధమైన ఆరాధన. హజ్ శారీరక ఆరాధనతో పాటు, ధన సంబంధమైన ఆరాధన కూడా. ఆర్థిక స్తోమతతోపాటు బుద్ధిమాంద్యంలేని, ఆరోగ్యవంతులయిన ముస్లింలు జీవితంలో కనీసం ఒకసారి హజ్ యాత్ర జరపడం ఫర్జ్ (విధి). హజ్‌కు వెళ్ళే మార్గం సురక్షితంగా ఉండటం, తిరిగొచ్చేవరకు భార్యాపిల్లల పోషణ ఖర్చుల కోసం తగిన డబ్బు ఉండటం కూడా అవసరమే. హజ్‌కు వెళ్ళేది స్త్రీ అయితే ఆమెకు తండ్రి, సోదరుడు, భర్త, కొడుకు వగైరా ముహరిమ్ బంధువులలో ఎవరో ఒకరు తోడు ఉండాలి.

**హజ్ ఎప్పుడు ఫర్జ్ అయింది:** ప్రియప్రవక్త (సఅసం) మదీనాకు వలస వచ్చి ముస్లింలు కొంచెం స్థిమితపడిన తరువాత హిజ్రీ శకం 6వ సంవత్సరం దైవప్రసన్నత కోసం హజ్, ఉమ్రాలు చేయండని దేవుడు ఆజ్ఞాపించాడు. అయితే ఆ యేడు మక్కా అవిశ్వాసులు దైవప్రవక్త (సఅసం)ను హజ్ చేయనివ్వలేదు. ఆయన (సఅసం) హజ్ చేయకుండానే తిరిగెళ్ళిపోవలసి వచ్చింది. తరువాత హిజ్రీ శకం 10వ సంవత్సరం ఆయన వేలాది మంది అనుచరులను తీసుకొని హజ్ కోసం మదీనా నుండి బయలుదేరారు. చివరికి లక్ష మంది జనంతో ఆయన హజ్ చేశారు.

**హజ్ ప్రాముఖ్యం :** ఇస్లాంలో హజ్‌కు ఎంతో ప్రాముఖ్యం ఉంది. "హజ్ యాత్ర జరపగల శక్తి ఉన్నవారు దేవుని ప్రసన్నత కోసం విధిగా హజ్ చేయాలి. ఈ విధిని నిరాకరించినవారికి దేవునితో ఎలాంటి సంబంధం లేదు. దేవుడు యావత్తు ప్రపంచంలో ఎవరి అవసరమూ లేనివాడు" అని ఖుర్ఆన్‌లో ఉంది. హదీసుల్లో కూడా అనేక చోట్ల హజ్ ప్రాముఖ్యం గురించి చెప్పబడింది. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ఎవరైతే దేవుని ప్రసన్నత కోసం హజ్ చేస్తాడో, హజ్ సందర్భంలో అశ్లీల విషయాలన్నిటికీ దూరంగా మసలుకుంటాడో, ఎవరితోనూ జగడాలకు దిగకుండా, ఎలాంటి చెడ్డపని చేయకుండా ఉంటాడో అతను అప్పుడే తల్లి గర్భం నుంచి పుట్టిన బిడ్డలా పరమ పవిత్రుడయిపోతాడు." నిస్సందేహంగా హజ్ గొప్ప పుణ్యకార్యం. దాని వల్ల ఎన్నో చెడులు దూరమై పోతాయి. మరెన్నో లాభాలు

చేకూరుతాయి. అయితే హజ్ చేసే మనిషికి చిత్తశుద్ధి ఉండాలి. అంటే కేవలం దేవుని ప్రసన్నత కోసమే హజ్ చేయాలి. లోకుల మెప్పు కోసం, పేరుప్రతిష్ఠల కోసం, ప్రాపంచిక ప్రయోజనాలు దృష్టిలో పెట్టుకొని చేయకూడదు. ఇస్లాంలో జిహాద్ అన్నిటికంటే గొప్ప పుణ్యకార్యం. దైవమార్గంలో ప్రాణాలకు త్యగించి పోరాడటాన్నే జిహాద్ అంటారు. జిహాద్ కంటే మించిన పుణ్యకార్యం లేదు. అయితే మన ప్రియప్రవక్త (సఅసం) ఒకసారి హజ్ ఘనత గురించి చెబుతూ "మహిళల కోసం హజ్ యాత్ర జిహాద్ లాంటిదే" అన్నారు.

ప్రియప్రవక్త (సఅసం) మరో సందర్భంలో ఇలా అన్నారు: "ఎవరి దగ్గరయితే దారి ఖర్చుల కోసం డబ్బుతోపాటు వాహన సౌకర్యం కూడా ఉంటుందో అతను గనక హజ్ చేయకపోతే అతను హజ్ చేయకుండా చనిపోవడంలో యూదుడు లేక క్రైస్తవుడిగా మారి చనిపోవడంలో ఎలాంటి తేడా లేదు." దీన్ని బట్టి హజ్ ఎంత గొప్ప పుణ్యకార్యమో తెలుస్తోంది. "హజ్‌కు ప్రతిఫలం స్వర్గం" అన్నారు దైవప్రవక్త (సఅసం). "హజ్, ఉమ్రాలు చేసేవారు దేవుని అతిథులు. వారు దుఆ చేస్తే దేవుడు వారి దుఆ స్వీకరిస్తాడు. వారు క్షమాపణ కోరుకుంటే దేవుడు వారిని క్షమిస్తాడు" అన్నారు ఆయన (సఅసం) మరో సందర్భంలో.

ప్రియప్రవక్త (సఅసం) తరువాత ఆయన అనుచరులు కూడా ఎంతో ఆసక్తిగా హజ్ చేసేవారు. శ్రేయస్కర ఖలీఫాలు కూడా పాలన కాలాల్లో హజ్‌కు ఎంతో ప్రాముఖ్యం ఇచ్చేవారు. వారు సుదూర ప్రాంతాల్లో ఉండే గవర్నర్లను కూడా పిలిపించి పరిస్థితుల్ని గురించి తెలుసుకునేవారు. తగిన సలహాలు ఇచ్చేవారు. అతి ముఖ్యమైన ఆజ్ఞ ఇవ్వాల్సి ఉంటే హజ్ సందర్భంగా వచ్చే జన సమూహంలో దాన్ని బహిరంగంగా ప్రకటించేవారు. ఆ విధంగా ఆ ఆజ్ఞ రాజ్యం నలుమూలలా చేరుకునేలా చేసేవారు. హజ్రత్ ఉమర్ (రజి) ఒకసారి, "స్తోమత ఉన్నా హజ్ చేయనివారికి వ్యతిరేకంగా నేను జిహాద్ చేస్తాను" అని అన్నారు. హజ్రత్ అబూ సయీద్ (రజి) హజ్ గురించి మాట్లాడుతూ, "ప్రజలు కాబాగృహానికి హజ్ యాత్ర జరపడం మానేసినప్పుడు ప్రళయం సంభవిస్తుంది" అన్నారు.

### హజ్ పారిభాషా పదాలు

1. **ఇహ్‌రామ్:** హజ్ దుస్తులు ధరించి, హజ్ సంకల్పం చేసి, హజ్ 'దుఆ' చేయడాన్ని 'ఇహ్‌రామ్' (దీక్ష) అంటారు.
2. **మీఖాత్:** హజ్ చేసేవారు ఒక నిర్ణీత ప్రదేశానికి చేరుకొని ఇహ్‌రామ్ (దీక్ష) పూనుతారు. ఆ ప్రదేశాన్ని 'మీఖాత్' అంటారు.
3. **తల్బియా:** ఇహ్‌రామ్ (దీక్ష) పూనిన దగ్గర్నుంచి హజ్ విధి పూర్తి అయ్యేవరకు కూర్చున్నప్పుడు, నిల్చున్నప్పుడు, హజ్ ఆచారాలు పాటిస్తున్నప్పుడు చేసే దుఆను 'తల్బియా' అంటారు.

**తల్బియా :** لَبَّیْکَ اللّٰھُمَّ لَبَّیْکَ لَا شَرِیْکَ لَکَ لَبَّیْکَ، اِنَّ الْحَمْدَ وَالنِّعْمَةَ لَکَ وَالْمُلْکَ، لَاشَرِیْکَ لَکَ.

**అల్లాహుమ్మ లబ్బైక్, లాషరీక లక లబ్బైక్ ఇన్నల్ హమ్ద వ న్నీమత లక్ వల్ ముల్క్ లక లాషరీక లక.**

**అర్థం:** ఓ అల్లాహ్! నేను నీ పిలుపునందుకొని నీ దర్బారులో హాజరయ్యాను. నీకు సాటి ఎవరూ లేరు. నీ సమక్షంలో హాజరయ్యాను. నిస్సందేహంగా సమస్త విధాల ప్రశంసలు, సకల భాగ్యాలు నీ కొరకే ఉన్నాయి. విశ్వ సామ్రాజ్యం నీదే. నీకెవరూ సాటి లేరు.

4. **తహ్లీల్:** **لَا اِلٰهَ اِلَّا اللّٰهُ مُحَمَّدٌ رَّسُوْلُ اللّٰهِ** **'లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్ రసూలుల్లాహ్'** అని పఠించడాన్ని 'తహ్లీల్' అంటారు.
5. **తవాఫ్:** కాబాగృహం చుట్టూ ప్రదక్షిణ చేయడం.
6. **వఖూఫ్:** అర్ఫాత్, ముజ్దలిఫాలో కొద్దిసేపు ఆగడం.
7. **రమీ:** జుమరహ్ వద్ద గులక రాళ్ళతో కొట్టడం.
8. **తహ్లీఖ్:** వెంట్రుకలు పూర్తిగా గొరిగించుకోవడం.
9. **తఖ్సీర్:** వెంట్రుకలు కత్తిరించడం, చిన్నవి చేయడం.
10. **ఉమ్రా:** ఇహ్రామ్ (దీక్ష) పూని కాబా ప్రదక్షిణ చేయడం. సఫా, మర్వా కొండల మధ్య పరుగెత్తడం. హజ్ దినాలలో కాకుండా వేరే దినాలలో కూడా ఉమ్రా చేయవచ్చు.

**హజ్ రకాలు**

హజ్ మూడు రకాలు. ఇఫ్రాద్, ఖిరాన్, తమత్తు.

1. **ఇఫ్రాద్:** ఎహ్రామ్ (దీక్ష) పూనే సమయంలో హజ్ మాత్రమే చేస్తామని సంకల్పించుకుంటే ఆ హజ్‌ను 'ఇఫ్రాద్' అంటారు. అలాంటి హజ్ చేసే వ్యక్తిని 'ముఫ్రిద్' అంటారు.
2. **ఖిరాన్:** ఎహ్రామ్ (దీక్ష) పూనే సమయంలో హజ్, ఉమ్రా రెండూ చేస్తామని సంకల్పించుకుంటే దాన్ని 'ఖిరాన్' అంటారు. అలాంటి సంకల్పం చేసిన వ్యక్తిని 'ఖారిన్' అంటారు.
3. **తమత్తు:** హజ్ దినాలలో మొదట ఉమ్రా దీక్ష పూని ఉమ్రా చేయాలి. తరువాత కొన్నాళ్ళకు ఆ దీక్ష విరమించి హజ్ దీక్ష పూనాలి.

**హజ్ చేసే విధానం :**

అర్ఫాత్ మైదానంలో జుహర్, అసర్ నమాజులు కలిపి చేయాలి. సూర్యుడు అస్తమించగానే ముజ్దలిఫా చేరుకోవాలి. అక్కడ మగ్రిబ్, ఇషా నమాజులు కలిపి చేయాలి. ఆ రాత్రి ముజ్దలిఫాలోనే గడుపాలి. జిల్‌హజ్ 10వ తేదీన ఉదయం నమాజు చేయగానే మినాకు బయలుదేరాలి. మధ్యాహ్నం వేళకు ముందే మినా చేరుకొని అక్కడ జుమరాపై ఏడు కంకర రాళ్ళు రువ్వాలి. దీనినే 'రమీ' అంటారు. 'రమీ' తరువాత తల్బియా చెప్పడం మానేయాలి. ఆ తరువాత ఖుర్బాని (బలి) ఇచ్చి తల వెంట్రుకలు ముండనం చేయించుకోవడమో లేదా కత్తిరించుకోవడమో చేయాలి. ఇహ్రామ్ దుస్తులు తీసేసి సాధారణ

దుస్తులు ధరించాలి. మినాలో జిల్‌హజ్ 12వ తేదీ వరకు ఉంటాము. ఈ మధ్య ఎప్పుడు అనుకుంటే అప్పుడు కాబా ప్రదక్షిణ చేస్తుండాలి. జిల్‌హజ్ 12వ తేదీ గడచిపోగానే హజ్ విధి సమాప్తం అవుతుంది. ఇలా హజ్ యాత్ర ముగించుకొని ప్రియప్రవక్త (సఅసం) పట్టణాన్ని సందర్శించడానికి వెళ్తారు. దైవగృహం సందర్శించాక ప్రియప్రవక్త (సఅసం) పవిత్ర సమాధిని సందర్శిస్తారు. ఆయన మస్జిద్‌లో నమాజు చేస్తారు. ఆయన కోసం దరూద్ పఠిస్తారు. ఈ విధంగా ఇహపర సౌభాగ్యాలు మూట కట్టుకొని తిరిగివస్తారు. అల్లాహ్ మనందరికీ హజ్ యాత్ర చేసే అదృష్టం ప్రసాదించుగాక. ప్రియ ప్రవక్త (సఅసం) పవిత్ర సమాధిని దర్శించే భాగ్యం కలిగించుగాక! హజ్ సౌభాగ్యాలన్నీ ప్రసాదించు గాక. ఆమీన్.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి?**

1. హజ్ అని దేన్నంటారు?
2. హజ్ చేయడానికి ఏ సౌలభ్యాలు కలిగి వుండడం అవసరం?
3. హజ్ విశిష్టతకు సంబంధించి దివ్యఖుర్‌ఆన్ ఆదేశాన్ని వివరించండి.
4. హజ్ విశిష్టతను గురించి ప్రియప్రవక్త(స) నుడివిన ఏదైనా ఒక హదీసును వ్రాయండి.
5. హజ్‌లో ఎన్ని రకాలుంటాయి? ప్రతి దాన్ని నిర్వచించండి.
6. 'తల్బియ' దేన్నంటారు? అనువాదంతో సహా వ్రాయండి
7. ఏ ప్రాంతంలో జొహర్, అస్ర్ నమాజులు కలిపి చేయబడతాయి?
8. ఉమ్రా అంటే అర్థం ఏమిటి?

**ఆ) క్రింది ఖాళీలను పూరించండి.**

1. మగ్రిబ్, ఇషా నమాజులు ..............................................లో కలిపి చేయబడతాయి?
2. ప్రియప్రవక్త(స) తరువాత ఆయన సహచరులు కూడా ........... ను అత్యంత కట్టుదిట్టంగా చేసేవారు.
3. కాబా దైవగృహపు సందర్శనం తరువాత ప్రియప్రవక్త(స) ....................... సందర్శించు కుంటారు.

## ఇ) ఈ క్రింది వాక్యాల్లో తప్పొప్పుల్ని గుర్తించండి.

1. హజ్ ఇస్లాంలోని అతి ముఖ్యమైన ఆరాధన ( )
2. ముస్లింలపై హజ్ జీవితంలో మూడుసార్లు ఫర్జ్ (విధి) అయి వుంటుంది. ( )
3. ప్రియప్రవక్త(స) కాబా దైవగృహాన్ని విగ్రహాల నుండి పవిత్రపరిచారు ( )
4. హిజ్రీ 7వ సంవత్సరంలో హజ్ ఫర్జ్ అయింది ( )
5. స్త్రీలకు హజ్‌యే జిహాద్ లాంటిది ( )
6. ముజ్‌దలిఫలో ఇషా, ఫజ్ర్ నమాజులు కలిపి చేయబడతాయి ( )

## ఈ) ఈ క్రింది వాటిని జతపరచండి?

| అ | ఇ |
|---|---|
| 1. ఖిరాన్ | హజ్ సంకల్పంతో హజ్ ఉడుపులు ధరించటం, హజ్ దుఆ పఠించటం |
| 2. తహ్‌లీఖ్ | తలవెంట్రుకల్ని కత్తిరించుకోవటం, లేక చిన్నవిగా చేసుకోవటం |
| 3. తవాఫ్ | ఇహ్రామ్ (హజ్ ఉడుపులు) ధరించేటప్పుడు హజ్, ఉమ్రా రెండింటి సంకల్పం చేసుకోవటం |
| 4. తఖ్‌సీర్ | హజ్ కోసం ఇహ్రామ్ తొడిగే ప్రదేశం |
| 5. ఇహ్రామ్ | కాబా దైవగృహం చుట్టు ప్రదక్షిణం చేయటం |
| 6. మీఖాత్ | తలగొరిగించుకోవటం |
| 7. రమి | అరఫాత్, ముజ్‌దలిఫాలో కొంచెంసేపు ఆగటం |
| 8. వఖూఫ్ | జమ్రా వద్ద గులకరాళ్ళను విసరటం. |



# 12. దివ్య ఖుర్‌ఆన్

అల్లాహ్ మనకు అసంఖ్యాకమైన మేళ్ళు చేకూర్చాడు. అన్నిటికంటే గొప్ప మేలు– ఆయన మనకు మంచి జీవితం గడపడానికి తగిన విధానం నేర్పాడు. మన ప్రియప్రవక్త (సఅసం)పై ఆయన తన గ్రంథాన్ని అవతరింపజేశాడు. ఆ గ్రంథం మంచి చెడుల వ్యత్యాసానికి గీటురాయి. అల్లాహ్‌కు నచ్చిన పనులు అందులో ఉన్నాయి. ఆయన ప్రియదాసుల గుణగణాలు ఉన్నాయి. నరక శిక్ష నుండి కాపాడుకునే, స్వర్గం పొందే విధానం ఉంది. స్వర్గాన్ని అలంకరించే మార్గం అందు చూపబడింది. ఖుర్‌ఆన్ గొప్ప మార్గదర్శక గ్రంథం. అందులో ఇహపర లోకాల ప్రయోజనాలకు సంబంధించిన చట్టాలు ఉన్నాయి. ఖుర్‌ఆన్‌ని వదిలేస్తే ఇక మనకు ఎక్కడా సన్మార్గం లభించదు.

దివ్యఖుర్‌ఆన్ 23 సంవత్సరాల కాలంలో అవసరాన్నిబట్టి కొద్దికొద్దిగా మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం)పై అవతరించబడింది. ఈ గ్రంథం అవతరించ బడిననాటి నుండి ఇప్పటికీ తన అసలు స్వరూపంలోనే ఉంది. ప్రళయం వరకు అలాగే సురక్షితంగా ఉంటుంది. ఇందులోని బోధనలు మానవులందరికీ, అన్ని కాలాలకూ వర్తిస్తాయి. ఇది మన జీవిత సంవిధానం, సమగ్ర చట్టం. ఇందులో సరైన విశ్వాసాలు, ఆరాధనా పద్ధతులు తెలియజేయబడ్డాయి. తల్లిదండ్రుల, బంధువుల హక్కులు ఉన్నాయి. సాధారణ ప్రజలతో సత్ప్రవర్తన కలిగి ఉండాలని చెప్పబడింది. విద్యాశిక్షణల పద్ధతులు వివరించబడ్డాయి. ఇచ్చిపుచ్చుకోవడాలు, సంపాదించే, ఖర్చుపెట్టే పద్ధతులు ఉన్నాయి. ప్రపంచంలో శాంతి స్థాపన, దైవపరిపాలన సంస్థాపన విధానాలు పేర్కొనబడ్డాయి. ఇలాంటి మహత్తర గ్రంథంలోని విషయాలను పాటించడం ద్వారానే మనం ఇహపర సౌభాగ్యాలు పొందగలం.

**ఖుర్‌ఆన్ సంకలనం:** దివ్యఖుర్‌ఆన్ పూర్తిగా దైవప్రవక్త (సఅసం) కాలంలోనే వ్రాయబడింది. మనం ఇప్పుడు ఖుర్‌ఆన్‌ని ఏ క్రమంలో పఠిస్తున్నామో ఆ క్రమపద్ధతిని మన ప్రియప్రవక్త (సఅసం) దేవుని ఆదేశంతోనే ప్రవేశపెట్టారు. ఏదైనా ఆయత్ అవతరించినప్పుడు దాన్ని ఫలాన సూరాలో, ఫలాన చోట చేర్చి వ్రాయండని వ్రాసేవారికి చెప్పేవారు. అలాగే క్రొత్తగా ఏదైనా సూరా అవతరించి నప్పుడు దాన్ని ఫలానా సూరా తరువాత పెట్టండని చెప్పేవారు. ప్రియప్రవక్త (సఅసం) కాలంలోనే వందలాది మంది అనుచరులు ఖుర్‌ఆన్‌ని కంఠస్థం చేసుకున్నారు. ఖుర్‌ఆన్ ఆనాడే గ్రంథస్థం చేయబడింది. అయితే ఖుర్‌ఆన్ సూరాలు వివిధ రకాల వస్తువులపై వ్రాయబడ్డాయి. హజ్రత్ ఉమర్ (రజి) సలహాతో హజ్రత్ అబూబకర్ (రజి) ముఖ్యమైన సహాబీలను సంప్రదించి మొత్తం ఖుర్‌ఆన్‌ని ఒక గ్రంథంగా రూపొందించారు.

హజ్రత్ ఉస్మాన్ (రజి) పరిపాలనా కాలంలో ఇస్లాం సుదూర ప్రాంతాలకు విస్తరించింది. లక్షలాది మంది అరబ్బేతరులు కూడా ఇస్లాం స్వీకరించారు. అప్పటిదాకా విభిన్న తెగల ప్రజలు ఖుర్‌ఆన్‌ని విభిన్న రీతులలో పఠిస్తుండేవారు. ఆ తరువాత హజ్రత్ ఉస్మాన్ (రజి) ఖురైష్ తెగ ఉచ్చారణ, పఠన రీతుల ప్రకారం అనేక ప్రతులు తయారుచేయించి యావత్తు ఇస్లాం రాజ్యంలో వ్యాపింపజేశారు. ఇకనుంచి అందరూ అదే ఉచ్చారణతో, అదే పఠన రీతితో ఖుర్‌ఆన్ చదవాలని ఉత్తర్వు జారీచేశారు.

**ఖుర్‌ఆన్ పఠనం :** ఖుర్‌ఆన్ గ్రంథానికి దేవుడే ఖుర్‌ఆన్ అని పేరు పెట్టాడు. మాటిమాటికి, బాగా చదవబడేదాన్ని ఖుర్‌ఆన్ అంటారు. అందుకే మనం ఖుర్‌ఆన్‌ని మాటిమాటికి చదువుతుంటాము. మన ప్రియప్రవక్త (సఅసం) దీన్ని నిరంతరం పఠిస్తుండేవారు. ఆయన ఒక్కోసారి ఖుర్‌ఆన్ పఠించి ఇతరులకు విన్పించేవారు ఒక్కోసారి ఇతరుల నోట వినేవారు. ప్రతియేడూ రమజాన్ నెలలో ఖుర్‌ఆన్ మొత్తం పఠించి హజ్రత్ జిబ్రీల్ (అలై)కు విన్పించేవారు. ప్రవక్త అనుచరులు కూడా తమ సమయాన్ని ఎక్కువగా ఖుర్‌ఆన్ పఠనంలో గడిపేవారు. ఖుర్‌ఆన్ మాటిమాటికి చదవాలనిపించే గ్రంథం. ఖుర్‌ఆన్ పఠనం వల్ల ఇస్లాం పట్ల మన విశ్వాసం దృఢమవుతుంది. దేవునిపై ప్రేమ పెరుగుతుంది. ప్రవక్తల విధానాలను అనుసరించే ఆసక్తి అధికమవుతుంది: సజ్జనుల పట్ల అభిమానం జనిస్తుంది. దుష్కార్యాలు మాని మరిన్ని సత్కార్యాలు చేసే శక్తి కలుగుతుంది. దైవప్రసన్నత లభించే పనులు మరిన్ని చేయాలనిపిస్తుంది. ఈ కారణంగానే మన ప్రియప్రవక్త (సఅసం) "ఖుర్‌ఆన్ చదివే, చదివించే వాడే మీలో అందరి కంటే శ్రేష్ఠుడు" అని చెప్పారు.

ఖుర్‌ఆన్ పారాయణం (తిలావత్) అంటే ఖుర్‌ఆన్‌ని బాగా అర్థం చేసుకుంటూ చదవడం అని అర్థం. అందుకే మనం దాన్ని అర్థం చేసుకుంటూ చదువుతాము. అందులోని ఒక్కొక్క విషయాన్ని పరిశీలిస్తూ చదువుతాం. ఖుర్‌ఆన్ ఒక అద్దం లాంటిది. అందులో పాఠకుడికి తనలోని మంచి చెడులేమిటో స్పష్టంగా కన్పిస్తాయి. దివ్యఖుర్‌ఆన్ ద్వారా ప్రయోజనం పొందడానికి మూడు విషయాలను దృష్టిలో పెట్టుకోవలసిన అవసరముంది:

1. ఖుర్‌ఆన్ పఠనం సందర్భంలో, ఇది అల్లాహ్ పంపిన దివ్య గ్రంథమన్న నమ్మకంతో చదవాలి. ఇందులో ఎలాంటి తప్పులుండవని, ఇహపరాల భాగ్యాలు ఇందులోనే ఉన్నాయని గట్టిగా విశ్వసించాలి. ఇలాంటి గ్రంథాన్ని వదిలేస్తే ఇక మనం ఏ విధంగా కూడా సన్మార్గం పొందలేము.
2. దివ్యఖుర్‌ఆన్‌ని మనం చిత్తశుద్ధితో పఠించాలి. లోకుల మెప్పు కోసం, పేరుప్రతిష్ఠల కోసం చదవకూడదు. ప్రాపంచిక ప్రయోజనాలు నెరవేర్చుకునే ఉద్దేశ్యంతో కూడా చదవకూడదు. దైవప్రసన్నతను ఆశిస్తూ మంచిని గ్రహించాలని, గుణపాఠం నేర్చుకోవాలని, పరలోకంలో స్వర్గ మహాభాగ్యాలు పొందాలని భావిస్తూ శ్రద్ధాసక్తులతో చదవాలి.
3. ఖుర్‌ఆన్ పఠించడానికి ముందు మనం ఆ గ్రంథంలో చదివే దైవాజ్ఞలను చిత్తశుద్ధితో ఆచరిస్తామని, ఇందులో పేర్కొనబడిన దుర్జనుల దుర్గుణాలకు, దుర్లక్షణాలకు దూరంగా ఉంటామని, సజ్జనుల సుగుణాలను అలవరచుకుంటామని నిర్ణయించుకోవాలి.

ఈ మూడు విషయాలను దృష్టిలో పెట్టుకొని ఖుర్‌ఆన్ పఠనం ప్రారంభిస్తే ఒక్కొక్క చెడు మనకు ముల్లయి గుచ్చుకున్నట్లు అన్పిస్తుంది. దాని పట్ల అసహ్యం కల్గుతుంది, మంచిని పాటించమని మన అంతరంగం ప్రేరేపిస్తుంది, చెడులు ఉండే దారి మనకు ఎంతో ఇరుకుగా, చీకటిగా కన్పిస్తుంది. సత్కార్యాల మార్గం ఎంతో విశాలంగా, ప్రకాశవంతంగా గోచరిస్తుంది.

ప్రభూ! ఖుర్ఆన్‌ని బాగా అర్థం చేసుకునే, అది చూపే దారిన నడిచే సద్బుద్ధి ప్రసాదించు మాకు. ఆమీన్.

## అభ్యాసం

**అ) క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి?**

1. దివ్యఖుర్ఆన్ ఎందుకని అవతరించబడింది?
2. దివ్యఖుర్ఆన్ సంగ్రహంగా, క్రమానుసారంగా రూపొందించటం గురించి మీకేం తెలుసు?
3. దివ్యఖుర్ఆన్‌ను 'ఖుర్ఆన్' అని ఎందుకంటారు? పారాయణం అంటే అర్థం ఏమిటి?
4. దివ్యఖుర్ఆన్‌ను చదువుతున్నప్పుడు ఏ విషయాన్ని గమనించాల్సి ఉంటుంది?
5. దివ్యఖుర్ఆన్ బోధనలేమిటి?
6. దివ్యఖుర్ఆన్ ద్వారా ఒనగూరే లాభాలేమిటి?

**అ) క్రింది ఖాళీలను పూరించండి**

1. దివ్యఖుర్ఆన్ ................సంవత్సరాల వ్యవధిలో కొంచెం కొంచెంగా, అవసరం మేరకు అవతరించింది.
2. దివ్యఖుర్ఆన్ మన పూర్తి జీవితపు ....................
3. దివ్యఖుర్ఆన్‌ను అవలంభించటంలో మన .............. సాఫల్యం ఉంది.
4. హ'జ్రత్ ఉస్మాన్ (రజి) ....................... ఉచ్చారణ, యాసను అనుసరించి ఖుర్ఆన్ అనేక ప్రతుల్ని వ్రాయించారు. మొత్తం ఇస్లామీయ సామ్రాజ్యంలో వ్యాపింపజేశారు.
5. ఖుర్ఆన్‌ను పఠించే, నేర్పేవారు మీలో అందరికన్నా .......... వారు.

## చేయాల్సిన మరి కొన్ని పనులు

ప్రతిరోజు ఖుర్ఆన్‌ను అర్థం చేసుకుంటూ చదివే ఏర్పాట్లు చేసుకోండి.



# 13. ప్రియప్రవక్త (సఅసం) ఏమనేవారు? ఏం చేసేవారు?

మహనీయ ముహమ్మద్ (సఅసం) అల్లాహ్ పంపిన చివరి ప్రవక్త. ఇహపర లోకాల మేళ్ళన్నీ అల్లాహ్ తన ప్రవక్తకు తెలియపరిచాడు. చిన్ననోట పెద్దమాట. ఏమని పొగడగలం ప్రియప్రవక్తను గురించి. సంక్షిప్తంగా చెప్పాలంటే అల్లాహ్ ఔన్నత్యం తరువాత ప్రియప్రవక్త (సఅసం)యే గొప్పవారు.

ప్రియప్రవక్త (సఅసం) చాలా మంచివారు. ఎల్లప్పుడు అల్లాహ్ ఆరాధనలో నిమగ్నులయి ఉండే వారు. ప్రతిదినం అర్ధరాత్రి గడిచాక నిద్ర నుండి మేల్కొనేవారు, వుజూ చేసేవారు, మిస్వాక్‌తో పళ్ళు తోముకునేవారు, నమాజులో నిమగ్నమయ్యేవారు. చాలాసేపు వరకు నమాజు చేసేవారు. ప్రశాంతంగా, ఏకాగ్రతతో నమాజు చేసేవారు. అల్లాహ్ ఎదుట కన్నీరు కారుస్తూ దుఆ చేసేవారు. ఫజర్ నమాజు పెందలకడ చేసేవారు. నమాజులో చాలాసేపు వరకు ఖుర్‌ఆన్ పఠించేవారు. ఖుర్‌ఆన్ వాక్యాల్ని స్పష్టంగా పఠించేవారు. ఖుర్‌ఆన్ చదవడమంటే ఆయన (సఅసం)కు ఎంతో ఇష్టం. ప్రతిదినం గ్రంథ పారాయణం చేసేవారు. ఇతరుల్ని ఖుర్‌ఆన్ చదవమని చెప్పేవారు, స్వయంగా వినేవారు. దివ్యఖుర్‌ఆన్ పఠిస్తూ కన్నీరు కార్చేవారు, గడ్డం తడిసిపోయేది. ఖుర్‌ఆన్ సృష్టికర్త ప్రసాదించిన గ్రంథం కదా! ఖుర్‌ఆన్ విన్న తరువాత హృదయం చలించకపోతే ఇక ఆ మనిషి ముస్లిం ఎలా అవుతాడు?

మన ప్రియప్రవక్త (సఅసం) అన్ని వేళలా అల్లాహ్‌ను స్మరించేవారు. ప్రతి సందర్భంలోనూ అల్లాహ్ గుణగణాలను స్తుతించేవారు. అల్లాహ్ అంటే అమితంగా భయపడేవారు. నమాజు చేస్తున్నప్పుడు దైవభీతితో ఆయన (సఅసం) కన్నీరు కార్చేవారు. అప్పుడప్పుడు రాత్రంతా దుఃఖిస్తూ గడిపేవారు.

ప్రియప్రవక్త (సఅసం) సతతం ఉల్లాసంగా ఉండేవారు. చిరునవ్వుతో ఆహ్లాదంగా ఉండేవారు. మృదు హృదయం కలవారు, కనికరానికి నిలయం. ఎప్పుడూ ఎవరినీ బాధించేవారు కాదు. చెడు ఎన్నడూ పలకలేదు. ఎవరి లోపాన్వేషణలో పడేవారు కాదు, చాడీలు చెప్పేవారు కాదు, ఎవరినీ చెడ్డ పేరుతో పిలిచేవారు కాదు. ప్రతి ఒక్కరిని ప్రేమతో మాట్లాడేవారు. ఎవరితోను జగడమాడేవారు కారు, ఎన్నడూ ఎవరినీ కొట్టలేదు. తిట్టలేదు కూడా.

ప్రియప్రవక్త(స) సత్యసంధులు. నిత్యం సత్యం పలికేవారు. ఈ కారణంగా ప్రజలు ఆయన్ని 'సాదిఖ్' అని పిలిచేవారు "సత్యంలో మోక్షం ఉంది, అబద్ధంలో వినాశం ఉంది" అని ఆయన చెప్పేవారు. మన ప్రియప్రవక్త (స) ఎంతో నిజాయితీపరులు కూడా. "భద్రపరచమని ఇచ్చిన సొమ్ము విషయంలో ఎవరయితే నమ్మకద్రోహం చేస్తారో వారిలో విశ్వాసం లేదు" అని ఆయన (సఅసం) చెప్పేవారు. ప్రజలు ఆయన (సఅసం) వద్ద తమ సొమ్మును భద్రపరచుకునేవారు, ఆయన వద్ద తమ సొమ్ముకు భద్రత ఉంటుందని ప్రజలు నమ్మేవారు. ఈ నిజాయితీ వల్లనే మక్కావాసులు ఆయన (సఅసం)ను 'అమీన్' (నిజాయితీపరుడు) అని పిలిచేవారు.

మన ప్రియప్రవక్త (స) వ్యాధిగ్రస్తులను పరామర్శించేవారు. వారి యోగక్షేమాలు తెలుసుకోడానికి వారి ఇండ్లకు పోయివచ్చేవారు. వారి దగ్గర కూర్చుండి ఓదార్చేవారు, వారి కోసం 'దుఆ' చేసేవారు. దారిలో ఎవరైనా అగుపిస్తే వారికి సలాము చేసేవారు, కరచాలనం చేసేవారు. సమావేశాలలో ఉంటే అందరితోపాటు కలసి కూర్చొనేవారు. కూర్చోవడానికి ప్రత్యేక స్థానం కోరేవారు కాదు. అందరితోపాటు కలసి నడిచేవారు. తన పని స్వయంగా చేసుకొనేవారు. కష్టపడి పనిచేయడం మంచిదని తలచేవారు. గుర్రపు స్వారీ అంటే ఆయన (సఅసం)కు చాలా ఇష్టం. ప్రియప్రవక్త (స)కు వెనిగర్, తేనె, మాంసం అంటే ఇష్టం. మామూలు అన్నమే తినేవారు, ఎదుటకు వచ్చిన భోజనాన్ని సంతోషంగా ఆరగించేవారు. అన్నంలో లోపాన్ని తీసేవారు కాదు. వెల్లుల్లి వాసన అంటే ఆయనకు గిట్టదు. ఉల్లిపాయలు, వెల్లులి తిని మస్జిద్‌కు వెళ్ళరాదని చెప్పేవారు. సాదాసీదా దుస్తులు ధరించేవారు.

లుంగీ ధరించేవారు. దుప్పటి కప్పుకొనేవారు. తలపై టోపీ పెట్టుకొని పాగా కట్టేవారు. తెల్లని దుస్తులు ధరించేవారు. తెల్లని రంగు అంటే ఇష్టం. ఎప్పుడూ పరిశుభ్రమయిన బట్టలు వేసుకొనేవారు. ప్రియప్రవక్త (స)కు సువాసన అంటే అమితప్రీతి. ఎవరైనా అత్తరు కానుకగా ఇస్తే స్వీకరించే వారు. అత్తరు పూసుకొనేవారు. మాసిన బట్టలు వేసుకొనేవారు కాదు. స్నానం చేసేవారు. తల వెంట్రుకలను దువ్వుకొనేవారు, నూనె రాసుకొనేవారు. కళ్ళకు సుర్మా పెట్టుకునే వారు. ఎప్పుడూ పరిశుభ్రంగా ఉండే వారు, అనుచరులకు పరిశుభ్రంగా ఉండమని నొక్కి చెప్పేవారు.

ప్రియప్రవక్త (స)కు పిల్లలంటే ఎంతో ఇష్టం. దారిలో పిల్లలు ఎదురైతే వారికి సలాము చేసేవారు. వారితో కాస్సేపు ముచ్చటించేవారు. బాలబాలికలు ఆయన (సఅసం)ను చూచిన వెంటనే చుట్టూ గుమిగూడే వారు. ప్రియప్రవక్త పసి పిల్లలను ముద్దాడేవారు, ఒడిలో కూర్చోపెట్టుకొనేవారు. ఆప్యాయంగా మాట్లాడే వారు. మహాప్రవక్త (సఅసం) మదీనాకు వలస వచ్చినప్పుడు బాలికలు సంతోషంగా పాటలు పాడుతూ ఆయన (సఅసం)కు స్వాగతం పలికారు. ఆ బాలికలతో ఆయన, "మీరు నన్ను ప్రేమిస్తున్నారా?" అని అడిగారు. దానికి ఆ బాలికలు "అవును, దైవప్రవక్తా!" అన్నారు. అప్పుడు ఆయన (స) "అయితే నేనూ మిమ్మల్ని ప్రేమిస్తున్నాను" అని చెప్పారు. ప్రియప్రవక్త (సఅసం) నెమ్మదిగా మాట్లాడేవారు. ఎవరైనా ఆయన (సఅసం) మాటలు వింటే వాటిని బాగా అర్థం చేసుకొనేవారు. పలుకులు ఆణిముత్యాల్లా ఉండేవి.

బిగ్గరగా చెప్పేవారుకాని గొంతుచించుకొని కాదు. ఖుర్‌ఆన్ వాక్యాలు గంభీరంగా పఠించేవారు. కాబాలో కూర్చుని దివ్యఖుర్‌ఆన్ చదువుతుంటే చుట్టు ప్రక్కల ఇండ్లల్లో ఉండేవారికి వినిపించేది. శ్రోతలు ఆ పఠనాన్ని చెవియొగ్గి ఆలకించేవారు. ప్రియప్రవక్త (స) తరచూ మౌనంగా ఉండేవారు. మాట్లాడితే పనుల విషయాలే ప్రస్తావించేవారు. ప్రియప్రవక్త (స) అల్లాహ్ పంపిన చివరి ప్రవక్త. అల్లాహ్ ఆయన (సఅసం)కిచ్చిన చివరి సందేశాన్ని తెచ్చారు. ప్రతి ఒక్కరికి దైవసందేశం వినిపించారు. అల్లాహ్ ఇచ్చిన హితవులను అందరికీ అందజేశారు. అల్లాహ్ దాసులను అల్లాహ్ వైపునకు పిలుపునిచ్చారు. మంచి మంచి మాటలు ప్రజలకు చెప్పేవారు. మంచి పనులు చెయ్యమని ఆదేశించేవారు. చెడు పనుల నుండి

వారించేవారు. సృష్టికర్తను మాత్రమే ఆరాధించాలని చెప్పే వారు. మిథ్యాదైవాల ఆరాధన నుండి ప్రజలను వారించేవారు. అల్లాహ్ తప్ప ఇతర ఆరాధ్యుడు లేడని చెప్పేవారు.

ప్రియప్రవక్త (సఅసం) ప్రజలకు ఇలా బోధించేవారు: "దేవుడు ప్రతిదాన్నీ సృష్టించాడు. ఆయన మన జీవిత అవసరాలను తీరుస్తున్నాడు, మనలను పోషిస్తున్నాడు. ఆయన చేతుల్లోనే మనందరి జీవన్మరణాలున్నాయి. లాభనష్టాలు ఆయనే కలగజేస్తాడు. గౌరవమర్యాదలు ఆయన అధీనంలోనే ఉన్నాయి. ఎవరికైనా ఆయన దుఃఖం కలగజేస్తే సుఖం ఎవ్వరూ ఇవ్వలేరు. అలాగే ఎవరికైనా సుఖం ఇవ్వదలిస్తే దుఃఖాన్ని ఎవరూ ఇవ్వలేరు. ఆజ్ఞలు ఇవ్వడం ఆయనకే శోభిస్తుంది. యావత్తు విశ్వంలో ఆయన రాజ్యమే నడుస్తోంది. ఆయనే అందరి యజమాని, చక్రవర్తి. ఆయన ఎదుట అందరూ అసహాయులే, నిరాధారులే." మన ప్రియప్రవక్త (సఅసం) ఇంకా ఇలా అన్నారు:

"ప్రజలారా! ఏకైక దేవునికి మాత్రమే దాస్యం చేయండి. ఆయన ఆజ్ఞల్ని పాటించండి. ఆయన పట్ల విధేయత కలిగి ఉండండి. మానవుడు దైవానికి మాత్రమే దాసుడు, సేవకుడు. ఆయన సేవలోనే మనందరి గౌరవమర్యాదలు ఉన్నాయి. ఇహపరాలలో సౌఖ్యం ఉంది. ఆయన ఆజ్ఞలననుసరించి జీవించేవాని జీవితమే ప్రపంచంలోను, పరలోకంలోను విజయవంతమవుతుంది. ఎవడైతే ఆయనకు అవిధేయుడైపోయి జీవితం గడుపుతాడో అతని జీవితం ఇహపరాలలో నష్టపోతుంది. ప్రజలారా! ఒకానొక రోజున ఈ ప్రపంచం అంతమవుతుంది. సూర్యచంద్రులు ఒకదానితో మరొకటి కొట్టుకొని తుత్తునియలవుతాయి. నక్షత్రాలు రాలిపడతాయి. భూమ్యాకాశాల యావత్తు వ్యవస్థ ఛిన్నాభిన్నమవుతుంది. మళ్ళీ అల్లాహ్ మరో ప్రపంచం సృష్టిస్తాడు. ప్రపంచంలో పుట్టి గిట్టిన వారందరు మళ్ళీ సజీవులవుతారు. సజీవమైన తరువాత అల్లాహ్ సమక్షంలో హాజరవుతారు. ఎవరెవరు ఏం చేశారో అంతా తెలుపుకొంటారు. ఆచరణల విచారణ జరుగుతుంది. పుణ్యకార్యాలు చేసినవారికి బహుమానం ఇవ్వబడుతుంది. పాపకార్యాలు చేసిన వారికి శిక్ష పడుతుంది. ఆ దినాన్ని అంతిమ దినం అంటారు. పరలోక జీవితం శాశ్వతమైనది. స్వర్గం సర్వసుఖాలకు నిత్య నిలయం. అక్కడ ఎన్నో ఉద్యానవనాలు, పండ్ల తోటలుంటాయి. అక్కడి సౌఖ్యం అంతంకాదు. పుణ్యాత్ములకు అది నిలయం. నరకం నరక యాతనలకు సంబంధించిన పెద్ద గొయ్యికి మారుపేరు. అక్కడి యాతనలు మన ఊహకు సయితం అందనంత కఠినంగా, ఘోరాతి ఘోరంగా ఉంటాయి. ఇది సత్య తిరస్కారుల కోసం నిర్ణయించబడిన చోటు."

మహాప్రవక్త (సఅసం) ఇంకా ఇలా బోధించారు:

"ప్రజలారా! అల్లాహ్ మిమ్మల్ని నరకయాతన నుండి రక్షించి మీకు స్వర్గమార్గం చూపించడానికి నన్ను మీ దగ్గరకు పంపాడు. ఆయన నాకు తన అభిమతం ఏమిటో తెలియజేసి, తనకు ఇష్టమైన పను లేమిటో తెలియజేసి పంపాడు. నేను మీకు మంచి విషయాలు తెలియజేయడానికి వచ్చాను. రుజుమార్గం చూపడానికి వచ్చాను. దేవుడు నాకు తన ఆజ్ఞలను ఇచ్చి పంపాడు. నేను ఆయన ఇచ్చిన గ్రంథం తీసు కొని వచ్చాను. స్వయంగా నేనూ ఆ గ్రంథాన్ని అనుసరిస్తున్నాను. మీరు కూడా దాని ప్రకారమే ఆచరించండని కోరుతున్నాను. ఖుర్ఆన్ అల్లాహ్ పంపిన అంతిమ గ్రంథం. దానిని అనుసరించడం

వల్ల మోక్షం లభిస్తుంది. నేను కూడా దేవుని దాసుణ్ణే. ఆయన ఆజ్ఞలను అనుసరిస్తున్నాను. ఆయన్నే నేను నా ప్రభువుగా, యజమానిగా పరిగణిస్తున్నాను."

ప్రియప్రవక్త ఇలా అన్నారు: "నా హితవులను ఎవరయితే శ్రద్ధతో విని వాటికి అనుగుణంగా తన జీవితాన్ని మలచుకొంటారో దానివల్ల అతనికే లాభం కలుగుతుంది. మరణానంతర జీవితంలో సర్వసుఖాలు అనుభవిస్తాడు. మరెవరైతే నా బోధనలను తృణీకరిస్తారో, దైవదూతలు అతడ్ని ఈడ్చుకొని వెళ్ళి, నరకంలో పడేస్తారు. అది అనేక యాతనలకు నిలయం. వాటిని గురించి వింటేనే దేహం కంపిస్తుంది."

ప్రభూ! మమ్మల్ని నరక శిక్ష నుండి రక్షించు. ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం)తోబాటు స్వర్గంలో ప్రవేశింపజేయి. (ఆమీన్)

ప్రియప్రవక్త (సఅసం) బోధనలు, ఆయన పనులన్నీ ఎంత బాగున్నాయో చూడండి! అయినప్పటికీ మక్కా అవిశ్వాసులు ఆయన (సఅసం) మాటలు వినలేదు. పైగా ఆయన (సఅసం)ను అనేక విధాలుగా వేధించేవారు. ఆయన మనస్సును కష్టపెట్టేవారు. దైవాగ్రహాన్ని కొనితెచ్చుకునేవారు. కాని ప్రియప్రవక్త (సఅసం) సహనశీలురు. ఆయన అవిశ్వాసులు పెట్టిన బాధలను సహనంతో భరించారు. బాధాతప్త హృదయంతో వారికి ఇస్లాం గురించి నచ్చజెప్పేవారు. ఎవరినీ ఎప్పుడూ శపించలేదు. జీవించి ఉన్నంతవరకు అల్లాహ్ ఆజ్ఞలను ప్రచారం చేశారు. ఆయనపై శాంతీ శ్రేయాలు అవతరించుగాక!

అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిన్ వబారిక్ వ సల్లమ్.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి?**

1. ప్రతి రాత్రి చివరి భాగంలో ప్రియప్రవక్త(స) ఏమి చేసేవారు?
2. ఖుర్ఆన్‌తో ప్రియప్రవక్త(స)కు ఏ సంబంధం ఉండేది?
3. ప్రియప్రవక్త(స) స్వభావం ఎలాంటిది?
4. రోగుల పట్ల ప్రియప్రవక్త(స) ప్రవర్తన ఎలా ఉండేది?
5. సభలో ప్రియప్రవక్త(స) వ్యవహారం ఎలా ఉండేది?
6. ప్రియప్రవక్త(స) ఎలాంటి భోజనాన్ని ఇష్టపడేవారు?
7. ప్రియప్రవక్త(స) ఎలాంటి దుస్తులను ఇష్టపడేవారు?
8. ప్రియప్రవక్త(స) ప్రజలకు ఏమి తెలుపుతుండేవారు?
9. అల్లాహ్‌కు సంబంధించి ప్రియప్రవక్త(స) ఏ విషయాలు తెలిపారు?
10. అల్లాహ్ ప్రియ ప్రవక్త(స)ను దేనికోసమని పంపారు?
11. పరలోకానికి సంబంధించి ప్రియప్రవక్త(స) ఏ విషయాలు తెలిపారు?

# 14. ప్రియప్రవక్త (సఅసం)

దైవప్రవక్తగా నియమించబడిన తరువాత ఆయన (సఅసం) పదమూడు సంవత్సరాలు మక్కా పట్టణంలో జీవితం గడిపారు. ఎల్లప్పుడూ ధార్మిక కార్యకలాపాలలో నిమగ్నులయి ఉండేవారు. ఆ మార్గంలో ఎదురైన కష్టాలన్నీ సహనంతో భరించారు. ఆ పదమూడేండ్ల కాలాన్ని "మక్కా కాలం" అంటారు. ఆ తరువాత ప్రియప్రవక్త (సఅసం) మదీనా పట్టణానికి వలస వెళ్ళారు. మదీనాలో పది సంవత్సరాలు ఉన్నారు. ఆ కాలాన్ని "మదీనా కాలం" అంటారు. మక్కా కాలాన్ని ఇంతకు ముందు పుస్తకంలో చదివాం. ఇక్కడ మదీనా కాలం గురించి తెలుసుకుందాం.

### మక్కా నుండి మదీనాకు వలస

మదీనా అరేబియాలోని ఒక సుప్రసిద్ధ పట్టణం. మక్కా నుండి మదీనా చాలా దూరం ఉంది. మదీనావాసులు ప్రతి సంవత్సరం హజ్ కోసం మక్కా వచ్చేవారు. ప్రియప్రవక్త (సఅసం) మదీనా నుండి వచ్చిన హాజీలను కలుసుకొని వారికి ఇస్లాం ధర్మం గురించి బోధించేవారు. మదీనావాసులు మంచి మనస్తత్వం కలవారు. ప్రియప్రవక్త (సఅసం) మాటలను శ్రద్ధాసక్తులతో ఆలకించేవారు. సత్యధర్మం మధువును తనివితీర గ్రోలి విశ్వాసవంతులయ్యేవారు. ఈ విధంగా ఇస్లాం మదీనాలో ప్రవేశించింది.

మక్కాలో ఉన్న సత్యతిరస్కారులు రోజుకురోజు ముస్లిములపై జులుం అధికం చేయసాగారు. ప్రియప్రవక్త (సఅసం)ను కూడా హింసిస్తూ వచ్చారు. ఇక ఆయన (సఅసం) మాటల్ని పట్టించుకొనేవారే కరువైపోయారు. పైగా వారందరూ ఆయన (సఅసం)కు బద్ధ విరోధులయ్యారు. చంపడానికి సిద్ధమయ్యారు. అలాంటప్పుడు మక్కా వదలి మదీనా వలస వెళ్ళాల్సిందిగా అల్లాహ్ ప్రియప్రవక్త(సఅసం)కు ఆజ్ఞ ఇచ్చాడు.

ఒకరోజు రాత్రి అవిశ్వాసులు కుట్ర పన్నారు. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం)ను హత్య చేయాలని నిర్ణయించారు. ప్రళయం వరకు ప్రపంచానికి వెలుగుబాట చూపించిన మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) దీపికనార్పదలిచారు. మూర్ఖులు ఒక పన్నాగం పన్నారు. ఒక్కొక్క తెగ నుండి ఒక మనిషిని సమాయత్త పరచారు. ముహమ్మద్ (సఅసం) ఇంటిని చుట్టుముట్టారు. ఆయన (సఅసం) ఇంటి నుండి బయటికి రాగానే అందరూ ఒక్కమారు ఆయనపై పడి చంపతల పెట్టారు. అల్లాహ్ ఈ కుట్ర సంగతి ప్రియప్రవక్త (సఅసం)కు తెలియపరిచాడు. ముహమ్మద్ (సఅసం) దివ్యఖుర్‌ఆన్ వాక్యాలు పఠిస్తూ ఇంటి నుండి బయటికి వెళ్ళిపోయారు. అవిశ్వాసులు ఆయన ఇంటిని చుట్టుముట్టి ఉన్నారు. కాని అల్లాహ్ వారి కండ్లను కప్పివేశాడు. దాంతో ప్రియప్రవక్త (సఅసం)ను ఎవరూ చూడలేకపోయారు.

ముహమ్మద్ (సఅసం) వెంట ఆయన (సఅసం) ప్రియ స్నేహితుడు హజ్రత్ అబూబకర్ (రజి) ఉన్నారు. ఇద్దరూ మక్కా నగరం నుండి బయటకు వచ్చారు. మక్కా వెలుపల ఒక గుహ ఉంది. దాని పేరు 'సౌర్' గుహ. ఇద్దరూ ఆ గుహలో తలదాచుకొన్నారు. అవిశ్వాసులు వారిరువురి జాడ కోసం

గాలించారు. చాలా దూరం గూఢాచారులను పంపారు. ఒక విద్రోహి గుహ ద్వారం వరకు చేరాడు. హజ్రత్ అబూబకర్ (రజి) భయపడ్డారు. ముహమ్మద్ (సఅసం) ఎంతో ప్రశాంతంగా ఇలా అన్నారు: "భయపడకు. అల్లాహ్ మన వెంట ఉన్నాడు." గుహ దగ్గరగా వచ్చిన అవిశ్వాసి మతిని అల్లాహ్ భ్రమింప జేశాడు. అందుచేత అతడేమీ చూడలేకపోయాడు.

మూడు రోజులు గడిచాక ముహమ్మద్ (సఅసం), ఆయన ప్రాణమిత్రుడు ఇద్దరు 'సౌర్' గుహ వదలి మదీనా వెళ్ళారు. మదీనా ప్రజలు ముహమ్మద్ (సఅసం) రాక కోసం ఎదురు చూస్తున్నారు. మదీనా చేరగానే ప్రజావెల్లువ కదలి వచ్చింది, మహాప్రవక్త (సఅసం)కు ఘనస్వాగతం పలికింది. చిన్నారులు సంతోషంతో పాటలు పాడారు. ప్రతి ఒక్కరి ఆశ ఒక్కటే, ముహమ్మద్ (సఅసం) తమ ఇంట బసచేయాలి. ప్రియప్రవక్త (సఅసం) అన్నారు : "నా ఒంటె ఎక్కడ ఆగుతుందో అక్కడే బసచేస్తాను." హజ్రత్ అయ్యూబ్ అన్సారి (రజి) ఇంటివద్ద నిలిచింది ఒంటె. ప్రియప్రవక్త (సఅసం)ను అతిథిగా స్వీకరించే మహాభాగ్యం హజ్రత్ అయ్యూబ్ అన్సారి (రజి)కే దక్కింది.

ఇక ప్రజావెల్లువ పరవళ్లు త్రొక్కుతూ ముందుకు సాగింది. మక్కా నుండి అత్యధిక సంఖ్యలో ముస్లిములు తమ ఇల్లు వాకిలి వదలి మదీనా వచ్చారు. అబిసీనియా వలస వెళ్ళిన ముస్లిములు కూడా మదీనా వచ్చేశారు. మదీనా వచ్చిన ముస్లిములు 'ముహాజిర్లు' అనబడతారు. మదీనా పుర ప్రజలు ముహాజిర్లకు మద్దతు ఇచ్చారు. ఉండడానికి ఇళ్ళు ఇచ్చారు. జీవితం గడిపేందుకు అన్ని విధాల సౌకర్యాలు కల్పించారు. ఉపాధి కల్పనలలో ఉమ్మడి వ్యాపారస్తులుగా చేర్చుకొన్నారు. ఒకటేమిటి ముహాజిర్ల జీవితం సుఖప్రదం చేశారు. ఈ కారణం గానే మదీనావాసులు అన్సారుల (సహాయపరుల)ని పిలువబడ్డారు.

**శాంతి కోసం సమరాలు**

మన ప్రియప్రవక్త (సఅసం) దయార్ద్రహృదయులు. యావత్తు ప్రపంచానికే కారుణ్య మూర్తిగా వచ్చారు. అందరి ప్రగతి ఆయన (సఅసం) మనోగతి. అందరి పట్ల ప్రేమానురాగాలతో మెలిగేవారు. తుదకు తనను హింసించిన వారి శ్రేయం అభిలషించారు. అటువంటి వారి కోసం కూడా ప్రార్థనలు చేశారు. దైవధర్మ సంస్థాపన కోసం స్వస్థలాన్ని వదిలారు. మక్కా నుండి మదీనా వలస వచ్చారు. మదీనాలో ప్రశాంత జీవితం గడపవచ్చని భావించారు. అందరికి అల్లాహ్ పంపిన ధర్మం బోధించవచ్చని, ముస్లిములను దైవాభీష్టం ప్రకారం జీవితం గడిపేటట్లు చేయవచ్చని అనుకొన్నారు. కాని వైరుల విద్రోహం ప్రశాంతంగా జీవితం గడుపనిస్తుందా! మదీనాలో కూడా కాఫిర్లు తమ పన్నాగాలు పన్నుతూ ముస్లిములను వేధించసాగారు. వారిపై బురదజల్లేవారు. మదీనా సమీపంలో యూదులు నివసించేవారు. హజ్రత్ మూసా (అలైహి) గారి అనుచరులు వీరు. కాని వారి తీరుతెన్నులు, వ్యవహారాలన్నీ అవిశ్వాసులను పోలి ఉండేవి. వీరు మన ప్రియప్రవక్త (సఅసం)కు శత్రువులయ్యారు. సత్యతిరస్కారులతో కలిసి పోయారు. ముహమ్మద్ (సఅసం)ను మోసగించసాగారు. ముస్లింల రహస్యాలన్నీ అవిశ్వాసులకు అందజేసేవారు. పచ్చి అబద్ధాలు పలికేవారు. చాడీలు చెప్పి తంటాలు తెచ్చేవారు. మదీనాలో కొందరు కపటవిశ్వాసులు

కూడా ఉండేవారు. వారు పైకి ముస్లిముల శ్రేయోభిలాషులుగా మెలిగేవారు. కాని వారి హృదయాలలో ముస్లింల పట్ల శత్రుత్వం ఉండేది. ఇలాంటి కాపట్యం కలవారు కూడా కాఫిర్లతో కలసి ముస్లిములను తమ విష వలయంలో చిక్కుకొనేట్లు చేసేవారు.

## బదర్ యుద్ధం

ఇస్లాం వ్యతిరేక శక్తులు ముస్లింలపై సర్వ సన్నద్ధులై విరుచుకుపడ్డాయి. అప్పటివరకు రణరంగానికి దూరంగా ఉంటూ వచ్చిన ముస్లింలకు ఆత్మరక్షణ కోసం యుద్ధం చేయడానికి అల్లాహ్ అనుమతి ఇచ్చాడు. అవిశ్వాసుల సైన్యం అత్యధికంగా ఉంది. ముస్లింల సైన్యం చాలా తక్కువగా ఉంది. అవిశ్వాసుల సైనిక బలం వెయ్యి మంది ఉంటే ముస్లిం సైనిక సంఖ్య మూడు వందల పదమూడు మాత్రమే. అవిశ్వాసుల వద్ద అన్ని విధాల యుద్ధసామగ్రి, కత్తులు, కటార్లు, బల్లెములు, ధనుర్బాణాలు, కవచాలు ఉన్నాయి. సకల సన్నాహాలతో వచ్చింది శత్రుసైన్యం. ముస్లింల వద్ద ఉన్న సామగ్రి బహు తక్కువ. 'బదర్' మైదానంలో రెండు సైన్యాలు ఢీకొన్నాయి. ఒకరిపై మరొకరు విరుచుకుపడ్డారు. యుద్ధం భయంకరంగా జరిగింది. ముస్లిములు సత్యధర్మం కోసం తీవ్రంగా పోరాడారు. ప్రియప్రవక్త (సఅసం) ముస్లింల విజయం కోసం, ఇస్లాం వ్యాప్తి కోసం దైవాన్ని ప్రార్థించారు. అల్లాహ్ సహాయం లభించింది. ముస్లిములు విజయం సాధించారు. అవిశ్వాసులు చిత్తుగా ఓడిపోయారు. వారి అగ్రనాయకులు అనేకమంది హత మార్చబడ్డారు. సర్వసేనాని అబూజహల్ కూడా నేలకొరిగి ఊపిరి విడిచాడు. ఉత్బా, షైబా కూడా హత మయ్యారు. ఇలా డెబ్బయిమంది అవిశ్వాసులు చనిపోయారు. మరో డెబ్బయి మంది యుద్ధ ఖైదీలుగా పట్టుబడ్డారు. మిగిలిన వారు కాళ్ళకు బుద్ధిచెప్పి పారిపోయారు.

## బదర్ తరువాత...

బదర్ యుద్ధంలో ఖురైష్ అగ్ర నాయకులు అనేకమంది హతమయి పోవడంతో మక్కా బహుదైవారాధకులు తీవ్రమైన ప్రతీకారేచ్ఛతో మరింత పెట్రేగిపోయారు. వారి ద్వేషం లావాలా ఉప్పొంగి ప్రవహించింది. బదర్ యుద్ధం తరువాత సంవత్సరం తిరగక ముందే మక్కా అవిశ్వాసులు ముస్లిములపై దాడికి సమాయత్తమయ్యారు. ఈసారి కూడా శత్రు సైనికులు అసంఖ్యాకంగా ఉన్నారు. అందువల్ల ముస్లిములు కూడా సర్వసన్నద్ధులయి బయలుదేరారు. ముస్లిం సేనలో ఏడు వందల సైనికులు మాత్రమే ఉన్నారు. కాని ప్రాణాలు తెగించి పోరాడటానికి ప్రతి ముస్లిం యోధుడు తహతహలాడసాగాడు.

## ఉహుద్ సంగ్రామం

మదీనాకు నాలుగు మైళ్ళ దూరంలో 'ఉహుద్' అనే ఒక కొండ ఉంది. అక్కడే ఈ యుద్ధం జరిగింది. శత్రుసైనికులు మూడు వేల మంది ఉన్నారు. మారణాయుధాలతో వచ్చారు. ముస్లిం సేన స్వల్పం. వారివద్ద యుద్ధ సామగ్రి కూడా తక్కువగా ఉంది. దైవసహాయం వల్ల మళ్ళీ ముస్లిములే విజయం సాధించారు. కాని ముస్లింలు భద్రత విషయంలో కాస్త అజాగ్రత్త వహించారు. యుద్ధరంగంలో ప్రియప్రవక్త

(సఅసం) కొంతమంది విలుకాండ్రను ఒక కనుమ దగ్గర నియమించారు. కాని శత్రువులు ఓడి పారిపోవడం చూడగానే వారు ఆ స్థానం వదలిపెట్టారు. అవిశ్వాసులు ఈ అవకాశం వాడుకుంటూ కొండ వెనుకవైపు నుండి వచ్చి అకస్మాత్తుగా ముస్లింలపై మెరుపుదాడి చేశారు. ముస్లింలకు చాలా నష్టం కలిగింది కంగారు పడ్డారు కూడా. అనేకమంది ముస్లిం సిపాయిలు అమరగతులయ్యారు. ప్రియప్రవక్త (సఅసం) పినతండ్రి హజ్రత్ హమ్జా (రజి) ఈ యుద్ధంలోనే వీరమరణం పొందారు. అదీగాక ఈ యుద్ధంలో ప్రియప్రవక్త (సఅసం) అమరగతులయ్యారని ఒక వదంతి కూడా వ్యాపించింది. దాంతో ముస్లిం యోధులు ఢీలాపడిపోయారు.

కాని ఆ తరువాత దైవప్రవక్త (సఅసం) సజీవంగానే ఉన్నారని తెలియగానే వారికి మళ్ళీ ఆత్మస్థయిర్యం కలిగింది. వారు ఈసారి తీవ్రంగా విజృంభించి ప్రియప్రవక్త (సఅసం)ను ప్రాణాలొడ్డి రక్షించారు. శత్రువుల దుష్టపన్నాగం వల్ల ప్రియప్రవక్త (సఅసం) ఒక అగడ్తలో పడిపోయారు. దానివల్ల ఆయన పళ్లు రెండు ఊడిపోయాయి. ఏమైనప్పటికీ అల్లాహ్ కృప వల్ల ఉహద్ యుద్ధంలో అంతిమ విజయం ముస్లింలకే లభించింది. ఈ యుద్ధంలో డెబ్బయి మంది ముస్లింలు అమరగతినొందారు.

ఉహద్ యుద్ధం తరువాత కూడా ముస్లింలు అనేకసార్లు అవిశ్వాసులతో యుద్ధం చేయవలసి వచ్చింది. ముస్లింలు సత్యం కోసం, ధర్మం కోసం పోరాడారు. ప్రతిసారీ వారికి అల్లాహ్ సహాయం చేశాడు. దాంతో ముస్లింలు విజయపరంపరతో ముందుకు సాగుతున్నారు.

### యూద తెగలు

మక్కా నుండి ముస్లింలు మదీనా వచ్చిన ప్రారంభంలో యూదులు సంతోషంగానే ఉన్నారు. ముస్లింల వల్ల తమ అధికార ప్రభావం పెరుగుతుందను కొన్నారు యూదులు. అందువల్లనే ముస్లింలపై ఎవరైనా విరుచుకొనిపడ్డారంటే వారిని ఎదుర్కొంటామని దైవప్రవక్త (సఅసం)తో ఒప్పందం కూడా చేసుకున్నారు. కాని కొంత కాలానికే యూదులు ముస్లింలకు బద్ధశత్రువులయ్యారు. ముస్లింల రహస్యాలను అవిశ్వాసులకు చేరవేస్తూ ముస్లింలపై వారిని ఉసిగొల్పారు, కుట్రలు పన్నారు. ఎటు వీలైతే అటు నిలిచి ముస్లింలను అంతమొందించడానికి తీవ్రంగా ప్రయత్నించారు.

మదీనా చుట్టూ యూదులకు చెందిన మూడు ముఖ్యమైన తెగలుండేవి. అందులో "బనీ ఖైనుఖా" బలమైన వర్గం. రెండవది "బనీ నజీర్" వర్గం. మూడవది "బనీ ఖురైజా" వర్గం. యూదుల ఆగడాలు మితిమీరిపోయాయి. అందుచేత ప్రియప్రవక్త (సఅసం) బనీ ఖైనుఖా తెగను మదీనా నుండి బహిష్క రించారు. వారు తమ ఆస్తిపాస్తులు వదలి "సిరియా" దేశానికి వెళ్ళిపోయారు.

బనీ నజీర్ యూద తెగ దైవప్రవక్త (సఅసం)ను హతమార్చడానికి ఎన్నో సార్లు కుట్రలు పన్నారు. ఒక రోజు ఆయన ఆ తెగ వాడలోని ఒక గోడకానుకొని నిలుచున్నారు. అప్పుడు యూదులు గోడపై నుండి ఒక బండరాతిని త్రోసి ప్రియప్రవక్త (సఅసం)ను చంపడానికి ప్రయత్నించారు. అయితే ప్రియప్రవక్త (సఅసం)కు వారి కుట్ర సంగతి దైవికంగా తెలిసిపోయింది. వెంటనే ఆయన అక్కడ నుండి వెళ్ళిపోయారు. ఒకసారి యూదులు తమ పండితులతో చర్చలు జరపడానికి ముప్ఫయి మంది మనుషుల్ని తీసుకొని

తమ దగ్గ రకు రావలసిందిగా దైవప్రవక్త (సఅసం)కు కబురుచేశారు. ప్రియప్రవక్త (సఅసం) బనీ నజీర్, బనీ ఖురైజా యూదులకు సమాధానమిస్తూ "మాకు మీ మాటల మీద నమ్మకం లేదు. మీరు ఆ విషయం గురించి ప్రమాణం చేస్తూ ఒక పత్రం రాసి ఇవ్వండి" అని చెప్పారు. కాని ఆ తరువాత వారంతా కర వాలాలు చేతబూని యుద్ధానికి సిద్ధంగా ఉన్నారని తెలిసింది. అందుచేత ప్రియప్రవక్త (సఅసం) యూదుల వాడకు చేరుకోకుండానే మదీనా తిరిగొచ్చారు. చివరకు వారిని కూడా ప్రియప్రవక్త (సఅసం) మదీనా నుండి బహిష్కరించారు. అప్పుడు వారు ఒంటెల మీద తీసుకొని పోగలంత సామగ్రి తీసుకొని ఖైబర్ ప్రాంతానికి వెళ్ళిపోయారు.

## అహ్జాబ్ యుద్ధం

బనీ నజీర్ తెగ యూదులు ఖైబరు వెళ్ళిన తరువాత యావత్తు అరబ్బు తెగలను ముస్లింలకు వ్యతిరేకంగా ప్రేరేపించారు. ఖురైషులను యుద్ధం చెయ్యమని పురిగొల్పారు. గత్ఫాన్ తెగను కూడా ప్రలోభపెట్టి తమ వైపునకు తిప్పుకున్నారు. బనూ అసద్ తెగ కూడా యూదుల పక్షం చేరిపోయింది. పదివేల మంది సైనికులతో మదీనాపై దండెత్తడానికి వెళ్ళారు. అరబీ భాషలో "హిజ్బ్" అంటే సమూహం. "అహ్జాబ్" అంటే సమూహాలు. ఈ యుద్ధాన్ని అహ్జాబ్ అనడంలో అర్థం, ముస్లింలపై దాడిచేయడానికి సత్యతిరస్కార తెగలన్నీ ఏకమయ్యాయి. ఈ యుద్ధం హిజ్రీ 5వ సంవత్సరంలో జరిగింది.

ప్రియప్రవక్త (సఅసం)కు ఈ విషయం తెలియగానే అనుచరులతో సమాలోచన చేశారు. హజ్రత్ సల్మాన్ ఫార్సీ ఈరాన్ దేశస్థుడు. ఆయన ఈరాన్ యుద్ధతంత్రాలను గురించి బాగా ఎరిగినవారు. ఆయన తన అభిప్రాయం వెలిబుచ్చుతూ, "మదీనా నగరానికి మూడు వైపుల ఇండ్లు, దట్టమైన ఖర్జూరపు తోటలున్నాయి. ఒకవైపు ఏమీలేదు. అక్కడ కందకం త్రవ్వి శత్రువును ఎదుర్కోవాలని" అన్నారు. ప్రియప్రవక్త (సఅసం) ఈ అభిప్రాయాన్ని మెచ్చుకుంటూ కందకాలు త్రవ్వించారు. అందుకే ఈ యుద్ధాన్ని "కందక యుద్ధం" అని కూడా అంటారు.

మూడు వేల మంది ముస్లింలు ఈ కందకం త్రవ్వకంలో ఇరవై రోజుల పాటు కష్టపడి పనిచేశారు. ప్రియప్రవక్త (సఅసం) కూడా త్రవ్వకంలో పాల్గొన్నారు. ఒకచోట పెద్ద బండరాయి అడ్డం వచ్చింది. దాన్ని పగలగొట్టడానికి ఎంత ప్రయత్నించినా సాధ్యం కాలేదు. చివరికి ప్రియప్రవక్త (సఅసం) వచ్చి గునపంతో ఒక్క వేటువేశారు. రాయి తుత్తునియలైపోయింది.

అవిశ్వాసులు మదీనాను మూడు వైపుల నుండి చుట్టుముట్టి ఇరవై రోజులు పొంచి కూర్చున్నారు. పట్టణంలో ప్రవేశించడానికి మార్గంలేకపోయింది. ఒకచోట కందకం వెడల్పుగా లేదు. అటువైపు నుండి ఒక అవిశ్వాసి గుర్రం మీద ఎక్కి కందకం దాటి వచ్చాడు. హజ్రత్ అలీ (రజి) కరవాలంతో ఒక్క దెబ్బ వేశారు. దాంతో శత్రువు కుప్పకూలిపోయాడు. ముస్లింలు తమ మహిళలను ఒక కోటలో చేర్చి భద్రత కల్పించారు. బనూ ఖురైజా యూదులు ఈ సంగతి తెలుసుకొని ముస్లింలు కందకం దగ్గర యుద్ధంలో నిమగ్నులయి ఉన్నారు గనక, కోటను సులువుగా కైవసం చేసుకోవచ్చని భావించారు. ఒక యూదుడు కోట దగ్గరకు చేరాడు. హజ్రత్ జుబైర్ బిన్ అవామ్ (రజి) తల్లి హజ్రత్ సఫియా (రజి) ఆ యూదుడ్ని

చూశారు. ఆమె వెంటనే ఒకే ఒక దెబ్బతో అతడ్ని కడతేర్చారు. తల ఖండించి కోట వెలుపల మైదానంలో విసిరి పడవేశారు. బనూ ఖురైజ యూదులు అది చూసి కోటలో కూడా ముస్లిం సైనికులున్నారని భావించారు. అందుచేత వారు ఆ కోట దగ్గరకు మళ్ళీ వెళ్ళడానికి సాహసించ లేకపోయారు. ఆ తరువాత విధివశాత్తు శత్రుసేనలలో చీలిక వచ్చింది. పైగా ఒక పెనుతుఫాన్ కూడా వచ్చిపడింది. దాంతో శత్రువుల ఆశలు అడియాశలయ్యాయి. వారి గుడారాలు తుఫానుకు ఎగిరిపోయాయి. దానికి తోడు ఎముకలు కొరికే చలి కూడా తోడయి వారిని భయంతో మరింత వణికింప జేసింది. బనూ ఖురైజ యూదులు ఖురైషులను వదలి తమ కోటలకు వెళ్ళి పోయారు. ఖురైషులు ఇటు ఒంటరివాళ్ళయి, అటు ప్రకృతి విపత్తుతో భయపడి పూర్తిగా నిరాశచెందారు. అప్పుడు వారు యుద్ధరంగం వదలి పలాయనం చిత్తగించారు.

**ఖైబరు విజయం**

యూదులు అన్ని వైపుల నుండి ఖైబరు చేరుకొన్నారు. అక్కడ వారికి ఆరు కోటలున్నాయి. ఇరవై వేల మంది యుద్ధ వీరులు ఉన్నారు. అయితే వారు మదీనా నుండి బహిష్కరించబడినప్పటికీ ముస్లిం వ్యతిరేక కార్యకలాపాలు మానుకోలేకపోయారు.

చివరకు ప్రియప్రవక్త (సఅసం) హిజ్రీ శకం ఏడవ ఏట అనుచరులను తీసుకొని ఖైబరు చేరారు. ఆయన దైవమార్గంలో చేసే పోరాటం ఎంత గొప్ప పుణ్యకార్యమో వివరిస్తూ అనుచరుల్లో సమరోత్సాహాన్ని జనింపజేశారు. యుద్ధం మొదలయింది. ముస్లిం యోధులు యూదుల కోటలను ముట్టడించి యుద్ధం చేయసాగారు. ఆ కోటలలో ఒకటి ఎంతో పటిష్టమయినది. ఇరవై రోజులు పోరాడినా దాన్ని ముస్లింలు స్వాధీనం చేసుకోలేకపోయారు. అప్పుడు మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు: "రేపు నేను యుద్ధపతాకాన్ని ఒకతని చేతికిస్తాను. అతని ద్వారా అల్లాహ్ మనకు విజయం ప్రసాదిస్తాడు. ఆ యోధుడు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను ప్రేమిస్తాడు. అల్లాహ్, ఆయన ప్రవక్త కూడా అతడ్ని ప్రేమిస్తారు." మరుసటి రోజు ప్రియప్రవక్త (సఅసం) హజ్రత్ అలీ (రజి) చేతికి సమర పతాకాన్నిచ్చారు. హజ్రత్ అలీ (రజి) ఆ పతాకం తీసుకొని రణరంగంలోకి దూకారు. యూదుల నాయకుడు మర్‌హబ్ పెద్ద పెద్ద అంగలు వేసు కుంటూ ముందుకొచ్చి కత్తి ఝుళిపించాడు. హజ్రత్ అలీ(రజి) చాకచక్యంగా తప్పించు కుంటూనే శత్రువు తలపై బలంగా ఒకే ఒక వ్రేటు వేశారు. దాంతో మర్హబ్ వేర్లు తెగిన చెట్టులా కుప్పకూలిపోయాడు. శత్రుసైన్యాధిపతి మరణంతో దుర్గం ముస్లింల కైవశమయింది. ఈ యుద్ధంలో 15 మంది ముస్లిములు వీరమరణం పొందారు. అటు శత్రుపక్షంలో 93 మంది యూదులు హతమయ్యారు.

**మక్కా విజయం**

ముస్లింలు, మక్కా అవిశ్వాసుల మధ్య కుదిరిన శాంతి ఒప్పందం కొన్ని రోజుల వరకే చెల్లుబాటులో ఉంది. ఆ తరువాత అవిశ్వాసులు ఒప్పందం ఉల్లంఘించి ముస్లిముల మిత్రపక్షంవారిపై దాడిచేసి అనేకమందిని ఊచకోత కోశారు. చివరికి 'కాబా'లో కూడా రక్తపాతం జరపడానికి వెనుకాడలేదు. ఈ సంగతి తెలిసి ప్రియప్రవక్త (సఅసం) పదివేల అనుచరులను తీసుకొని మక్కా బయలుదేరారు. అవిశ్వాసులు ముస్లిం సైన్యాన్ని చూసి కంగారుపడి పోయారు. కొందరు భయంతో వణికిపోతూ మక్కా వదలి పారి

పోయారు. మరికొందరు క్షమాపణ చెప్పుకొని ముస్లింలయిపోయారు. కారుణ్యమూర్తి అయిన మహాప్రవక్త (సఅసం) వారందరికి క్షమాభిక్ష పెట్టారు. కొన్నేళ్ళ క్రితం తనకు బద్ధవిరోధులయి రకరకాలుగా వేధించి, చివరకు స్వస్థలం వదలిపోయేలా చేసిన శత్రువులందరినీ ఆయన విశాలహృదయంతో క్షమించివేశారు. మక్కా నగరం ముస్లింల అధీనమయిపోయింది. ప్రియప్రవక్త (సఅసం) 'కాబా'లో ప్రవేశించి అక్కడి విగ్రహాలను తొలగించారు. అల్లాహ్ ఆరాధన అన్ని చోట్ల జరగనారంభమయింది. ఆయన స్తుతి స్తోత్రాలు అన్ని దిశల వ్యాపించాయి. క్రమక్రమంగా ఇస్లాం అరేబియాలో విజయఢంకా మ్రోగిస్తూపోయింది.

**దైవ ప్రవక్త (సఅసం) మిషను**

మన ప్రియప్రవక్త(సఅసం) ఏ లక్ష్యం కోసం ప్రభవించారో ఆ లక్ష్యం నెరవేరింది. ఆయన అల్లాహ్ పంపిన సందేశాన్ని ప్రజలకు అందజేశారు. స్వయంగా ఆయన దైవసందేశానుసారం జీవితం గడిపి అందరికీ ఆదర్శప్రాయులయ్యారు. దైవసందేశాన్ని ఆచరణాత్మకంగా ప్రచారం చేయడానికి ఒక ఆదర్శ సమాజాన్ని స్థాపించారు. ఈ విధంగా ఆయన తన కర్తవ్యం నెరవేర్చి ఇహలోకం వీడిపోయారు.

అల్లాహుమ్మ సల్లి అలాముహమ్మదిన్ వ అలా ఆలిముహమ్మదిన్ వబారిక్ వ సల్లమ్.

దైవధర్మం సంపూర్ణంగా స్థాపించబడింది. మహనీయ ముహమ్మద్ (సఅసం) అంతిమ దైవప్రవక్త. ఆయన తరువాత మరో ప్రవక్త లేడు. ప్రవక్తల పరంపర అంతమయిపోయింది. కనుక ఇప్పుడు ధర్మప్రచార బాధ్యత ముస్లిముల భుజస్కంధాలపై ఉంది. ప్రతి యుగంలో దైవధర్మాన్ని తు.చ. తప్పకుండా ప్రజలకు అందజేసే బాధ్యత ఆయా సమాజాలపై ఉంది. దైవానుగ్రహం వల్ల ఈ యుగంలో మనము ముస్లిములుగా ఉన్నాం. ఇస్లాంను స్థాపించే బాధ్యతాభారం మన భుజాలపై ఉంది. మన ప్రియప్రవక్త (సఅసం) దైవధర్మ ప్రచారం చేస్తూ ఎన్నో బాధలననుభవించారు. మనకు ఈ బాధ్యత నిర్వహణలో కష్టనష్టాలు కలిగితే సహనం వహిస్తూ ముందుకు పురోగమించాలి. అప్పుడే యావత్తు ప్రపంచంలో ఇస్లాం స్థాపితమై మానవాళికి మోక్షదాయకమవుతుంది.

ఓ అల్లాహ్! మాకు నీ ధర్మాన్ని స్థాపించే మహాభాగ్యం, శక్తిసామర్థ్యాలు ప్రసాదించు. (ఆమీన్)

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. మక్కా, మదీనా కాలాలని వేటినంటారు?
2. అల్లాహ్ ధర్మం మదీనా ఎలా చేరింది?
3. ప్రియప్రవక్త(స) మక్కా నుండి మదీనాకు ఎందుకని వలస వెళ్ళారు?
4. ముస్లింలకు అవిశ్వాసులతో జరిగిన ప్రథమ యుద్ధం ఏది? ఇంకా ఈ యుద్ధం ఎందుకు జరిగింది?

5. ఉహుద్ యుద్ధంలో ఎంతమంది ప్రవక్త సహచరులు షహీద్ అయ్యారు (అమరగతి పొందారు). ఇంకా ఈ షహాదత్ ఏ కారణంగా జరిగింది?
6. మదీనాలో యూదుల ఎన్ని తెగలు నివసిస్తుండేవి? ఇంకా వారు ప్రియప్రవక్త(స) పట్ల ఏ కుట్రలు చేశారు?
7. 'అహ్‌జాబ్' యుద్ధానికి ఇంకొక పేరేమిటి? ఇంకా ఈ యుద్ధానికి కారణాలేమిటి?
8. మక్కా జయించబడిన తరువాత ప్రియప్రవక్త(స) శత్రువుల పట్ల ఎలా వ్యవహరించారు?

**ఆ) క్రింది ఖాళీలను పూరించండి**

1. మదీనా చేరుకున్న తరువాత ప్రియప్రవక్త(స) ........................ ఇంట్లో విడిది చేశారు.
2. ప్రియప్రవక్త(స), హజ్రత్ అబూబకర్ ఇద్దరూ ................................లో దాక్కున్నారు.
3. బదర్, మదీనా నుండి ................................... కిలోమీటర్ల దూరంలో ఉంటుంది.
4. ........................... 2వ హిజ్రీ సంవత్సరం రమజాన్ నెల 17న సంభవించింది.
5. ఉహద్ యుద్ధం ......................................లో జరిగింది.
6. అహ్‌జాబ్ యుద్ధం ..................................లో జరిగింది.
7. ఖైబర్ యుద్ధంలో ........... మంది ముస్లింలు షహాదత్ (అమరగతి) పొందారు. ఇంకా తొంబై మూడు మంది యూదులు హతమయ్యారు.
8. హజ్రత్ జుబేర్ బిన్ అవామ్(రజి) తల్లి గారి పేరు .....................................
9. అహ్‌జాబ్ సంగ్రామంలో హజ్రత్ ............... (రజి) కందకం తవ్వి పోరాడాలని సలహా ఇచ్చారు.

**ఇ) ఈ క్రింది వాటిని జతపరచండి?**

| | అ | ఇ |
|---|---|---|
| 1. | హజ్రత్ అబూబక్ర్(రజి) | మదీనా ముస్లింలు |
| 2. | హజ్రత్ హమ్జా (రజి) | యూదుల తెగ |
| 3. | అన్‌సార్ | ప్రియప్రవక్త(స) బాబాయి |
| 4. | మర్‌హబ్ | సూర్ గుహ సహచరుడు |
| 5. | బనూ ఖైనుఖా | హజ్రత్ అలీ(రజి) |
| 6. | ఖైబర్ విజేత | యూదుల నాయకుడు |



# 15. ముస్లిం సముదాయం

ముహమ్మద్ (సఅసం) అల్లాహ్ పంపిన చివరి ప్రవక్త. ఆయన (సఅసం) తరువాత మరో ప్రవక్త రాబోడు. ప్రళయం వరకు ఆయనే చివరి దైవప్రవక్త. ప్రవక్తల పరంపర అంతమయిపోయింది. అల్లాహ్, ఆయన (సఅసం) ద్వారా ధర్మాన్ని పరిపూర్ణంగావించాడు. ఇక అందులో ఏ మాత్రం హెచ్చుతగ్గులు చేయడానికి ఎవరికీ అధికారం లేదు. అల్లాహ్ తన గ్రంథం దివ్యఖుర్ఆన్‌లో ధర్మాన్ని పరిపూర్ణం చేసి నట్లు మనకు తెలియజేశాడు. అందుచేత ప్రళయం వరకు మానవులు పాటించాల్సిన ధర్మం ఇప్పుడు ఇస్లాం మాత్రమే. ఇస్లాం ధర్మాన్ని పాటించడంలోనే మన ఇహపరాల విజయం ఉంది. మన ప్రియప్రవక్త (సఅసం) దైవధర్మాన్ని సంపూర్ణంగా ముస్లిం సమాజానికి అందజేశారు. తన జీవితమంతా దైవధర్మానుసారం గడిపారు. ప్రజలను కూడా దైవం చూపిన ఈ మార్గంపైనే నడిపించారు. ధర్మస్థాపనంలో ఆయన(సఅసం) బాధ్యత తీరిపోయింది. అల్లాహ్ ఆయన్ని (సఅసం) తన దగ్గరికి పిలుచుకున్నాడు. అల్లాహ్ ఆయన (సఅసం)కు శాంతిశ్రేయాలు కలిగించుగాక. ప్రపంచంలో అల్లాహ్ మంచి, చెడులు రెండింటిని సృష్టించాడు. వెలుగుతోబాటు చీకటి కూడా ఉంది. ప్రతి యుగంలో మంచివారున్నారు, చెడ్డవారున్నారు. సజ్జనులవల్ల లోకంలో శాంతిభద్రతలు ఉంటాయి. ప్రతిచోటా మంచి పనులు జరుగుతుంటాయి. దుర్జనుల మనస్తత్వం వేరు. వారు చెడులను వ్యాపింపజేస్తారు. దేవుని పుడమిపై వారు అరాచకం, అలజడులు సృష్టిస్తారు.

ఇప్పుడు దైప్రవక్తలు వచ్చే ప్రసక్తి లేదు. మరి చెడులు ఎలా దూరమై పోతాయి? చెడ్డవాళ్ళు చెడ్డ పనులు ఎలా మానుకుంటారు? దేవుని ధరణిపై నుండి కలహాలు, కల్లోలాలు ఎలా సమసిపోతాయి? నీతి, న్యాయం, శాంతి, సుస్థిరతలు ఎలా నెలకొంటాయి? ఈ పని కోసమే అంతిమ దైవప్రవక్త (సఅసం) దేవుని ఆదేశం ప్రకారం చెడులను అరికట్టే, మంచిని వ్యాపింపజేసే వ్యక్తుల సముదాయం ఒకదాన్ని ఏర్పరిచారు. ఆ సముదాయం పేరే "ముస్లిం సముదాయం." ప్రపంచంలోని ముస్లింలంతా ఈ సముదాయంలో చేరివున్నారు. అంతిమ దైవప్రవక్త (సఅసం) పట్ల విశ్వాసం కలవారందరు ఈ సముదాయానికి చెందినవారే. మన ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం) తరువాత ధార్మిక విషయాలను ఇతరులకు అందజేయవలసిన బాధ్యత మనందరిపై మోపబడింది. దేవుని ఏకత్వం గురించి ప్రజలకు బోధించాలి. ప్రవక్తల పట్ల విశ్వాసమంటే ఏమిటో తెలియజేయాలి. మరణానంతరం మరో జీవితం ఉందని, అక్కడ దేవుని ముందు మానవులు తమ ఆచరణలకు సమాధానం చెప్పుకోవలసి ఉందని వారికి నచ్చజెప్పాలి. అంతేకాదు, చెడులను అరికట్టడానికి కృషి చేయాలి, మంచిని పెంచాలి. సత్కార్యాల వైపు ప్రేరేపించాలి. ఖుర్ఆన్‌లో అల్లాహ్ ముస్లిములను ఉద్దేశించి, "విశ్వాసులారా! ఇక నుండి ప్రపంచ మానవులకు మార్గదర్శనం చేస్తూ వారిని సంస్కరించడానికి రంగంలోకి తీసుకురాబడిన శ్రేష్ఠసమాజం మీరే. మీరు మంచి పనులు చేయమని ప్రజలను ఆదేశిస్తారు. చెడుల నుండి వారిస్తారు. అల్లాహ్‌ను ప్రగాఢంగా విశ్వసిస్తారు" అన్నాడు. (3:110)

అల్లాహ్‌ను ప్రగాఢంగా విశ్వసించడం అంటే మనం ప్రియప్రవక్త (సఅసం) ధర్మసంస్థాపన కోసం ఏ ఏ పనులు చేశారో ఆయా పనులన్నీ మనం కూడా చేయాలన్న మాట.

మన ప్రియప్రవక్త (సఅసం) అనేక కష్టాలను భరించారు, ఎన్నో బాధలు అనుభవించారు. ధర్మ సంస్థాపన బాధ్యతలను నిర్వహించారు. అనేక ఒడిదుడుకుల్ని ఎదుర్కొని దైవధర్మాన్ని ప్రజలకు చేరవేశారు. ఆయన స్వయంగా దైవధర్మాన్ని తు.చ. తప్పకుండా పాటించి ప్రజలకు ఆదర్శప్రాయులయ్యారు. ఈ విధంగా మన ప్రియప్రవక్త (సఅసం) తన కర్తవ్యాన్ని నిర్వహించి ఇహలోకం నుంచి నిష్క్రమించారు. ఆయన(సఅసం)కు శాంతీ సౌభాగ్యాలు కలుగుగాక.

ప్రియప్రవక్త (సఅసం) తరువాత ఆయన (సఅసం) సహచరులు దైవధర్మాన్ని వ్యాపింపజేశారు. అన్నివిధాలా ధార్మిక సేవ చేశారు. రాత్రింబవళ్ళు కృషి చేసి దైవధర్మాన్ని ప్రజలకు అందజేశారు. పుణ్య కార్యాలు విస్తరింపజేశారు. చెడులను నివారించారు. ఈ విధంగా వారు కూడా తమ బాధ్యతను నిర్వహించి వెళ్ళిపోయారు. అల్లాహ్ వారి పట్ల ప్రసన్నుడవుగాక. ప్రవక్త సహచరుల తరువాత ఇతర మహాపురుషులు, ధార్మిక పండితులు వారి వారి కాలాల్లో ధర్మస్థాపన కోసం కృషి చేశారు. దైవదాసులకు దైవధర్మాన్ని అందజేశారు వారికి దేవుని ఏకత్వాన్ని గురించి బోధించారు. ఇస్లాంను నలుదిశలా వ్యాపింపజేశారు. ఇలా వారు కూడా తమ విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చి ఇహలోకం వీడిపోయారు. వీరందరిపై అల్లాహ్ కారుణ్యకటాక్షాలు వర్షించుగాక!

ఇప్పుడీ బాధ్యత తమ ధర్మం ఇస్లాం అని చెప్పుకునే వారిపై వచ్చి పడుతుంది. కనుక ఈ బాధ్యతను మనం ఎంత వరకు నెరవేర్చామో ఆత్మ పరిశీలన చేసుకోవాలి. ముందుగా మనం ఇస్లాంను సరిగా, సంపూర్ణంగా అర్థం చేసుకోవాలి. తరువాత మనం స్వయంగా దాని ప్రకారం ఆచరించి, ఇతరులకు దాని బోధనలు తెలియజేయాలి. సమాజంలో పేరుకుపోయిన చెడులను నిర్మూలించడానికి కృషిచేయాలి. మంచి పనులను వ్యాపింపజేయాలి. ఈ విధంగా మనమంతా కలసి దైవప్రవక్త (సఅసం), ఆయన అను చరులు ధర్మాన్ని స్థాపించినట్లు ధర్మస్థాపన కోసం శాయశక్తులా కృషిచేయాలి.

మనం గనక ధర్మసంస్థాపనా బాధ్యతను నిర్వహించనట్లయితే భావితరాలు మనల్ని పనిదొంగలుగా భావిస్తాయి. అల్లాహ్ కూడా మనల్ని క్షమించడు. ఇలా మనం రెంటికి చెడ్డ రేవళ్ళయి ఇటు ఇహలోకం లోనూ, అటు పరలోకంలోనూ అవమానం పాలవుతాము. ఓ అల్లాహ్! మమ్మల్ని సత్యధర్మంపై నడచు కొనేవారిగా చెయ్యి. ఇస్లాం సేవ చేసే యోగ్యత ప్రసాదించు. పుణ్యాత్ములతో కలసిమెలసి ఉండే భాగ్యం కలుగజెయ్యి. ఇతరులను కూడా మంచివారుగా చెయ్యి. ఇహపరాలలో సాఫల్య భాగ్యం ప్రసాదించు. ప్రభూ! మా ప్రార్థన ఆలకించు.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి ?**

1. ఎవరి దైవదౌత్యం ప్రపంచం ఉన్నంత వరకు ఉంటుంది?
2. ఏ ధర్మంలో హెచ్చుతగ్గులకు అవకాశం లేదు?
3. దేన్ని అవలంబించటం వల్ల ఇహపరాల సాఫల్యం ఉంది?
5. ఉమ్మతె ముస్లిమ బాధ్యత ఏమిటి?
6. ప్రవక్త సహచరులు ధర్మాన్ని వ్యాపింపజేయటానికి ఏమేం చేశారు?



# 16 హదీసె-షరీఫ్

దైవప్రవక్త (సఅసం) ప్రతి విషయంలోనూ మనకు ఆదర్శప్రాయులని దేవుడు తెలియపరిచాడు. అంటే ముస్లింలు ప్రతి విషయంలోనూ ప్రియప్రవక్త (సఅసం)ను ఆదర్శంగా తీసుకోవాలన్నమాట.

మహనీయ ముహమ్మద్ (సఅసం) ప్రవక్త బాధ్యతలు స్వీకరించాక 23 సంవత్సరాలు ప్రపంచంలో ఉన్నారు. ఆయన జీవించి ఉన్నంతవరకు ప్రజలకు ధార్మిక విషయాలు తెలియజేసేవారు. వారికి సత్కార్యాలను గురించి బోధించేవారు. మంచి చెడుల మధ్య వ్యత్యాసాన్ని తెలిపేవారు. అనుచరుల పట్ల ఎనలేని ప్రేమ కలిగి ఉండేవారు. ఆయన పెద్దలు, పిల్లలు, స్త్రీలు, పురుషులు, అందరి మధ్య జీవితం గడిపారు. అందరూ ఆయన ప్రవచనాలను ధ్యానంతో వినేవారు. ఆయన (సఅసం) చేసే ప్రతి పనినీ గమనించేవారు. ఏదైనా విషయం అర్థం కాకపోతే ఆయన్ని వివరాలు అడిగి తెలుసుకునేవారు. దైవప్రవక్త (సఅసం) వారి సందేహాలకు జవాబులిచ్చేవారు. ప్రజలు ఆయన (సఅసం) మాటలను జ్ఞాపకం పెట్టుకునేవారు. తరువాత వాటిని ఇతరులకు తెలియజేసేవారు.

ఒక్కోసారి దైవప్రవక్త (సఅసం) ఒక పనిని ఓ ప్రత్యేక తీరులో చేసేవారు. తన సహచరులలో ఎవరైనా ఏదైనా పని చేస్తుంటే చూసి దాన్ని మెచ్చుకునేవారు. లేదా అలా చేయకూడదని వారించేవారు. ఒక్కోసారి ఆయన స్వయంగా ఫలానా పని చేయమని అనుచరులను ఆదేశించేవారు, లేదా చేయవద్దని వారించేవారు. ఒక్కొక్కప్పుడు ఖుర్ఆన్‌లో ఇవ్వబడిన ఆజ్ఞలను వివరించి చెప్పేవారు. ఒకప్పుడు ఖుర్ఆన్ ఆజ్ఞలను ఏవిధంగా ఆచరణలో పెట్టాలో తెలిపేవారు. ఈ విషయా లన్నిటిని ప్రవక్త అనుచరులు శ్రద్ధగా వినేవారు. చూసి జ్ఞాపకం పెట్టుకొనేవారు. అప్పుడప్పుడు వాటిని వ్రాసుకునేవారు కూడా. అంతేకాకుండా ఆ విషయం తమకు ఎలా తెలిసింది, అలా చేస్తుండగా దైవప్రవక్త (సఅసం)ను ఎవరు చూశారు మొదలైన విషయాలను కూడా వ్రాసిపెట్టుకునేవారు.

క్రమేణా ఆ విషయాలన్నీ గ్రంథాలలో వ్రాయడం జరిగింది. వాటినే 'హదీసు' అంటారు. హదీసు లేకున్నట్లయితే ఈనాడు మనం ఇస్లాం ప్రకారం నడచుకోవడం సాధ్యమయ్యేది కాదు. నమాజు చెయ్యండని అల్లాహ్ మనలను ఆజ్ఞాపించాడు. కాని నమాజు ఏ విధంగా చెయ్యాలి? అందులో ఎన్ని రకాతులు చదవాలి అనే వివరాలన్నీ మనకు దైవప్రవక్త (సఅసం) తెలియజేశారు. 'హజ్' చెయ్యమని అల్లాహ్ ఆదేశించాడు. కాని హజ్ చేసే విధానమేమిటన్నది దైవప్రవక్త (సఅసం) వివరించారు. చేసి చూపించారు. జకాత్ చెల్లించమని ఖుర్ఆన్‌లో దైవాజ్ఞ ఉంది. కాని సంపద కనీసం ఎంత ఉండాలి, జకాత్ ఎంత చెల్లించాలి అనే వివరాలు దైవప్రవక్త (సఅసం) చెప్పారు. అంతెందుకు హదీసు లేనట్లయితే ఇస్లాం ఆజ్ఞలను ఆచరణలో పెట్టడం దుస్సాధ్యమయ్యేది. అందుకే మనం హదీసులను నమ్ముతున్నాం, వాటిని పఠించి జ్ఞాపకం పెట్టుకుంటున్నాం. హదీసులకు సంబంధించి ఎన్నో గ్రంథాలున్నాయి. హదీసులను కంఠస్థం చేసి, సంకలనం చేసి వాటిని గ్రంథస్థం చేసినవారిని 'హదీసువేత్తలు' (ముహద్దిసీన్) అంటారు.

**సుప్రసిద్ధ హదీసువేత్తల పేర్లు :**

(1) హజ్రత్ ఇమాం బుఖారీ (రహ్మా), (2) హజ్రత్ ఇమాం ముస్లిం (రహ్మా),

(3) హజ్రత్ ఇమాం మాలిక్ (రహ్మా), (4) హజ్రత్ ఇమాం తిర్మిజీ (రహ్మా),

(5) హజ్రత్ ఇమాం అబూదావూద్ (రహ్మా),(6) హజ్రత్ ఇమాం నిసాయి (రహ్మా),

(7) హజ్రత్ ఇమాం ఇబ్నె మాజ (రహ్మా).

వీరు సంకలనం చేసిన హదీసు గ్రంథాలు సుప్రసిద్ధమైనవి. ఎంతో కష్టపడి ఈ మహానుభావులు హదీసులను సేకరించారు. ఒక్కొక్క హదీసును గురించి తెలుసుకోవడానికి నెలలపాటు ప్రయాణం చేశారు.

హదీసు సంకలనం చేయడంలో వీరు తమ జీవితాలను ధారపోశారు. హదీసును వినిపించినవారు ఎలాంటివారు, వారి నీతినడవడికలు ఎలా ఉండేవి, వారి జ్ఞాపకశక్తి ఏ మేరకు ఉండింది మొదలైన విషయాలను క్షుణ్ణంగా పరిశోధించిన తరువాతనే వీరు హదీసులను స్వీకరించి గ్రంథస్థం చేసేవారు. నిరంతర దైవకారుణ్యం వారిపై వర్షించుగాక! వారు చేసిన మేలును మనం ఎన్నటికీ మరువలేము. ఈనాడు దైవప్రవక్త (స) మన మధ్య లేకపోవచ్చు. కాని ఆయన (స) చెప్పిన ముత్యాలమాటలు, ఆచరించి చూపిన ప్రతి పని హదీసు గ్రంథాలలో భద్రంగా ఉన్నాయి. హదీసు పఠనం వల్ల మన ప్రియప్రవక్త (స) జీవితం గురించి, ఆయన చేసిన ప్రతి పనిని గురించి వివరంగా తెలుసుకోగలుగుతున్నాం. అందుచేతనే అల్లాహ్ ఇలా చెప్పాడు: "ముస్లింలారా! దైవప్రవక్త (సఅసం) జీవితం మీ కోసం ఎంతో ఆదర్శప్రాయమైనది... దైవప్రవక్త (స) మీకు దేనిని ఇచ్చాడో దాన్ని తీసుకోండి. దేని నుండి మిమ్మల్ని వారించాడో దాని జోలికి పోకండి." హదీసు సంకలనం చేసినవారు లక్షలాది హదీసులను కంఠస్థం చేశారు. మనం ఆ హదీసులను చదువుతున్నాం. వాటిని జ్ఞాపకం పెట్టుకుంటున్నాం. వాటి ప్రకారం మన జీవితాలను మలచుకోవడానికి ప్రయత్నిస్తున్నాం.

**ఏడు హదీసులు**

1. ఎవరిలో నిజాయితీ గుణం లేదో వారిలో విశ్వాసం లేదు. ఎవరికి పరిశుభ్రత (మలమూత్ర పారిశుద్ధ్యం) లేదో అతని నమాజు నెరవేరదు. ఎవరైతే నమాజు చెయ్యరో వారిలో దైవధర్మం లేదు. దైవధర్మంలో నమాజుకున్న స్థానం శరీరంలో శిరస్సుకున్న స్థానం లాంటిదే.
2. ఏ సొమ్ముకు జకాతు చెల్లించబడదో ఆ సొమ్ము వినాశానికి కారణ భూతమవుతుంది.
3. దివ్యఖుర్ఆన్‌ని నిత్యం క్రమం తప్పకుండా పఠించండి. గ్రంథ పారాయణం (రోజా) సక్రమంగా చేయండి. అది మీకు ప్రపంచంలో వెలుగుబాట చూపిస్తుంది. దివిలో ప్రశంసలకు కారణభూతమవుతుంది.
4. ఎవరి ప్రవర్తన, నడవడికలు అందరికన్నా మిన్నగా ఉంటాయో అతడు విశ్వాసులందరిలో పరిపూర్ణ విశ్వాసం కలవాడనబడతాడు.

5. ఇతరులను చిత్తుచేసేవాడు మల్లయోధుడు కాదు. కోపం వచ్చినప్పుడు నిగ్రహం కలిగి ఉండేవాడే నిజమైన మల్లయోధుడు.
6. పొరుగింటివాడు ఆకలితో అలమటిస్తుంటే కడుపార తినేవాడు నిజమైన విశ్వాసి కాదు.
7. విశ్వాసి ఆపాదమస్తకం ప్రేమమయుడు. ప్రజలను ప్రేమించని, ప్రజలచేత ప్రేమించబడలేని మనిషిలో ఏలాంటి శ్రేయస్సూ లేదు.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. హదీసు అంటే ఏమిటి?
2. ధర్మం రీత్యా హదీసుకు ఏ ప్రాముఖ్యత ఉంది?
3. ఏ మహానుభావుల్ని, ముహద్దిసీన్‌లంటారు? ఇంకా వారి ఘన కార్యాలేమిటి?
4. ప్రఖ్యాతిగాంచిన 'ముహద్దిసీన్'ల పేర్లు తెలపండి?

**ఆ) క్రింది ఖాళీలను పూరించండి**

1. ముస్లింలు తమ ప్రతి మాటకు, ప్రతి పనికి ప్రియప్రవక్త(స)ను ...................... చేసుకోవాలి.
2. ప్రియప్రవక్త(స) దైవదౌత్యం చేపట్టిన తరువాత.......... సంవత్సరాల వరకు జీవించి ఉన్నారు.
3. ఒకవేళ ........ గనక ఉండకపోయినట్లయితే, మనం ఇస్లాంపై నడువలేకపోయేవాళ్ళం.
4. శరీరంలో తలకు ఏ ప్రాముఖ్యత ఉందో, ధర్మంలో................. కు అంతే ప్రాముఖ్యత ఉంది.
5. ఏ సంపత్తి నుండి ............................ తీయబడలేదో, ఆ సంపత్తి సర్వనాశనం అయిపోతుంది.
6. ఎవరి ............................ అందరికన్నా మేలైనవిగా ఉన్నాయో, అతనే విశ్వాసుల్లో అందరికన్నా పరిపూర్ణమైన విశ్వాసి.

## చేయాల్సిన మరి కొన్ని పనులు

ఇంకొన్ని హదీసుల్ని కంఠస్థం చేసి తరగతిలో వినిపించండి, మీ డైరీలో కూడా వ్రాసుకోండి.



# 17. హదీసులు లేనట్లయితే ఏమయ్యేది ఈనాడు?

దైవవాణి భావాన్ని ఎవరు చెప్పేవారు ఈ రోజు?
దాని అంతరార్థాలను ఎవరు వివరిస్తారు?
ప్రతి వ్యక్తీ తన హృదయంలో రేకెత్తే ఆలోచనల్లోనే మునిగి ఉండేవాడు.
దైవదాసులను అల్లకల్లోలంలో పడవేసేవారు.
హదీసులు లేనట్లయితే ఏమయ్యేది ఈనాడు?
దైవప్రవక్త దైవధర్మానికి దర్పణమయితే
ఆ దర్పణానికి ఆయన సహచరులు ప్రతిబింబాలు.
ఆ మహనీయుల ద్వారా మనకు ప్రవక్త ఆదర్శం లభించకపోతే
దేవుని ఆదేశాలను మనం ఎలా పాటించగలం?
హదీసులే లేనట్లయితే ఏమయ్యేది ఈనాడు?
దేవుడు మనల్ని దయదలచి తన ప్రవక్తను పంపాడు.
ప్రవక్త ద్వారానే ఆయన సహచరులు దైవధర్మాన్ని నేర్చారు.
నేర్చుకొని వాటిని భావితరాల కోసం భద్రపరిచారు.
వారిపై దేవుని కారుణ్యానుగ్రహాలు వర్షించుగాక!
హదీసులు లేనట్లయితే ఏమయ్యేది ఈనాడు?



# 18. ప్రవక్తల జీవిత విశేషాలు

దైవప్రవక్తల జీవిత విశేషాలు చదవడం వల్ల మనకెన్నో లాభాలు చేకూరుతాయి. దైవధర్మం ప్రకారం జీవితం గడపడానికి ఆసక్తి కలుగుతుంది. దైవధర్మం కోసం త్యాగం చేయడానికి, కష్టాలు భరించడానికి ధైర్యం వస్తుంది. వీలైనన్ని పుణ్యకార్యాలు చేయాలని అనిపిస్తుంది. ఇంతకు ముందు పుస్తకాలలో కొందరి జీవిత విశేషాలు తెలుసుకొన్నాం. ఇంకా కొందరి జీవిత విశేషాలు ఇక్కడ తెలుసుకొందాం. దేవా! మార్గభ్రష్టులైనవారి, నీ ఆగ్రహానికి గురైనవారి మార్గం నుండి మమ్మల్ని రక్షించి, నీ ప్రవక్తల అడుగుజాడలలో నడిచే భాగ్యం ప్రసాదించు!

### (1) హజ్రత్ సులైమాన్ (అలైహిస్సలాం)

హజ్రత్ యాఖూబ్ (అలైహిస్సలాం) గారి వంశంలో హజ్రత్ దావూద్ (అలై) సుప్రసిద్ధ దైవప్రవక్త. హజ్రత్ సులైమాన్ (అలై) ఆయన కుమారుడే. హజ్రత్ సులైమాన్ (అలై) తల్లి ఎంతో శీలవతి, పుణ్యాత్మురాలు. తరచుగా ఆమె తన కొడుక్కు మంచి మంచి మాటలు ఉపదేశించేవారు. ఒకరోజు కుమారునికి హితోపదేశం చేస్తూ, "నాయనా! రాత్రంతా నిద్రిస్తూ ఉండకు. రాత్రంతా నిద్రించే మనిషి పుణ్యం తీర్పు దినాన తగ్గిపోయే ప్రమాదం ఉంద"ని చెప్పారు.

**బాల్యం:** హజ్రత్ సులైమాన్ (అలై) బాల్యం నుండే తెలివితేటలుగల వారు. ఒకసారి ఆయన తండ్రి వద్దకు ఇద్దరు వ్యక్తులు ఫిర్యాదు తీసికొనివచ్చారు. కేసు ఇలా ఉంది: వారిలో ఒకతని మేకలు రెండవ వ్యక్తి చేనును మేసాయి, తొక్కి తొక్కి పంటను సర్వనాశనం చేశాయి. హజ్రత్ దావూద్ (అలై) తీర్పునిస్తూ ఆ మేకలన్నిటిని పొలం యజమాని తీసుకోవాలన్నారు.

హజ్రత్ సులైమాన్ (అలై) ఈ తీర్పు విని ఇలా అన్నారు: "నాన్నగారూ! మీరు చేసిన తీర్పు సరిగ్గానే ఉంది. కాని నాకో ఆలోచన తట్టింది. పొలం యజమాని మేకలు తీసికొని వాటి పాలు, ఉన్నిని వాడుకోవచ్చు. మేకల యజమాని ఆ పొలాన్ని దున్ని విత్తనం వేయాలి. పంట నిరుడు మాదిరిగా యధా స్థితికి వచ్చాక అతను పొలాన్ని పొలం యజమానికి అప్పగించి మేకల్ని వాపసు తీసుకోవాలి." కొడుకు ఇచ్చిన సలహా హజ్రత్ దావూద్ (అలై)కు నచ్చింది. కుమారుని తెలివితేటలు చూసి ఆయన అబ్బురపడ్డారు. ఆ రోజు నుంచి హజ్రత్ దావూద్ (అలై) తన వద్దకు వచ్చిన ఫిర్యాదులను తీర్చవలసి వచ్చినప్పుడు కొడుకు సలహా కూడా తీసుకొని తీర్పునిచ్చేవారు.

**రాజ్యపాలన :** హజ్రత్ దావూద్ (అలై) తరువాత అల్లాహ్ హజ్రత్ సులైమాన్ (అలై)ను ప్రవక్తగా నియ మించి సిరియా దేశానికి రాజ్యాధినేతగా చేశాడు. ఆయన రాజ్యపాలన కేవలం మానవుల వరకే పరిమితం కాకుండా పశువులపై, పక్షులపై, జిన్నులపై, చివరికి గాలిపై కూడా అధికార మిచ్చాడు దేవుడు. ఇవన్నీ ఆయన ఆజ్ఞలకు లోబడి ఉండేవి. జంతువులు, పక్షులు, చీమలు మాట్లాడే భాషల పరి జ్ఞానం కూడా ఆయనకిచ్చాడు. హజ్రత్ సులైమాన్ (అలై) తన అధికార సింహాసనాన్ని గాలిలో ఎగరవేసి

ఆకాశమార్గాన ప్రయాణం చేసే వారు. ఆ విధంగా ఆయన క్షణాలలో ఎక్కడకి పోదలిస్తే అక్కడికి చేరుకొనేవారు. జిన్నుల చేత పెద్ద పెద్ద కోటలు కట్టించేవారు. అవి ఎంతో లోతైన సముద్రాలలో సయితం మునిగి ఆయన కోసం మణిమణిక్యాలు వెలికి తీసేవి. యుద్ధాలు చేయడానికి వాటిచేత ఆయుధాలు తయారు చేయించేవారు. మానవాతీతమైన అనేక పనులన్నీ చేయించేవారు.

**చీమల మైదానం:** ఒకసారి హ(జత్ సులైమాన్ (అలై) తన సైన్యంతో ఎక్కడికో వెళ్తున్నారు. సైన్యంలో మానవులతోపాటు పక్షులు, జంతువులు, జిన్నులు కూడా ఉన్నాయి. దారిలో ఒక మైదానం వచ్చింది. ఆ మైదానంలో అసంఖ్యాకమైన చీమలు ఆహారం కోసం అటు ఇటు తిరుగుతున్నాయి. ఆ చీమల నేత సులైమాన్ (అలై) సైన్యాన్ని చూసి ఇలా అన్నది:

సోదర చీమల్లారా! సులైమాన్ (అలై) సైన్యం వస్తూంది. తొందరగా మీరంతా మీ మీ కన్నాలలోకి దూరి దాక్కోండి. లేకపోతే సైన్యం కాళ్ళ క్రింద పడి మీరు నలిగిపోతారు. వారికి తమ కాళ్ళ క్రిందపడి ఎన్ని చీమలు చచ్చాయో కూడా తెలియదు."

హ(జత్ సులైమాన్ (అలై) జంతు భాష తెలిసినవారయినందున చీమల నాయకుని మాటలు విని చిరునవ్వు నవ్వారు. తరువాత అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకొన్నారు. అల్లాహ్‌ను ఇలా ప్రార్థించారు: "నా తల్లిదండ్రులపై నీ కారుణ్యం కురిపించు. నాపై కూడా నీ కారుణ్యం చిలికించు. నేను నీకు కృతజ్ఞుడనై ఉంటూ నీవు సంతోషించే పనులు చేసేలా నన్ను నీ సజ్జనులయిన దాసులలో చేర్చు."

**హుద్ హుద్ గాథ :** ఒకసారి సులైమాన్ (అలై) తన సైన్యాన్ని తనిఖీ చేశారు. అప్పుడు హుద్ హుద్ అనే పక్షి కన్పించలేదు. అప్పుడు ఆయన "హుద్ హుద్ ఎక్కడికి పోయింది? రాగానే నా ముందు ప్రవేశపెట్టండి. గైరుహాజరు కావడానికి తగిన సంజాయిషీ చెప్పకపోతే నేను దాన్ని కఠినంగా శిక్షిస్తాను" అని అన్నారు. ఆ తరువాత కాస్సేపటికే హుద్ హుద్ పక్షి వచ్చేసింది. రాగానే అది హ(జత్ సులైమాన్ (అలై) సన్నిధికి వెళ్ళి ఇలా అన్నది:

"ఓ దైవప్రవక్తా! నేనొక అద్భుతమైన వార్త తెచ్చాను. ఇంతకు ముందు మీరు అలాంటి వార్త విని ఉండరు. నేను గాలిలో ఎగురుతూ 'సబా' దేశానికి చేరుకున్నాను. ఆ దేశాన్ని ఒక స్త్రీ రాజ్యమేలుతోంది. దేవుడు సమస్తం ప్రసాదించాడు. ఆమెకు ఎంతో అందమైన, అద్భుతమైన సింహాసనం ఉంది. అక్కడి ప్రజలు దేవుడ్ని మరచిపోయారు. వారు దేవుడ్ని వదలి సూర్యుడ్ని పూజిస్తున్నారు. షైతాన్ వాళ్ళను రకరకాల చెడులలో కూరుకుపోయేలా చేశాడు."

**సులైమాన్ (అలై) ఉత్తరం:** హ(జత్ సులైమాన్ (అలై) హుద్ హుద్ తెచ్చిన సమాచారం విని, "తనకు సమీపంలోనే ఉన్న సబా దేశం ప్రజలు తమను సృష్టించిన దేవుడ్ని వదలి, సూర్యుడ్ని ఆరాధిస్తూ దేవునికి అవిధేయులయి పోయారే!" అని భావించి ఎంతో ఆందోళన చెందారు. ఆ తరువాత ఆయన హుద్‌హుద్ పక్షిని సంబోధిస్తూ, "ఈ సమాచారం ఎంతవరకు నిజమో నేను తెలుసుకోదలిచాను" అంటూ సబా రాణి పేర ఈ విధంగా ఒక ఉత్తరం రాశారు:

"సులైమాన్ (అలై) తరఫున వ్రాస్తున్న ఉత్తరం ఇది-

కరుణామయుడు, కృపాసాగరుడయిన అల్లాహ్ పేరుతో ప్రారంభం. (దేవుడు ఒక్కడే. ఆయనే ఆరాధ్యనీయుడు. మా ఈ సందేశాన్ని అంగీకరించు.) మాకు ఎదురుతిరగకు. దేవునికి విధేయురాలివయి మా దగ్గరకు వచ్చెయ్యి."

హజ్రత్ సులైమాన్ (అలై) ఈ ఉత్తరం హుద్ హుద్ పక్షికి ఇచ్చి దాన్ని సబా రాణికి అందజేయ మన్నారు. ఆ పక్షి ఉత్తరాన్ని సబా రాణి రాజమందిరంలోకి తీసికెళ్ళి ఆమె ముందు విసిరింది.

సబా రాణి ఉత్తరం చదివి ఎంతో ప్రభావితురాలయింది. వెంటనే ఆమె సలహా కోసం తన మంత్రులను, దండనాయకులను సమావేశపరచింది. వారికి హజ్రత్ సులైమాన్ (అలై) ఉత్తరం చదివి విన్పించి, "ఇప్పుడు మీ సలహా ఏమిటో చెప్పండి" అని అడిగింది. దానికి వారు అహంకారంతో విర్రవీగుతూ, "మనం ఏమాత్రం భయపడనవసరం లేదు. వారికి లొంగిపోనవసరం కూడా లేదు. మీరు ఆజ్ఞాపించండి. మేము ఆరితేరిన యోధానయోధులం. రణరంగం నుంచి వెన్నుజూపి పారిపోయే పిరికిపందలం కాము" అని అన్నారు.

## హజ్రత్ సులైమాన్ (అలై)కు సబా రాణి కానుకలు

సబా రాణి ఎంతో విజ్ఞతావివేచనలు కలిగిన మహిళ. ఆమె వారితో ఇలా అన్నది: "యుద్ధం మంచిది కాదు. రాజులు ఏదైనా దేశంపై దండెత్తితే ఆ దేశ ప్రజలు నాశనమవుతారు. గౌరవనీయుల గౌరవమర్యాదలు మంటగలసి పోతాయి. దేశం సర్వనాశనమవుతుంది. అందుచేత సులైమాన్ (అలై) దైవప్రవక్తో లేక రాజ్యాధికారం, సిరిసంపదలకు ఆశపడే ప్రాపంచిక చక్రవర్తో తెలుసుకోవడానికి నేను ఆయన దగ్గరకు కొన్ని కానుకలు పంపిస్తాను." ఈ మాట చెప్పి ఆమె కొందరికి కానుకలిచ్చి హజ్రత్ సులైమాన్ (అలై) దగ్గరకు పంపింది.

వారు ఈ కానుకలు తీసుకొని హజ్రత్ సులైమాన్ (అలై) దగ్గరకు చేరుకున్నారు. హజ్రత్ సులైమాన్ (అలై) ఆ కానుకలు చూసి, "మీ రాణిగారు నా లేఖ సారాంశాన్ని అర్థం చేసుకోలేదు. మాకు ఈ ప్రాపం చిక సంపదలు అవసరం లేదు. దేవుడు మాకు ఇచ్చినదే ఎంతో ఉంది. తీసుకెళ్ళండి మీ కానుకలు. మీరంతా ఒక్క అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించాలని, ఆయనకే పూర్తిగా విధేయులై ఉండాలని మాత్రమే మేము కోరుకుంటున్నామని మీ రాణిగారితో చెప్పండి" అని అన్నారు.

వారు వెళ్ళిపోయి రాణిగారికి జరిగిన వృత్తాంతం వివరించారు. హజ్రత్ సులైమాన్ (అలై) సచ్ఛీలం, నీతినడవడికల సంగతి కూడా తెలియజేశారు.

**ఒక మహత్యం:** పరిస్థితులు అర్థంచేసుకున్న సబా రాణి స్వయంగా హజ్రత్ సులైమాన్ (అలై)ని కలుసుకోవడానికి బయలుదేరారు. సబారాణి వస్తోందని దేవుడు ముందుగానే హజ్రత్ సులైమాన్ (అలై)కు తెలియజేశాడు. అప్పుడు హజ్రత్ సులైమాన్ (అలై) తన అధికారులతో సంప్రదిస్తూ, "సబా రాణి ఇక్కడకు చేరుకోక ముందే ఆమె అందాల సింహాసనాన్ని తీసుకురాగలవారు మీలో ఎవరైనా ఉన్నారా?" అని

అడిగారు. అప్పుడు జిన్నుల్లో ఒకడు లేచి, "మహారాజా! మీరు ఇక్కడ్నుంచి లేచి బయటికి వెళ్ళక ముందే నేను ఆమె సింహాసనాన్ని తీసుకొస్తాను" అన్నాడు. జిన్నులలోనే మరొకడు లేచి, "మహారాజా! సబా రాణి సింహాసనం తీసుకురావడానికి ఎంతో సేపు పట్టదు. మీరు కళ్ళు మూసి తెరిచేలోగా తెచ్చి మీ ముందు పెడ్తాను" అన్నాడు. అనడం ఏమిటీ, మరుక్షణమే సింహాసనం హజ్రత్ సులైమాన్ (అలై) ముందు ప్రత్యక్షమయింది.

హజ్రత్ సులైమాన్ (అలై) దాన్ని చూసి, "ఇదంతా దైవానుగ్రహం. రెప్పపాటులో తీసుకురాగల శక్తి నాలో ఏముంది? ఇది దేవుని అనుగ్రహం మాత్రమే. నేను తనకు కృతజ్ఞుడయి ఉంటానా లేక నా శక్తిసామర్థ్యాలు చూసుకొని విర్రవీగుతూ కృతఘ్నుడనయి పోతానా అని ఆయన నన్ను పరీక్షించదలిచాడు" అని అన్నారు. తరువాత హజ్రత్ సులైమాన్ (అలై) ఆ సింహాసనంలో కొంచెం మార్పు చేయించారు. సబా రాణి వచ్చిన తరువాత ఆయన, "ఈ సింహాసనం మీదేనా?" అని అడిగారు. దానికి ఆమె, "ఇది అచ్చం అలాగే ఉంది" అన్నారు. హజ్రత్ సులైమాన్ (అలై) అసలు విషయం తెలియజేశారు. దాంతో ఆమె ఎంతో ప్రభావితురాలయి, "ఈయన తప్పకుండా దైవప్రవక్తే" అని భావించారు మనసులో.

### అద్దాల మేడ

హజ్రత్ సులైమాన్ (అలై) సబా రాణితో, "మీరు ఈ అద్దాల మేడలో ప్రవేశించి విశ్రాంతి తీసుకోండి" అని చెప్పారు. హజ్రత్ సులైమాన్ (అలై) అద్దాల మేడను జిన్నుల చేత కట్టించారు. అందులోని నేల ఎంతో అందంగా, అద్భుతంగా చూసేవారికి అక్కడ స్వచ్ఛమైన నీరు ఉన్నట్లు కనబడుతుంది. సబా రాణి అక్కడ నిజంగానే నీళ్ళున్నాయని భావించి కాళ్ళ మడమలపై నుంచి వస్త్రం పైకెత్తి పట్టుకొని ముందుకు నడవబోయారు. హజ్రత్ సులైమాన్(అలై), "ఇది నీరు కాదు, నున్నటి నేల" అని చెప్పారు. సబా రాణి ఆశ్చర్యపోతూ, "సులైమాన్ (అలై)కు సమస్తం సమకూరినా ఆయన దేవుడ్ని మరచిపోలేదు. తన శక్తి సామర్థ్యాలు, సిరిసంపదల పట్ల ఆయనకు గర్వం కూడా లేదు. ఈయన నిజంగానే దైవప్రవక్త. ఇక ఇందులో నాకెలాంటి సందేహం లేదు" అని అనుకున్నది.

### సబా రాణి ముస్లిం అయ్యారు

ఆ తరువాత సబా రాణి నోట అప్రయత్నంగా ఈ మాటలు వెలువడ్డాయి: "ఓ నా ప్రభూ! నేను నిన్ను మరచి సూర్యుణ్ణి పూజించానే! నాకు నేను ఎంత అన్యాయం చేసుకున్నాను!! ప్రభూ! సమస్తం నీ అధీనంలోనే ఉన్నాయి. నేను ఏమరుపాటుకు లోనయ్యాను. నన్ను క్షమించు. నేను సులైమాన్ (అలై)తో పాటు సకల లోకాల ప్రభువును విశ్వసిస్తూ ఆ ప్రభువుకు పూర్తిగా విధేయురాలినై (ముస్లింనయి) పోయాను."

### (2) హజ్రత్ షుఐబ్ (అలైహిస్సలాం)

ఎర్రసముద్రం తూర్పుతీరాన 'మద్‌యన్' పేరుగల ఒక తెగ ఉండేది. హిజాజ్ ప్రాంతపు అరబ్బులు సిరియా, ఫలస్తీనా దేశాలు వెళ్ళాలంటే మద్‌యన్ తెగవారి పట్టణ శిథిలాలగుండానే వెళ్ళవలసి

ఉంటుంది. మద్‌యన్ తెగవారు వ్యాపారం చేసేవారు. అల్లాహ్ వారికి ప్రాపంచిక సిరిసంపదలు అమితంగా ఇచ్చాడు. పుష్కలంగ పండే పండ్ల తోటలు, సస్యశ్యామలమైన పొలాలు, అపారమైన సిరిసంపదలు ఇచ్చాడు. ఒక్కటేమిటి, భోగభాగ్యాలు చేకూర్చే సమస్తం ప్రసాదించాడు. కాని ఈ దౌర్భాగ్యులు తమ సిరిసంపదలు చూసుకొని విర్రవీగసాగారు. వారు దేవుడ్ని మరచి ప్రాపంచిక వ్యామోహంలో పూర్తిగా కూరుకుపోయారు. వారిలో ముఖ్యంగా మూడు చెడులు ప్రబలిపోయాయి:

1. వారు అల్లాహ్‌ను వదలి విగ్రహారాధన చేయసాగారు.
2. వారు ఇతరుల నుండి సరుకు కొనేటప్పుడు పూర్తిగా తూచి లేక కొలచి తీసుకునేవారు. అమ్మేటప్పుడు తగ్గించి ఇచ్చేవారు.
3. అన్ని వ్యవహారాలలోనూ మోసం చేసేవారు నమ్మకద్రోహానికి పాల్పడేవారు.

అప్పుడు అల్లాహ్‌కు వారి పట్ల జాలివేసింది. వారికి సన్మార్గం చూపించడానికి, నీతిరాహిత్యం నుండి బయటికి తీయడానికి ఆయన హజ్రత్ షుఐబ్ (అలై)ను ప్రవక్తగా నియమించి పంపాడు. హజ్రత్ షుఐబ్ (అలై) అద్భుతమైన వక్త. అందుచేతనే ప్రజలు ఆయన్ని "ఖతీబుల్ అంబియా" (ప్రవక్తలలో ప్రఖ్యాత వక్త) అని అంటారు. ఆయన తన జాతి ప్రజలకు సర్వవిధాల నచ్చజెప్పారు. అల్లాహ్ చేసిన మేళ్ళను గుర్తుచేశారు. చెడుల భయంకర పర్యవసానాల్ని గురించి కూడ హెచ్చరించారు.

### హజ్రత్ షుఐబ్ (అలై) ఉపన్యాసం

"సోదరులారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప ఇంకెవ్వరూ ఆరాధనకు అర్హులు కారు. తూనికల్లో, కొలతల్లో సరుకు తగ్గించి ఇవ్వకండి. దేవుడు మీకు సకల సంపదలు ప్రసాదించాడు. ఆయనకు కృతఘ్నులుకాకండి. కృతఘ్నత శిక్ష చాలా కఠినంగా ఉంటుంది. ప్రజల హక్కులను కొల్లగొట్టకండి. ప్రతి ఒక్కరికి న్యాయం చేకూర్చండి. ఎవరి హక్కును వారికి ఇవ్వండి. దేశంలో అరాచకం, అలజడులు సృష్టించకండి. క్షుద్రమైన ప్రాపంచిక ప్రయోజనాల వెంట పడకుండా శాశ్వతమైన పరలోక ప్రయోజనాలపై దృష్టి కేంద్రీకరించండి. అక్రమ సంపాదనకు పాల్పడి మీ చిత్తశుద్ధిని చెరచుకోకండి. అల్లాహ్ నన్ను తన ప్రవక్తగా నియమించి మీ దగ్గరకు పంపాడు. మీ శ్రేయస్సు కోసం స్పష్టమైన మహిమలు ఇచ్చి పంపాడు. మీకు ఏ పనులయితే చెయ్యమని చెబుతున్నానో ఆ పనులను నేను కూడా చేస్తున్నాను. శక్తివంచన లేకుండా మీ సంస్కరణకు ప్రయత్నిస్తున్నాను.

నేను అల్లాహ్‌నే నమ్ముకున్నాను. ఆయనే నా పనులన్నీ నెరవేరుస్తాడు. మీరు మొండి పట్టుదలకు పోయి అల్లాహ్ పట్ల అవిధేయత చూపకండి. నూహ్ (అలై), హూద్ (అలై), సాలెహ్ (అలై) ప్రవక్తల జాతులపై వచ్చిపడిన దైవశిక్ష మీకు కూడా దాపురిస్తుందేమోనని భయపడుతున్నాను. లూత్ (అలై) జాతిపై పడిన విపత్తు, వారి శిథిలాలు మీ ముందే ఉన్నాయి.

సోదరులారా! పశ్చాత్తాపం చెంది అల్లాహ్‌ను క్షమాపణ వేడుకోండి. ఆయనకు భయపడండి. ఆయన వైపునకు మరలండి. ఆయన అమిత దయకలవాడు, ప్రేమతో ఆదరించేవాడు."

**జాతి ఇచ్చిన జవాబు :** ప్రజలు హ్రజత్ షుఐబ్ (అలై)తో ఇలా అన్నారు: "నీవు అల్లాహ్ ఒక్కడే అని మాటిమాటికి చెబుతున్న మాట మాకు అర్థంకావడం లేదు. నీవు ప్రస్తావిస్తున్న పరలోకం సంగతి కూడా మాకు అర్థం కావడం లేదు. నీవు దైవప్రవక్త అని మేము ఎలా నమ్మాలి? నీవు మా అందరికన్నా బలహీనుడివి, పేదవాడివి. నీ మాటలు నిజమైతే నీ జీవితం మా జీవితం కంటే సుఖవంతంగా ఉండాలి. మేము నీ వంశాన్ని, బంధువులను చూసి ఊరుకుంటున్నాము. లేకపోతే మేము నిన్ను రాళ్ళతో కొట్టి ఎన్నడో చంపేసేవాళ్లం. మేము కష్టపడి సంపాదించే డబ్బును మా అవసరాల కోసం మా ఇష్టానుసారం ఖర్చుచేసుకునే అధికారం కూడా లేదా మాకు? నీవు చెప్పే ఈ మాట కూడా మాకు అర్థంకావడం లేదు. మా డబ్బు, మా ఇష్టమొచ్చినట్లు ఖర్చుచేసుకుంటాం. మేము తలచుకున్నవారికి మా ఇష్టానుసారం ఇస్తాం. వ్యాపారలావాదేవీల విషయంలో కూడా నీవు నిజాయితీ గిజాయితీ అని ఏదో చెబుతున్నావు. వ్యాపారానికి నిజాయితీకి సంబంధం ఏమిటీ? నీ నమాజు నీకు ఇదేనా నేర్పుతున్నది? అసలు నమాజుకు ప్రాపంచిక వ్యవహారాలకు సంబంధం ఏమిటీ? తూనికల్లో, కొలతల్లో సరుకులు తగ్గించి ఇవ్వకపోతే, వ్యాపారంలో నిజం, నిజాయితీ అని మడి కట్టుకొని కూర్చుంటే మేము కొన్నాళ్ళకే దివాళా తీయవలసి వస్తుంది. మా దేవతలను వదిలెయ్యమంటున్నావు. మా తాతముత్తాతల కాలం నుంచీ వస్తున్న ఈ దేవతల పూజను మేము ఎలా వదులుకుంటాం? ఇప్పుడు మన ఉభయుల ముందు రెండేరెండు విషయాలు ఉన్నాయి. నీవు, నీ అనుచరులు తరతరాల నుంచి వస్తున్న మా ధర్మంలోకి తిరిగి వచ్చేయండి. లేదంటారా, మేము మిమ్మల్ని మా దేశం నుండి వెళ్ళగొడ్తాం."

హ్రజత్ షుఐబ్ (అలై) వారికి రకరకాలుగా నచ్చజెప్పారు. దైవశిక్ష గురించి భయపెట్టారు. పుణ్యకార్యాల వల్ల లభించే ప్రయోజనాలను గురించి తెలియజేశారు. వ్యాపారంలో మోసం చేయడం వల్ల కలిగే పరలోక అనర్థాలను గురించి హెచ్చరించారు. దైవానుగ్రహాలను గుర్తుచేస్తూ, "మీరు తక్కువ సంఖ్యలో ఉన్నప్పుడు దేవుడు మీకు సంతానం ఇచ్చి మీ జనాభాను పెంచాడు" అని ఉపదేశించారు. కాని వారు తమ వైఖరిని కించిత్తయినా మార్చుకోలేదు. సిరి సంపదలు వారిని సత్యం కానలేని అంధులుగా చేసింది. పైగా షుఐబ్! నీవు ధర్మం, విశ్వాసం గురించి చెబుతున్న మాటలు మాకు అర్థం కావడంలేదని అన్నారు. వారు స్వయంగా మార్గభ్రష్టులయిపోవడమే గాకుండా సన్మార్గంలోకి వచ్చేవారిని కూడా ఆటంకపరుస్తున్నారు. సన్మార్గం స్వీకరించడానికి వచ్చేవారిని హ్రజత్ షుఐబ్ (అలై)ను కలుసుకోనివ్వకుండా వేధించేవారు.

**అగ్నివర్షం :** హ్రజత్ షుఐబ్ (అలై) ఇలా అన్నారు. "నేనేం చెయ్యగలను? బలవంతంగా మీ హృదయాలలో విశ్వాసాన్ని జొప్పించలేనుగా. నేను మీకు అన్నివిధాలా నచ్చజెప్పాను. ఇక మీరు దైవశిక్ష కోసం ఎదురు చూడండి, ఎవరు సత్యవంతులో, ఎవరు అబద్ధాలకోరులో తెలుస్తుంది."

చివరికి వారిపై దైవశిక్ష విరుచుకుపడే సమయం ఆసన్నమయింది. దేవుడు హ్రజత్ షుఐబ్ (అలై)ను, ఆయన్ని విశ్వసించినవారిని రక్షించాడు. అవిశ్వాసుల్ని ఓ భయంకరమైన భూకంపం మట్టుపెట్టింది.

వారు ప్రశాంతంగా నిద్రపోతున్నప్పుడు భూకంపం వచ్చింది. అటు ఆకాశం నుండి అగ్నికణాలు కూడా కురిశాయి. దాంతో ఆ దుర్మార్గులు కాలిపోయి బోర్లాపడిపోయారు. వారసలు ఆ ప్రాంతంలో నివసించనే లేదన్నట్లు పూర్తిగా తుడిచిపెట్టుకుపోయారు. నిజం. దేవునికి అవిధేయులయ్యేవారి పర్యవసానం ఇలాగే ఉంటుంది. ఈ గాథలో మనకు ఎంతయినా గుణపాఠం ఉంది.

1. సాధారణంగా ప్రజలు పూజాపురస్కారాలనే ధర్మం అని భావిస్తున్నారు. వ్యాపార లావాదేవీలు, తోటి మానవుల హక్కులు, ఇతర ప్రాపంచిక వ్యవహారాల విషయంలో ధర్మాన్ని గురించి, దైవాజ్ఞలను గురించి పట్టించుకోరు. కాని ధర్మ పరాయణత అంటే నమాజ్, రోజా లాంటి కొన్ని ఆరాధనలకు పరిమితమయి ఉండటమే కాదని, ప్రాపంచిక వ్యవహారాల్లో కూడా దైవాభీష్టం ప్రకారం నడవడమే దేవుని దృష్టిలో నిజమైన ధర్మపరాయణత అన్పించుకుంటుందని ఈ చారిత్రక గాథ ద్వారా మనకు తెలుస్తోంది.
2. తూనికల్లో, కొలతల్లో తగ్గించడం, మోసగించడం ఘోరమైన పాపం. దాని వల్ల ప్రజల్లో దుర్గుణాలు చోటుచేసుకుంటాయి పేరాశ, స్వార్థం, అవమానం జనిస్తాయి. అందుకే దేవుడు తూనికల్లో, కొలతల్లో తగ్గించేవారు నాశనమవుతారని చెప్పాడు. వారు ఇతరుల నుండి పూర్తిగా కొలచి లేక తూచి తీసుకుంటారు. ఇచ్చేటప్పుడు మాత్రం తగ్గించి ఇస్తారు. ఈ కారణంగానే దేవుడు తూనికలు, కొలతల వ్యవస్థను సంస్కరించడానికి హజ్రత్ షుఐబ్ (అలై)ను దైవప్రవక్తగా నియమించి పంపాడు.
3. మనం చేసే నమాజ్ మనలోని చెడులను నిర్మూలించాలి జీవితంలోని ప్రతి వ్యవహారంలోనూ మనల్ని దైవభక్తులుగా మలచాలి. అప్పుడే మనం నిజమైన ధార్మికులం అనబడతాము. నమాజ్ మనిషిని తప్పుడు మతాచారాల నుండి నిరోధిస్తుంది. ఇచ్చిపుచ్చుకోవడాలలో కూడా అతడ్ని నిజాయితీపరుడిగా తీర్చి దిద్దుతుంది. అంతేకాదు. అలాంటి మనిషి ఇతరుల్ని కూడా సజ్జనులుగా సంస్కరించడానికి కృషిచేస్తాడు. తాను దైవాభీష్టం ప్రకారం నడవటమే గాకుండా ఇతరుల్ని కూడా దైవాభీష్టం ప్రకారం నడిపించడానికి ప్రయత్నిస్తాడు.

### (3) హజ్రత్ యహ్యా (అలైహిస్సలాం)

హజ్రత్ యాఖూబ్ (అలై) సంతానంలో జకరియా (అలై) అనే ఓ దైవప్రవక్త ఉండేవారు. హజ్రత్ జకరియా (అలై) బాగా వృద్ధులయిన తరువాత దేవుడ్ని ఇలా ప్రార్థించారు: "ప్రభూ! నేను చాలా బలహీనుడనయ్యాను. నా తల, గడ్డం పూర్తిగా నెరసిపోయింది. ప్రభూ! నేను నీతో మొరపెట్టుకోవడం, నీవు నా మొర ఆలకించకపోవడం ఎన్నడూ జరగలేదు. నా తదనంతరం ఉండేవారిని గురించే నాకు విచారంగా ఉంది. నా తదనంతరం వారు ఎలాంటి చెడులు వ్యాపింపజేస్తారో అని భయపడుతున్నాను. నా భార్య చూస్తే గొడ్రాలుగా ఉంది. ప్రభూ! నాపై దయజూపు. నీవు నన్ను ఏ పని కోసం ప్రవక్తగా చేశావో ఆ పనిని కొనసాగించగలిగే ఒక కుమారుడ్ని నాకు ప్రసాదించు."

దేవుడు హ(జత్ జకరియా (అలై) మొరాలకించి, “జకరియా! మేము నీకు కొడుకు పుడ్తాడని శుభవార్త వినిపిస్తున్నాం. అతని పేరు యహ్యా అవుతుంది. ఈ పేరును మేము ఇంతకుముందు ఎవరికీ పెట్టలేదు”అని చెప్పాడు. హ(జత్ యహ్యా (అలై) ఎంతో పుణ్యాత్ములు, దైవభీతిపరులు. తరచుగా ఆయన దైవశిక్షను తలచుకొని చెంపలపై కన్నీటి చారలు పడేటంతగా దుఃఖించేవారు. ఒకసారి వాళ్ళ నాన్నగారు ఆయన్ని కలుసుకొని, “బాబూ! నీవు కనపడలేదని మేము నిన్ను వెతుకుతుంటే నీవిక్కడ కూర్చొని ఏడుస్తున్నావేమిటీ?” అని అడిగారు. దానికి ఆయన సమాధానమిస్తూ, “నాన్నగారూ! స్వర్గనరకాల మధ్య ఒక పెద్ద మైదానం ఉంటుందని, దాన్ని దైవభీతితో దుఃఖించకుండా ఎవరూ దాటిపోలేరని మీరే కదా చెప్పింది” అన్నారు. హ(జత్ జకరియా (అలై) కూడా ఈ మాట విని కంటతడి పెట్టుకున్నారు.

హ(జత్ యహ్యా (అలై) ఎంతో నీతిమంతులు, దైవభీతిపరాయణులు. దేవుడు ఆయనకు చిన్నతనం లోనే విద్యాసంపద, విజ్ఞతావివేచనలు ప్రసాదించాడు. ఆయన ఎలాంటి దుర్గుణాలులేని పరమ పవిత్రులు. దాంతో పాటు ఆయన మృదు హృదయులు. తల్లిదండ్రులకు ఎల్లప్పుడూ సేవచేసేవారు. వారి ముందు కఠినంగా, దురుసుగా మాట్లాడేవారు కాదు. వారికి కొంచెం కూడా అవిధేయత చూపేవారు కాదు. ఆయన ఎంతో అదృష్టవంతులు. దేవుడు ఆయనకు ఇహపరలోకాల సౌభాగ్యాలు ప్రసాదించాడు. ఆయన పుట్టినప్పుడు, ఆయన చనిపోయినప్పుడు, తిరిగి బ్రతికించబడినప్పుడు ఆయనకు శాంతీ సౌభాగ్యాలు కలుగుగాక!

## దైవప్రవక్తగా నియామకం

హ(జత్ యహ్యా (అలై)కు అల్లాహ్ క్రొత్తగా ఎలాంటి గ్రంథం ఇవ్వలేదు. తౌరాత్ గ్రంథంలోని ఆజ్ఞలే గట్టిగా ఆచరించాలని, ఇతరులకు కూడా దాని బోధనలు ఉపదేశించాలని మాత్రమే ఆయన్ని ఆదేశించాడు. బాల్యంలో ఆయన్ని ఆయన స్నేహితులు ఆడుకుందాం రమ్మని అడిగితే దేవుడు తనను ఆడుకోవడానికి పుట్టించలేదని ఆయన సమాధానమిచ్చేవారు. దేవుడు ఆయన్ని త్వరలోనే తన ప్రవక్తగా నియమించాడు. ఆయన ప్రజలకు తౌరాత్ బోధనలు బోధించేవారు. హ(జత్ ఈసా (అలై) రాకను గురించి శుభవార్త అందజేసేవారు.

## ఐదు విషయాల ఆదేశం

మన ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇలా ప్రవచించారు: దేవుడు యహ్యా (అలై)కు ప్రత్యేకంగా ఐదు విషయాలను ఆదేశిస్తూ వాటిని స్వయంగా ఆచరించాలని, ఇస్రాయీలీలకు కూడా బోధించాలని చెప్పాడు. అప్పుడు హ(జత్ యహ్యా (అలై) ప్రజలను సమావేశపరచి ఇలా ప్రసంగించారు:

సోదరులారా! అల్లాహ్ నాకు ఐదు విషయాలను గురించి చెప్పి వాటిని నేను ఆచరించాలని, మీకూ ఆ విషయాలు తెలియజేయాలని ఆజ్ఞాపించాడు. ఆ ఐదు విషయాలు ఏమిటో వినండి–

1. మీరు అల్లాహ్‌ను తప్ప మరెవరినీ ఆరాధించకండి. ఆయన దైవత్వంలో మరెవరికీ సాటి కల్పించకండి. దేవునికి సాటి కల్పించేవాడు ఎలాంటి వాడంటే– ఒకతను తన సొంత డబ్బుతో ఒక బానిసను కొన్నాడు. కాని ఆ బానిస తాను సంపాదించేదంతా తన యజమానికి ఇవ్వడానికి బదులు ఇతరులకు ఇచ్చేవాడు. ఇలాంటి బానిసను ఎవరు మెచ్చుకుంటారు? అందుకే మీరు దేవుడ్ని మాత్రమే ఆరాధించాలి.
2. మీరు నమాజు సక్రమంగా, క్రమం తప్పకుండా చేయండి. నమాజు చేస్తున్నప్పుడు మీ మనస్సు వేరే వైపు మరల్చకండి. ఇలా మీరు అల్లాహ్ ధ్యానం పైనే మనస్సు లగ్నంచేస్తే అల్లాహ్ కూడా మీపై తన కారుణ్యానుగ్రహాలు కురిపిస్తాడు.
3. ఉపవాస వ్రతాలు కూడా పాటిస్తూ ఉండండి. ఉపవాసం పాటించే మనిషిని కస్తూరి ఉన్న సంచి దగ్గర పెట్టుకొని స్నేహితుల మధ్య కూర్చున్న వాడితో పోల్చవచ్చు. ఉపవాసం పాటించేవాడి నోటి సువాసన కస్తూరి సువాసన కన్నా ఎక్కువ గుబాళిస్తుంది.
4. మీ సంపద నుండి కొంత తీసి దానధర్మాలు చేయండి. దానధర్మాలు చేసే మనిషి దృష్టాంతం ఇలా ఉంటుంది: ఒక మనిషిని శత్రువులు పట్టుకుంటారు. అతడ్ని చేతులు వెనక్కి విరిచి కట్టి చంపడానికి తీసికెళ్తారు. అతను నిరాశతో, "నేను నా ధనమంతా ఇచ్చేస్తే మీరు నన్ను వదలిపెడ్తారా?" అని అడుగుతాడు. దానికి వారు వదలిపెడ్తామంటారు. అప్పుడా మనిషి ప్రాణం కాపాడుకోవడానికి తన సిరిసంపదలన్నీ త్యాగం చేస్తాడు.
5. రేయింబవళ్ళు అల్లాహ్‌ను స్మరించండి. అల్లాహ్‌ను స్మరించేవారి దృష్టాంతం ఇలా ఉంటుంది: 'ఒక వ్యక్తి శత్రువు నుండి తప్పించుకోవడానికి పారిపోతాడు. శత్రువు అతడ్ని వెంటాడుతాడు. ఆ వ్యక్తి పారిపోయి ఒక సురక్షితమైన కోటలో దాక్కుంటాడు. దైవస్మరణలో నిమగ్నుడై ఉండేవాడు షైతాను దాడుల నుంచి తప్పించుకొని కోటలో రక్షణ పొందినట్లవుతాడు".

**అమరగతి:** హజ్రత్ యహ్యా (అలై) సత్కార్యాలను గురించి ప్రచారం చేస్తూ హజ్రత్ ఈసా (అలై) రాక గురించి కూడా భవిష్యత్ ప్రకటన చేసారు. అప్పుడు ప్రజలు ఆయన వైపు మొగ్గారు. అయితే యూదులకు ఈ మాటలు నచ్చలేదు. దాంతో వారు ఆయనకు విరోధులయిపోయారు. ఒకరోజు వారంతా వచ్చి, "నీవు మసీహ్‌వా?" అని అడిగారు. దానికి ఆయన కాదన్నారు. "మరి నీవు ఆ ప్రవక్తవా?" అని అడిగారు వారు మళ్ళీ. దానికీ ఆయన కాదన్నారు. "పోనీ నీవు ఏలియావా?" అని ప్రశ్నించారు వారు. తాను ఏలియా కూడా కాదన్నారు ఆయన. "మరి నీవు ఎవరు, సత్కార్యాలను గురించి మాకు ఉపదేశించడానికి?" అని గద్దిస్తూ అడిగారు. యూదులు అంతటితో ఊరుకోలేదు. హజ్రత్ యహ్యా (అలై)ను దారుణంగా హతమార్చారు. దేవుని కారుణ్యానుగ్రహాలు ఆయనపై వర్షించుగాక!

## అభ్యాసం

**అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి?**

1. దైవప్రవక్తల జీవిత గాధలు చదివితే మనకు ఏ ఏ లాభాలు చేకూరుతాయి?
2. హజ్రత్ సులేమాన్ (అలై)కు ఆయన తల్లి ఏమని ఉపదేశించారు?
3. హజ్రత్ సులేమాన్(అలై) ప్రభుత్వం మానవులపైనే కాకుండా ఇంకెవరిపై ఉండేది?
4. సబారాణి, సులేమాన్ (అలై) వద్దకు కానుకలు ఎందుకని పంపించింది?
5. ఏ మాటలు, విషయాల్ని చూసి, గ్రహించి సబారాణి ఇస్లాం స్వీకరించింది?
6. హజ్రత్ షుఐబ్(అలై) జాతిలో ఏఏ రుగ్మతలు జనించాయి?
7. హజ్రత్ షుఐబ్(అలై) జాతిపై ఏ రకమైన శిక్ష విరుచుకుపడింది?
8. హజ్రత్ యహ్యా(అలై) ఏ ఐదు విషయాల గురించి ఆదేశించబడింది?
9. హజ్రత్ జకరియ్యా (అలై) అల్లాహ్‌ను ఏమని వేడుకున్నారు?
10. హజ్రత్ షుఐబ్ (అలై) గాధతో మనకు లభించే నీతులేవి?

**ఆ) ఈ క్రింది వాక్యాల్లో సరైన వాక్యంపై ( ✓) గుర్తు, తప్పు వాక్యంపై (X) గుర్తు పెట్టండి**

1. హజ్రత్ సులేమాన్ (అలై), హజ్రత్ దావూద్ (అలై) కుమారుడు ( )
2. హజ్రత్ సులేమాన్ (అలై) ఒక రాజు ( )
3. హజ్రత్ షుఐబ్(అలై) శ్రేష్టుడైన ఉపన్యాసకుడు ( )
4. హజ్రత్ షుఐబ్(అలై) జాతి విగ్రహాల్ని పూజించేవారు ( )
5. హజ్రత్ సులేమాన్(అలై) సబా రాణి కానుకను స్వీకరించారు. ( )
6. హజ్రత్ యహ్యా (అలై)ను క్రైస్తవులు హతమార్చారు ( )

## చేయాల్సిన మరి కొన్ని పనులు

మాయెల్ ఖైర్ ఆబాది గారి పుస్తకం 'ఇబ్రతనాక్ ఖుర్‌ఆనిఖిస్సే' లైబ్రరీ నుండి తీసుకువచ్చి అధ్యయనం చేయండి.



# 19. ఖులఫా-యె-రాషిదీన్

దైవప్రవక్త (సఅసం) అనుచరులలో పది మందికి ఈ ప్రపంచంలోనే స్వర్గ శుభవార్త తెలియజేయబడింది. ఆ పది మందిలో ఆరుగురిని గురించి మనం గతంలో తెలుసుకున్నాం. ఇక నలుగురిని గురించి తెలుసుకోవలసి ఉంది. వారు హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి), హజ్రత్ ఉమర్ (రజి), హజ్రత్ ఉస్మాన్ (రజి), హజ్రత్ అలీ (రజి). ఈ నల్గురు అగ్రశ్రేణికి చెందిన అనుచరులు. ఈ నలుగురే దైవప్రవక్త (సఅసం) తదనంతరం ఆయన వారసులుగా, ఖలీఫాలుగా ఎన్నికయి ఇస్లామీయ రాజ్యాన్ని ఎంతో న్యాయవంతంగా పాలించారు. 1400 సంవత్సరాలు గడచినా ఈనాటికీ ప్రజలు వారిని స్మరించుకుంటూ అలాంటి పరిపాలనా వ్యవస్థ కోసం తపించిపోతున్నారు. ప్రజలు శాంతీ సుఖాలతో జీవించ గలిగే, అలాంటి పాలనా వ్యవస్థను మనం చూడగలిగే రోజులు దేవుడు మళ్ళీ తీసుకువస్తాడని ఆశిద్దాం. ఇప్పుడు మనం ఆ నలుగురు ప్రముఖుల జీవిత విశేషాలను గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాం.

### (1) హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి)

ఆయన అసలు పేరు అబ్దుల్లాహ్. 'అబూబకర్' ఆయన పరిచయ నామం. ప్రియప్రవక్త (సఅసం) ఆయనకు 'సిద్దీఖ్' అనే బిరుదు ఇచ్చారు. సాధారణంగా ఆయన పరిచయ నామంతో లేదా ప్రియప్రవక్త (సఅసం) ఇచ్చిన బిరుదుతో పిలువబడుతున్నారు. ఆయన ప్రియపుత్రిక హజ్రత్ ఆయెషా (రజి). ఆమె దైవప్రవక్త (సఅసం) ప్రియ సతీమణి. హజ్రత్ అబూబకర్ (రజి)తో దైవప్రవక్త (సఅసం)కు చాలా సన్నిహిత సంబంధం ఉంది. దైవప్రవక్త (సఅసం) ఆయన్ని ఎంతగానో అభిమానించేవారు.

ఇస్లాంకు పూర్వం మక్కా ప్రజలలో ఎన్నో చెడులు ఉండేవి. మద్యం సేవించేవారు. జూదం ఆడేవారు. అశ్లీల చేష్టలకు పాల్పడేవారు. దుర్భాషలాడే వారు. హజ్రత్ అబూబకర్ (రజి)లో మాత్రం ఎలాంటి చెడులు లేవు. ఆయన అసలు చెడుల జోలికే పోయేవారు కాదు. బాల్యం నుండే ఎంతో పవిత్రంగా ఉండేవారు. మృదుస్వభావం కలవారు. పేదలకు, వితంతువులకు సహాయపడే వారు. మంచి పనులలో అందరితో సహకరించేవారు. దైవప్రవక్త (సఅసం)తో ఆయనకు బాల్యం నుంచే ప్రగాఢమైన స్నేహసంబంధం ఉండేది. ఇస్లాంకు పూర్వం ఆయన దైవప్రవక్త (సఅసం)తో కలసి వ్యాపార పర్యటనలు కూడా జరిపారు. మహనీయ ముహమ్మద్ (సఅసం) దైవప్రవక్తగా నియమించబడగానే ముందుగా తన దగ్గరి బంధువులలో, సన్నిహిత మిత్రులలో ధర్మప్రచారం ప్రారంభించారు. అప్పుడు పురుషులలో మొట్టమొదట హజ్రత్ అబూబకర్ (రజి) గారే ఇస్లాం స్వీకరించారు.

హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి) మక్కాలో ఉన్నత కుటుంబానికి చెందిన భాగ్యవంతులు. దేవుడు ఆయనకు అన్నివిధాల సౌఖ్యాలు, సౌకర్యాలు ప్రసాదించాడు. ఆయన పెద్ద వ్యాపారవేత్త. ఇస్లాం స్వీకరించిన తరువాత ఆయన ఇస్లాం ప్రచారం కోసమే ఎక్కువ సమయాన్ని వినియోగించడం ప్రారంభించారు. ఈ పని కోసం ఆయన తన ధనాన్ని, ప్రాణాన్ని, మరే విషయాన్నీ ఖాతరు చేసేవారు కాదు. అవిశ్వాసులు

ఆయన్ని రకరకాలుగా వేధించారు. వాటన్నిటినీ ఆయన సంతోషంగా సహిస్తూ ధర్మ ప్రచారం చేసేవారు.

దైవప్రవక్త (సఅసం) పట్ల ప్రేమాభిమానాలు: హజ్రత్ అబూబకర్ (రజి)కు దైవప్రవక్త (సఅసం) పట్ల అపార ప్రేమాభిమానాలు ఉండేవి. దైవప్రవక్త (సఅసం) కూడా ఆయన్ని అమితంగా అభిమానించే వారు. ఇస్లాం ప్రారంభ దశలో ఓ రోజు హజ్రత్ అబూబకర్ (రజి) కాబా గృహంలో నిలబడి ఇస్లాం ధర్మం గురించి ప్రసంగిస్తుంటే అవిశ్వాసులు ఒక్కసారిగా ఆయనపై విరుచుకు పడ్డారు. ఆయన్ని వారు స్పృహ తప్పేటంత దారుణంగా కొట్టారు. తరువాత ఆయన కుటుంబసభ్యులు వచ్చి ఆయన్ని మోసుకెళ్ళారు.

హజ్రత్ అబూబకర్ (రజి) చేసిన ధర్మ ప్రచారం వల్ల చాలా మంది ఇస్లాం స్వీకరించారు. హజ్రత్ ఉస్మాన్ గని (రజి), హజ్రత్ అబ్దుర్ రహ్మాన్ బిన్ అవుఫ్ (రజి), హజ్రత్ జుబైర్ (రజి), హజ్రత్ అబూ ఉబైదా (రజి), హజ్రత్ సాఅద్ బిన్ వక్కాస్ (రజి) మొదలగువారు ఇస్లాం స్వీకరించారు. స్వర్గ శుభవార్త ప్రపంచంలోనే పొందిన పది మంది అదృష్టవంతులలో ఐదుగురు ఆయన ద్వారా ఇస్లాం స్వీకారభాగ్యం పొందినవారే. మక్కా పట్టణంలో బానిసలుగా ఉన్నవారిని వారి యజమానులు రకరకాలుగా హింసించే వారు. హజ్రత్ అబూబకర్(రజి)కు ఆ బానిసలపై జాలికలిగేది. వారి యజమానులకు పెద్ద పెద్ద మొత్తాలు చెల్లించి బానిసల్ని బంధవిముక్తులుగా చేసేవారు.

**వలస (హిజ్రత్) :** హజ్రత్ అబూబకర్ (రజి) చేస్తున్న ధర్మ ప్రచారంతో పాటు, బానిసల్ని విడిపించే ఆయన కార్యకలాపాలను చూసి అవిశ్వాసులు ఆయనను కూడా వేధించడం ప్రారంభించారు. అవిశ్వాసుల దౌర్జన్యాలు హద్దు మీరడంతో ఆయన మదీనా వలస వెళ్లడానికి అనుమతించమని ప్రియప్రవక్త (సఅసం)ను అడిగారు. కాని తొందరపడవద్దని ప్రియప్రవక్త (సఅసం) అన్నారు. ప్రియప్రవక్త (సఅసం) ఆయనను తనతోపాటు తీసుకొని వెళ్ళదలిచారు. అందుచేత ఆయనను ఆపారు. మహాప్రవక్త ముహమ్మద్(సఅసం)కు మక్కా వదలి మదీన వలస పోవాలని దైవాజ్ఞ అయినప్పుడు ఆయన హజ్రత్ అబూబకర్ (రజి)ను తన వెంట తీసుకొని వెళ్ళారు. ఈ విధంగా హజ్రత్ అబూబకర్ (రజి) హిజ్రత్ ప్రయాణంలో ప్రియప్రవక్త (సఅసం) వెంట ఉన్నారు. మదీన వెళ్ళిన తరువాత కూడా ధర్మప్రచారంలో హజ్రత్ అబూబకర్ (రజి) అందరికంటే ముందుండే వారు. ధర్మరక్షణ యుద్ధాలు ప్రారంభమయ్యాక ఆయన ఆ యుద్ధాలన్నిటిలో పాల్గొని అవిశ్వాసులతో వీరోచితంగా పోరాడారు.

**ఖిలాఫత్ :** ప్రియప్రవక్త (సఅసం) అనారోగ్యంగా ఉన్న సమయంలో హజ్రత్ అబూబకర్ (రజి)నే ఆయన ఇమాంగా నమాజులు చేయించమని ఆజ్ఞాపించారు. అందువల్లనే ప్రియప్రవక్త (సఅసం) ప్రపంచాన్ని వీడిన తరువాత ప్రజలు హజ్రత్ అబూబకర్ (రజి)ను ఖలీఫాగా ఎన్నుకున్నారు.

ఖలీఫాగా ఎన్నికయిన తరువాత ఆయన రేయింబవళ్ళు ప్రజాసేవలో గడిపారు. సాధారణ జీవితం గడిపేవారు. అందరి శ్రేయాన్ని అభిలషించేవారు. ఎల్లప్పుడు ఇస్లాం వ్యాప్తి కోసమే ఆలోచించేవారు. ఆయన ఖిలాఫత్ పాలన కొంతకాలం మాత్రమే ఉంది. ఆ కొంతకాలంలోనే ప్రజలు శాంతీసౌఖ్యాలతో జీవించేలా ఆయన సమర్థవంతంగా పరిపాలించారు. ఆలాంటి శాంతివంతమైన జీవితం సాగించే సమర్థవంతమైన పాలనా వ్యవస్థ కావాలని ఈనాడు కూడా ప్రజలు ఆకాంక్షిస్తున్నారు.

**జీవితం:** హజ్రత్ అబూబకర్ (రజి) ఖిలాఫత్ బాధ్యతలు చేపట్టడానికి ముందు వ్యాపారం చేసేవారు. పరిపాలనా బాధ్యతలు పైపడ్డాక ఆయనకు కొందరు ప్రముఖ సహాబీలు ప్రభుత్వ ఖజానా నుండి గౌరవ వేతనం నిర్ణయించారు. అతి స్వల్ప వేతనమయిన ఆ డబ్బుతోనే ఆయన జీవితం గడిపేవారు. చాలా నిరాడంబరంగా ఉండేవారు. ముతక దుస్తులు ధరించేవారు. సాధారణ తిండి తినేవారు. రేయింబవళ్ళు దైవారాధనలో నిమగ్నులయి ఉండేవారు. తరచుగా ఉపవాసం ఉండేవారు. ఖుర్ఆన్ పఠనం అంటే ఆయనకు ఎంతో ఇష్టం. మక్కాలో ఉన్నప్పుడు ఆయన ఖుర్ఆన్ పఠిస్తుంటే విని చాలామంది ముస్లింలయిపోయారు. నమాజులో ఖుర్ఆన్ పఠిస్తూ ఎంతో దుఃఖించేవారు. కన్నీటితో ఆయన గడ్డం తడిసిపోయేది.

హిజ్రీ శకం 13వ సంవత్సరం, జమాదిల్ ఊలా మాసం 21వ తేదీన హజ్రత్ అబూబకర్ (రజి) పరమపదించారు. జీవితంలోనే ప్రియప్రవక్త (సఅసం) ఆయనకిచ్చిన శుభవార్త ప్రకారం, తన శాశ్వత నిలయమయిన స్వర్గధామం చేరుకున్నారు. అల్లాహ్ ఆయన పట్ల ప్రసన్నుడయ్యాడు. ఆయన అల్లాహ్ పట్ల సంతుష్టులయ్యారు.

అల్లాహ్ మనలను కూడా ఆయన అడుగుజాడల్లో నడచుకునే భాగ్యం ప్రసాదించి స్వర్గప్రాప్తి కలిగించుగాక! ఆమీన్.

### (2) హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి)

హజ్రత్ ఉమర్ (రజి), ప్రియప్రవక్త (సఅసం)కు సమీప బంధువు. ఆయన తన ప్రియ కుమార్తె హజ్రత్ హఫ్సా (రజి)ను దైవప్రవక్త (సఅసం)కిచ్చి వివాహం చేశారు. హజ్రత్ ఉమర్ (రజి) తండ్రి పేరు ఖత్తాబ్. ఆయన కుటుంబం అరేబియాలో గౌరవనీయమైన ఉన్నత కుటుంబంగా పరిగణించబడేది.

హజ్రత్ ఉమర్ (రజి) ధైర్యసాహసాలు గల గొప్ప బలశాలి. మక్కా వాసులపై ఆయన ప్రభావం ఉండేది. ఖురైష్ నాయకులలో ఆయన ఒకరు. నాయకునికి ఉండాల్సిన లక్షణాలన్నీ ఆయనలో కన్పించేవి. మల్ల యుద్ధం, గుఱ్రపు స్వారీ, విలువిద్యల్లో ఆయన అరేబియాలో ప్రఖ్యాతిగాంచారు. ఆయన బలపరాక్రమాలు అరేబియాలో వేనోళ్ళ శ్లాఘించబడేవి.

**ఇస్లాం స్వీకారం :** ఆయన ముస్లిం కావడానికి ముందు దైవప్రవక్త (సఅసం)కు, ఆయన అనుచరులకు బద్ధ శత్రువుగా ఉండేవారు. ఆయన ఇస్లాం స్వీకరణ కోసం ప్రియప్రవక్త (సఅసం) తరచుగా దైవాన్ని ప్రార్థించేవారు. చివరికి అల్లాహ్ అనుగ్రహం వల్ల హజ్రత్ ఉమర్ (రజి) ఇస్లాం స్వీకరించారు. దానికి ముందు ఆయన ఓ రోజు తీవ్రమైన విరోధభావంతో దైవప్రవక్త (సఅసం)ను హతమార్చడానికి బయలుదేరారు. దారిలో అంతకుముందే తన చెల్లెలు, బావ ఇస్లాం స్వీకరించారని తెలియగానే ఆయన మొదట చెల్లెలు హజ్రత్ ఫాతిమా (రజి) ఇంటికి వెళ్ళారు. కాని అక్కడ కొన్ని ఖుర్ఆన్ సూక్తులు వినగానే ఆయన హృదయజగత్తు మారిపోయింది. దేవుడు ఆయనకు విశ్వాస భాగ్యం ప్రసాదించాడు. వెంటనే ఆయన దైవప్రవక్త (సఅసం) సన్నిధికి పోయి ముస్లిం అయిపోయారు. ఆయన ఇస్లాం స్వీకార ప్రకటన

చేయగానే దైవప్రవక్త (సఅసం), ఆయన అనుచరులు ఎంతో సంతోషించారు. ఆ రోజు నుంచి ముస్లింలు కాబా గృహంలో అందరి ముందు బహిరంగంగా నమాజు చేయడం ప్రారంభించారు.

**హిజ్రత్ :** మదీనాకు వలస వెళ్ళాలని ప్రకటన వెలువడగానే ముస్లింలు రహస్యంగా బయలుదేరి బిక్కుబిక్కుమంటూ మదీన చేరుకోసాగారు. అయితే హజ్రత్ ఉమర్ (రజి) మాత్రం అలా రహస్యంగా భయపడుతూ బయలుదేరలేదు. ఆయన కొంత సామగ్రి వెంట తీసుకొని, నడుముకు కరవాలం వ్రేలాడదీసి, విల్లు బాణాలు ధరించి నిర్భయంగా బయలుదేరారు. అంతేకాదు, "తమ పిల్లలను అనాథలుగా, భార్యలను వితంతువులుగా చేయదలచుకున్నవారు ఎవరైనా సరే ఉమర్‌ని ఎదుర్కోవడానికి ముందుకు రావచ్చు" అని ప్రకటన చేస్తూ మరీ వెళ్లారు.

**చెడులను అసహ్యించుకునేవారు :** చెడు అంటే హజ్రత్ ఉమర్ (రజి)కు గిట్టదు. ఎవరైనా చెడ్డ పనులు చేస్తుంటే చూసి సహించేవారు కాదు. పాపపు పనులు కంటపడ్డాయంటే మండిపడేవారు. ప్రియప్రవక్త (సఅసం) ఒకసారి హజ్రత్ ఉమర్ (రజి)ని గురించి ప్రస్తావిస్తూ, "ఉమర్ నీడ కనపడినా చాలు షైతాను పారిపోతాడు. అందువల్లనే ప్రియప్రవక్త (సఅసం) హజ్రత్ ఉమర్ (రజి)కు 'ఫారూఖ్' అనే బిరుదునిచ్చారు. 'ఫారూఖ్' అంటే మంచి చెడులను విచక్షణ చేసే వ్యక్తి అన్న మాట. మంచిని పెంచే, చెడును రూపుమాపే పనులంటే హజ్రత్ ఉమర్ (రజి)కు ఎంతో ఇష్టం.

**ఖిలాఫత్:** హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి) తరువాత ముస్లిం ప్రముఖులు సలహాసంప్రదింపులు జరిపి హజ్రత్ ఉమర్ (రజి)ని ఖలీఫాగా ఎన్నుకున్నారు. ఆయనగారి ఖిలాఫత్ పాలనాకాలం ప్రపంచ మున్నంత వరకు పాలకులకు, ప్రజలకు ఆదర్శంగా ఉంటుంది. ఖలీఫా అయిన వెంటనే ఆయన ఉపన్య సిస్తూ చివరిలో, "ఓ అల్లాహ్! నేను కఠిన స్వభావం కలవాడను. నా హృదయాన్ని మృదువుగా చెయ్యి. నా ప్రియమైన గ్రంథం ఖుర్ఆన్ పట్ల నాకు సదవగాహన కలిగించు" అని ప్రార్థించారు. అల్లాహ్ ఆయన ప్రార్థనను ఆలకించాడు. హజ్రత్ ఉమర్ (రజి) మృదు స్వభావి, దయార్ద్ర హృదయులు అయ్యారు. ఆయన ప్రజాసేవ కోసం ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండేవారు. ఎవరైనా కష్టాలలో ఉంటే చూసి తల్లడిల్లి పోయేవారు. రాత్రి వేళల్లో మారువేషం వేసుకొని గస్తీ తిరుగుతూ ప్రజల కష్టసుఖాలను గురించి తెలుసుకునే వారు. ఆపదలలో ఉన్నవారిని తక్షణమే ఆదుకునేవారు. "జాతి నాయకుడు జాతి సేవకుడవుతాడు" అనేవారు ఆయన. ఆయన పాలనా కాలంలో సర్వత్రా శాంతిభద్రతలు నెలకొని ఉండేవి. ప్రజలు సుఖశాంతులతో మనుగడ సాగించేవారు. పేదలు, ధనికులు, బలహీనులు, బలవంతులు- అందరూ ప్రశాంతంగా జీవించేవారు. దాంతో పాటు ఠీవి, దర్పాలతో కూడిన అసాధారణ వ్యక్తిత్వం ఆయనది. అందుకే పెద్ద పెద్ద రాజ్యాధినేతలు సైతం ఆయన పేరు వింటేనే వణికిపోయేవారు. గొప్ప గొప్ప పహిల్వానులు కూడా ఆయన దగ్గర ఎంతో భయపడుతూ మాట్లాడేవారు.

**పరిపాలనా దక్షత :** హజ్రత్ ఉమర్ (రజి) ఖిలాఫత్ బాధ్యతలు స్వీకరించాక ఇస్లామీయ రాజ్యం విస్తరించసాగింది. కొన్నేండ్లలోనే అనేక దేశాలు ఇస్లాం పరిపాలన క్రిందికి వచ్చాయి. సిరియా, ఇరాఖ్,

అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) గారిని నమాజు చేయించమని చెబుతూ అక్కడే కుప్పకూలి పోయారు. ఆ దుర్మార్గుడు మాత్రం తక్షణమే అక్కడ్నుంచి పారిపోయాడు. అయితే పారిపోతూ దారిలోనే అతను ఆత్మహత్య చేసుకున్నాడు. హిజ్రీ ఇరవై నాల్గవ సంవత్సరం హజ్రత్ ఉమర్ (రజి) కాలధర్మం చెందారు. ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్. హజ్రత్ సుహైబ్ రూమి (రజి) ఆయన భౌతిక కాయానికి జనాజా నమాజు చేశారు. ప్రియప్రవక్త (సఅసం) సమాధి ప్రక్కన ఆయన్ని ఖననం చేయడం జరిగింది.

**(3) హజ్రత్ ఉస్మాన్ గని (రజి)**

పేరు ఉస్మాన్ (రజి). తండ్రి పేరు అఫ్ఫాన్. గౌరవనీయమైన అరబ్ కుటుంబంలో జన్మించారు. అల్లాహ్ ఆయనకు అపార సిరిసంపదలు ఇచ్చాడు. అయితే ఇస్లాం స్వీకరించాక సమస్తం దైవమార్గంలో ధారపోశారు.

**బిరుదు:** ఆయన బిరుదు జిన్నూరైన్. అంటే రెండు జ్యోతుల వ్యక్తి. దైవప్రవక్త (సఅసం) తన ప్రియపుత్రిక హజ్రత్ రుఖియా (రజి)ను ఆయనకిచ్చి వివాహం చేశారు. కాని మదీనా వలస వెళ్ళాక హజ్రత్ రుఖియా (రజి) చనిపోయారు. సతీవియోగంతో హజ్రత్ ఉస్మాన్ (రజి) చాలా క్రుంగిపోయారు. సతీమణి మరణం ఒకవైపు బాధపెట్టగా మరోవైపు ప్రియప్రవక్త (సఅసం)తో బంధుత్వం తెగిపోయిందనే మరో బాధ కలిగింది. ప్రియప్రవక్త (సఅసం) ఆయనను ఓదార్చారు. ఆయన తన మరో పుత్రిక హజ్రత్ కుల్సూమ్ (రజి)ను ఉస్మాన్ (రజి)కిచ్చి వివాహం చేశారు. ఈ కారణంగానే హజ్రత్ ఉస్మాన్ (రజి)కు 'జిన్నూరైన్' అనే బిరుదు వచ్చింది.

బాల్యం నుండే హజ్రత్ ఉస్మాన్ (రజి) మంచి నీతినడవడికలు కలిగి ఉండేవారు. ఎంతో బిడియస్తులు. బిడియం పుట్టకతో వచ్చిన గుణం. అశ్లీల చేష్టలు, అశ్లీల విషయాల సమీపానికి కూడా పొయ్యేవారుకాదు. సజ్జనులతో కలసి ఉండేవారు. హజ్రత్ అబూబకర్ (రజి) అంటే ఆయనకెంతో ఇష్టం. అందుకే ఆయన ఇస్లాం గురించి నచ్చుజెప్పగానే హజ్రత్ ఉస్మాన్ (రజి) మనస్ఫూర్తిగా ఇస్లాం స్వీకరించి ముస్లిం అయ్యారు.

**హిజ్రత్ (వలస):** ఆయన రెండుసార్లు హిజ్రత్ చేశారు. మొదట అబిసీనియా దేశానికి వెళ్ళారు. కొన్నాళ్ళ తరువాత మక్కా తిరిగి వచ్చారు. ఆ తరువాత మళ్ళీ మదీనాకు వలసపోయి అక్కడే స్థిరపడిపోయారు. మదీనాలో ఉన్నప్పుడు ఇస్లామీయ యుద్ధాలు ప్రారంభమయ్యాయి. ఆయన ఆ సమరాలన్నిటిలో పాల్గొన్నారు. ఒక్క బదర్ యుద్ధ సమయంలో హజ్రత్ రుఖియా (రజి) ఆరోగ్యం బాగాలేనందున ఆ యుద్ధంలో పాల్గొనలేదు. అందుకు ఆయన ఎంతగానో బాధపడ్డారు కూడా.

**ఖిలాఫత్:** హజ్రత్ ఉమర్ (రజి) తరువాత ఖలీఫాను ఎన్నుకోవడానికి హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ అవుఫ్ ప్రజాభిప్రాయం సేకరించి హజ్రత్ ఉస్మాన్ (రజి)ను ఖలీఫాగా చేశారు. హజ్రత్ ఉస్మాన్ (రజి) కాలంలో ముస్లింల జనాభా విపరీతంగా పెరిగింది. మంచి పనులకు ప్రోత్సాహం, సంక్షేమ పనులకు సహాయం ఇవ్వబడింది. సర్కారు ఖజానా కూడా బాగా పెరిగింది. ఆ కాలంలో ముస్లింలు ఎంతో సుఖసంతోషాలతో ఉన్నారు.

ఈజిప్టు, ఈరాన్ మొదలగు దేశాలలో ఇస్లామీయ ప్రభుత్వాలు నెలకొన్నాయి. హజ్రత్ ఉమర్ (రజి) పరిపాలన చాలా చక్కగా చేయసాగారు. దేశాభివృద్ధి కోసం సరిక్రొత్త ఆలోచనలు చేస్తూ వినూత్న పద్ధతులు ప్రవేశపెట్టారు. న్యాయస్థానాలు స్థాపించారు. తీర్పు చేసేందుకు ఖాజీలను నియమించారు. మిలటరీ, పోలీసు వ్యవస్థలను స్థాపించారు. రక్షణకు కోటలు కట్టించారు. అనాథలు, వితంతువులు, నిరాశ్రయుల కోసం సంరక్షణ ఏర్పాట్లు చేశారు. అనేక చోట్ల చిన్న, పెద్ద పాఠశాలలు స్థాపించారు. ఉపాధ్యాయుల కోసం జీతాలు నిర్ణయించారు. ముస్లిమేతర బలహీనుల కోసం ప్రభుత్వ ఖజానా నుండి పింఛన్లు మంజూరు చేశారు. నీటిపారుదల కోసం కాలువలు, చెరువులు త్రవ్వించారు.

ఆయన కాలంలోనే తరావీహ్ నమాజులు సామూహికంగా చేసే సంప్రదాయం మొదలయింది. ఇస్లామీయ ఖలీఫా కోసం "అమీరుల్ మోమినీన్" అనే బిరుదు ఇవ్వబడింది. ఐదు పెద్ద పట్టణాలు అందంగా, సక్రమంగా ప్లాను ప్రకారం నిర్మించబడ్డాయి. ఈ ఐదు పట్టణాలు: బస్రా, కూఫా, ఫిస్తాత్, మూసిల్ మరియు జీజా. ప్రభుత్వ ఖజానా (బైతుల్‌మాల్)కు శాశ్వత రూప కల్పనలు చేయబడ్డాయి. జాతీయ రహదారులలో, ముఖ్యమైన పట్టణాలలో ప్రయాణీకుల సౌకర్యార్థం విడిది గృహాలు కట్టించబడ్డాయి. నీటి వసతి కోసం బావులు త్రవ్వించబడ్డాయి. ఆయన పరిపాలన ప్రజలకు స్వర్గతుల్యంగా మారింది. ఈనాడు కూడా ప్రజలు ఆ కాలాన్ని స్మరిస్తుంటారు. భారత జాతిపిత మహాత్మా గాంధీ కూడా మన మంత్రివర్యులకు ఆయన ఆదర్శ పరిపాలనను ముందుంచు కొని ఆయన అడుగుజాడల్లో నడవాలని నొక్కి చెప్పారు.

**పరిశుద్ధ జీవితం:** ఆయన జీవితం మచ్చలేని పరిశుద్ధ జీవితం. ఆయన నిరాడంబర జీవితమే గడిపేవారు. అతుకులు వేసిన దుస్తులు తొడిగేవారు. సాధారణ భోజనం చేసేవారు. అందరితోపాటు కలిసిమెలసి ఉండేవారు. సహచరుల సాధకబాధల పట్ల శ్రద్ధ చూపేవారు. రాత్రులలో నిద్రమాని నమాజులు చేసేవారు. ఎల్లప్పుడూ అల్లాహ్‌కు భయపడుతుండేవారు. ఖుర్‌ఆన్ చదువుతూ ఒక్కోసారి కళ్ళు వాచిపోయేటంతగా దుఃఖించేవారు.

**ఖుర్‌ఆన్ షరీఫ్ సమావేశాలు:** ఖుర్‌ఆన్ బోధనలు నేర్చుకోవడానికి, నేర్పడానికి ఖుర్‌ఆన్ సదస్సు ఒకటి ఏర్పాటు చేశారు. ఈ సదస్సులో గొప్ప గొప్ప 'సహాబీ'లు పాల్గొనేవారు. ఖుర్‌ఆన్ అర్థంచేసుకోవడానికి, ఇతరులకు బోధపరచడానికి వారు కృషిచేసేవారు. ఒక్కొక్క సూక్తిపై పరిశోధన జరిపేవారు. ఈ విధంగా వారు పరస్పర అధ్యయనం, పరిశోధనలతో సామాన్య ప్రజలలో ఖుర్‌ఆన్ పట్ల ఆసక్తి కలిగించేవారు.

**అమరగతి:** మదీనాలో ఫేరోజ్ అనే ఓ దౌర్భాగ్యుడైన ఫార్సీ బానిస ఉండేవాడు. అతను ఒక చిన్న విషయంలో హజ్రత్ ఉమర్ (రజి)పై కక్ష పెంచుకున్నాడు. ఒకరోజు తెల్లవారుజామున అతను ప్రతీకారంతో రగిలిపోతూ మస్జిదుకు వెళ్ళాడు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) మస్జిదులో నమాజు చేయించడానికి ముసల్లా మీద నిలబడ్డారు. అంతే, ఆయన అలా నిలబడ్డారో లేదో ఫేరోజ్ హఠాత్తుగా ఆయనపై కత్తితో దాడిచేసి ఆరు పోట్లు పొడిచాడు. హజ్రత్ ఉమర్ (రజి) వెంటనే ముసల్లాపై నుంచి పక్కకు తొలిగి

**నబవీ మస్జిద్ నిర్మాణం:** ముస్లింల సంఖ్య పెరిగింది. నబవీ మస్జిద్‌లో సామూహిక నమాజుల కోసం స్థలం సరిపోలేదు. అందుచేత హజ్రత్ ఉస్మాన్ (రజి) మస్జిద్ చుట్టుప్రక్కల ఉన్న స్థలాన్ని స్వంత డబ్బుతో కొని దాన్ని పునర్నిర్మించారు. ఎంతో అద్భుతంగా, పటిష్ఠంగా కట్టించారు. అంతేకాకుండా దేశంలో అనేక చోట్ల రోడ్లు, వంతెనలు, మస్జిద్‌లు, ప్రయాణీకుల కోసం వసతి గృహాలు నిర్మించారు. ఖైబరు ప్రాంతం నుండి వచ్చే వరదల ప్రమాదాన్ని నిరోధించడానికి ఆనకట్టలు కూడా కట్టించారు.

**ఖుర్‌ఆన్ ప్రచురణ:** అన్నిటికంటే ఇస్లాం ప్రచారం ఆయన ప్రధాన ధ్యేయంగా ఉండేది. ఆయన స్వయంగా ప్రజల వద్దకు వెళ్ళి ఇస్లాంలో ఉన్న మంచిని గురించి తెలిపేవారు. ఈ విధంగా ముస్లింల సంఖ్య నానాటికి పెరగ సాగింది. ఆయన పాలనా కాలంలో ఇస్లామీయ రాజ్యం సుదూర ప్రాంతాలకు విస్తరించింది. అరబ్బేతరులు కూడా అనేకమంది ఇస్లాం స్వీకరించారు. ఖుర్‌ఆన్ హజ్రత్ అబూబకర్(రజి) పాలనా కాలంలోనే వ్రాయబడింది. కాని చదివే తీరు ఒకే విధంగా లేదు. ప్రతి తెగవారు తమదైన రీతిలో చదివేవారు. హజ్రత్ ఉస్మాన్ (రజి) ప్రముఖ సహాబాల సలహాలను తీసుకొని ఖుర్‌ఆన్ చదివే పద్ధతి ఒకదాన్ని నిర్ణయించారు. ఇలా దివ్యఖుర్‌ఆన్‌ని ఖురైష్ తెగ ఉచ్చారణలో వ్రాయించి ప్రజలందరూ ఒకే పఠన విధానం అనుసరించడానికి దాన్ని దేశమంతటా వ్యాపింపజేశారు.

**నిరాడంబర జీవితం:** ఇస్లాం స్వీకరించకముందు హజ్రత్ ఉస్మాన్ గని (రజి) ఎంతో ఆడంబరమైన జీవితం గడిపేవారు. దైవప్రవక్త (సఅసం)ను విశ్వసించగానే ఆయన ఆడంబరాలకు, భోగభాగ్యాలకు స్వస్తి చెప్పి పేదరికపు జీవితం గడపడం ప్రారంభించారు. ఆయన అరేబియాలో అందరికంటే గొప్ప వ్యాపారి. అల్లాహ్ ఆయనకు ఇవ్వని భాగ్యం అంటూలేదు. వేలాది సంఖ్యలో సేవకులు ఉండేవారు. కాని ఆయన తన పని తానే చేసుకునేవారు. బంధువుల పట్ల ఆప్యాయతతో మెలిగేవారు. బీదలకు, అవసరమున్న వారికి అన్ని విధాల సహకరించేవారు. కనికరం చూపడం, దానధర్మాలు చేయడం ఆయన ప్రత్యేకతలు. ఒకసారి అరేబియాలో గొప్ప క్షామం వచ్చింది. ప్రజలు ఆకలితో అలమ టించసాగారు. ఆ రోజుల్లో ఆయనగారి వర్తక బిడారు ఒకటి 200 ఒంటెల మీద ధాన్యం తీసుకొని విదేశం నుండి వచ్చింది. దాన్ని చూడగానే మదీనా వర్తకులు పరుగు పరుగున వచ్చి అధిక ధరలపై ధాన్యం కొనడానికి పోటీపడ్డారు. కాని హజ్రత్ ఉస్మాన్ గని(రజి) అందుకు నిరాకరిస్తూ, "నేను అందరికంటే ఎక్కువ లాభం ఇస్తానని వాగ్దానం చేసే వానికి మాత్రమే ఈ ధాన్యం అమ్ముతాను. అతని వాగ్దానం ఎన్నటికీ అబద్ధం కాజాలదు" అని చెప్పారు. ఆ తరువాత వెంటనే ఆయన ధాన్యాన్ని దైవమార్గంలో దానం చేస్తూ బీదసాదలకు ఉచితంగా పంచిపెట్టారు. హజ్రత్ ఉస్మాన్ (రజి) ఎంతో బిడియం కలవారు. తలుపులు మూసిన గదిలో కూడా లుంగీ కట్టుకొని స్నానం చేసేవారు. ప్రియప్రవక్త (సఅసం) ఈ విషయంలో ఆయన్ని ప్రశంసిస్తూ, "దైవదూతలు కూడ హజ్రత్ ఉస్మాన్ (రజి)ని చూసి సిగ్గుపడతారు" అని చెప్పారు.

**అమరగతి:** హజ్రత్ ఉస్మాన్ (రజి) పాలనలో మొదటి ఆరు సంవత్సరాల వరకు దేశంలో శాంతిభద్రతలు వెల్లివిరిశాయి. కాని ఆ తరువాత దేశంలో అనేక చోట్ల కుట్రలు, విద్రోహ చర్యలు మొదలయ్యాయి. కొందరు వ్యక్తులు ఉస్మాన్ (రజి) లాంటి పుణ్యాత్ముడికి విరోధులైపోయారు. హజ్రత్ ఉస్మాన్ (రజి)

తలచుకుంటే ఒకేఒక సైగతో ఆ విద్రోహులను అంతమొందించేవారు. కాని ఆయన ప్రజలలో రక్తపాతం జరిపించడానికి ఇష్టపడలేదు. దాని పర్యవసానంగా ఒకరోజు ఆ దుర్మార్గులు ఆయన ఇంటిని చుట్టుముట్టారు. ప్రహరీ గోడ దూకి ఇంట్లోకి చొరబడ్డారు. ఆ సమయంలో హజ్రత్ ఉస్మాన్ (రజి) కూర్చొని ఖుర్ఆన్ పారాయణం చేస్తున్నారు. దుండగులు ఒక్కసారిగా దూసుకువచ్చి కత్తులతో ఆయనపై దాడిచేశారు. అది శుక్రవారం అసర్ వేళ. హజ్రత్ ఉస్మాన్ (రజి) ఖుర్ఆన్ పఠిస్తూ, "మీకు సహాయం చేయడానికి అల్లాహ్ ఒక్కడే చాలు. ఆయన సర్వం వినేవాడు, తెలిసినవాడు" అనే సూక్తి దగ్గరకు చేరుకున్నారు. అంతే ఆ తరువాత ఆయన రక్తసిక్తమయి నేలకొరిగారు. ఖుర్ఆన్ గ్రంథంపై కూడా నెత్తుటి చుక్కలు పడ్డాయి. "ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్".

**(4) హజ్రత్ అలీ ముర్తుజా (రజి)**

పేరు అలీ (రజి). అబూ తురాబ్ అనేది ఆయన కునియత్. 'హైదర్' ఆయన బిరుదు. తల్లి పేరు హజ్రత్ ఫాతిమా, తండ్రి పేరు అబూతాలిబ్. అబూతాలిబ్ దైవప్రవక్త (సఅసం) పెదనాన్న. అబ్దుల్ ముత్తలిబ్ చనిపోయాక అబూతాలిబే మన ప్రియప్రవక్త(సఅసం)ను పెంచారు. కఠినాతికఠిన సమయాలలో కూడా ఆయన మన ప్రియప్రవక్త (సఅసం)ను ఏకాకిగా వదలిపెట్టలేదు. ఆయన జీవితకాలంలో శత్రువులు దైవప్రవక్త (సఅసం)ను వేధించడానికి వెనుకాడేవారు. హజ్రత్ అలీ (రజి) తల్లి హజ్రత్ ఫాతిమా ఇస్లాం స్వీకరించి ముస్లిం అయ్యారు. తరువాత మదీనాకు వలస కూడా పోయారు. మదీనాలోనే ఆమె చనిపోయారు. కఫన్ కోసం దైవప్రవక్త (సఅసం) ఆమెకు తన చొక్కా కూడా ఇచ్చారు.

హజ్రత్ అలీ (రజి) బాల్యం నుండే దైవప్రవక్త (సఅసం) సంరక్షణలో పెరిగారు. దైవప్రవక్త(సఅసం)కు ఆయన మీద ఎనలేని ప్రేమ ఉండేది. హజ్రత్ అలీ (రజి) కూడా దైవప్రవక్త (సఅసం)ను ప్రాణప్రదంగా అభిమానిస్తూ ఆయనకు సేవలు చేసేవారు. ఆయనకు దేవుడు ఇస్లాం ప్రారంభ రోజుల్లోనే విశ్వాస భాగ్యం ప్రసాదించాడు. పిల్లలలో హజ్రత్ అలీ (రజి)యే మొట్టమొదట ఇస్లాం స్వీకరించారు. దైవప్రవక్త (సఅసం) ఆయన్ని ఎంతగానో అభిమానించేవారు. ప్రియప్రవక్త (సఅసం)కు తన పట్ల ఉన్న ఈ అసాధారణ ప్రేమాభిమానాల వల్లనే హజ్రత్ అలీ (రజి) ఎన్ని కష్టాలనైనా ఎదుర్కోవడానికి సిద్ధపడేవారు.

**హిజ్రత్:** ముస్లింలను మదీన పట్టణానికి వలసపోవాలని ఆజ్ఞ వచ్చినప్పుడు అనేకమంది ముస్లింలు మక్కా వదలి మదీనా వెళ్ళిపోయారు. చివర్లో దైవప్రవక్త (సఅసం)తో పాటు హజ్రత్ అబూబకర్ (రజి), హజ్రత్ అలీ (రజి) మాత్రమే మిగిలిపోయారు.

అల్లాహ్ నుండి దైవప్రవక్త (సఅసం)కు కూడా హిజ్రత్ ఆదేశం వచ్చింది. ఆ రోజు రాత్రే శత్రువులు దైవప్రవక్త (సఅసం)ను హతమార్చడానికి పన్నాగం పన్ని ఆయన ఇంటిని చుట్టుముట్టారు. అయితే దైవప్రవక్త (సఅసం) తాను పడుకునే పడక మీద హజ్రత్ అలీ (రజి)ని పడుకోబెట్టి హజ్రత్ అబూబకర్ (రజి)ని తీసుకొని రహస్యంగా మక్కా నుండి మదీనా వైపు బయలుదేరారు.

మక్కా అవిశ్వాసులు దైవప్రవక్త (సఅసం)కు బద్ధ విరోధులయినప్పటికీ ఆయన నిజాయితీ పట్ల వారికి ఎంతో నమ్మకం ఉండేది. అందుచేత వారు తమ ధనకనక వస్తువులు ఆయన దగ్గర దాచిపెట్టుకునేవారు. వాటిని తిరిగి సంబంధిత వ్యక్తులకు అప్పగించడానికే దైవప్రవక్త (సఅసం) తన ఇంట్లో హజ్రత్ అలీ (రజి)ని వదలి వెళ్ళారు. హజ్రత్ అలీ (రజి) తన ప్రాణాన్ని సైతం ఖాతరు చేయకుండా దైవప్రవక్త (సఅసం) పడక మీద దుప్పటి కప్పుకొని పడుకున్నారు. తరువాత ఎవరి వస్తువులు వారికి అప్పగించి రెండు మూడు రోజుల తరువాత బయలుదేరి దైవప్రవక్త (సఅసం)ను కలుసుకున్నారు.

**ఇస్లాం రక్షణ యుద్ధాలు:** మదీనా చేరిన తరువాత జరిగిన ఇస్లాం రక్షణ యుద్ధాలన్నిటిలో హజ్రత్ అలి (రజి) పాల్గొన్నారు. బదర్ యుద్ధంలో అవిశ్వాసుల నాయకులు షైబా, వలీద్‌లు ముస్లింలను సవాలు చేసినప్పుడు హజ్రత్ అలీ(రజి) ముందుకొచ్చి వారిద్దరినీ హతమార్చారు. ఖైబర్ యుద్ధంలో యూదుల కోటలను ముట్టడించి వాటిని వశపరచుకోవడంలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. ఇతర యుద్ధాలలో కూడా ఆయన తన ప్రతిభాపరాక్రమాలను ప్రదర్శించారు.

**వివాహం:** బదర్ యుద్ధం తరువాత దైవప్రవక్త (సఅసం) హజ్రత్ అలీ (రజి)కి తన ప్రియ కుమార్తె హజ్రత్ ఫాతిమా (రజి)ను ఇచ్చి వివాహం చేశారు. ఆయన స్వయంగా నికాహ్ ప్రసంగం చేసి వివాహం జరిపించారు. హజ్రత్ ఫాతిమా (రజి) సంతతి పరంపర ముందుకు కొనసాగింది. వీరినే సయ్యిద్ లేక సాదాత్ అంటారు.

**తబూక్ దండయాత్ర:** హిజ్రీ శకం 9వ సంవత్సరం దైవప్రవక్త (సఅసం) తబూక్ దండయాత్రకు బయలుదేరినప్పుడు ఆయన కుటుంబ రక్షణ కోసం హజ్రత్ అలీ (రజి)ని మదీనాలో విడిచివెళ్ళారు. ఆ సమయంలో ఆయన (సఅసం) మాట్లాడుతూ, "అలీ! మూసా (అలై)కు హారూన్ (అలై) ఎలాంటి వారో నీవు నాకు అలాంటి వాడవే" అన్నారు.

**ఖిలాఫత్:** హజ్రత్ ఉస్మాన్ (రజి) అమరగతులయిన తరువాత ముహాజిర్, అన్సార్ ముస్లింలు హజ్రత్ అలీ (రజి)ని ఖలీఫాగా నియమించడానికి ఎంతో పట్టుబట్టారు. చివరికి జిల్‌హజ్జ నెలలో సోమవారం రోజున మస్జిదె నబవీలో వారు హజ్రత్ అలీ(రజి)ని ఖలీఫాగా ఆమోదిస్తూ ఆయన చేతితో చేయి కలిపి శపథం చేశారు. హజ్రత్ అలీ (రజి) ఖిలాఫత్ పాలన అయిదేండ్ల దాకా సాగింది. అయితే దేశం నలుమూలలా అల్లర్లు, అలజడులు, అంతర్యుద్ధాలు చెలరేగుతుండేవి. కపటులు, దుర్మార్గులు సృష్టించిన అపోహలు, వదంతుల కారణంగా ముస్లింలు పరస్పరం కత్తులు దూసుకున్నారు. హజ్రత్ అలీ (రజి) ఈ యుద్ధాలను నిరోధించడానికి ఎంతగానో కృషి చేశారు. కాని యుద్ధజ్వాలలు సమసిపోయే సూచనలు కన్పించలేదు. ఈ అంతర్ యుద్ధాలలో ముస్లింలు చాలామంది చనిపోయారు. అపారమైన నష్టం జరిగింది.

**పేద జీవితం:** హజ్రత్ అలీ (రజి) పేద జీవితం గడిపారు. ప్రాపంచిక సంపదల వైపు ఆయన ఏనాడూ మొగ్గలేదు. వివాహం రోజు లభించిన కొద్దిపాటి ఇంటి సామాగ్రిని ఆయన ఏమాత్రం పెంచలేదు. ఆయన ఎల్లప్పుడూ జీవనోపాధి కోసం కష్టపడి పనిచేసేవారు. కూలి పని కూడా చేసేవారు. ఇంట్లో

పనులు కూడా చేసేవారు. నీళ్ళు తోడి తెచ్చేవారు. ఇంట్లో కావలసిన సరుకులు తెచ్చేవారు. ఆయన శ్రీమతి హజ్రత్ ఫాతిమా (రజి) కూడా పిండి విసరడం తదితర ఇంటి పనులు స్వయంగా చేసుకునేవారు. చాలా నిరాడంబరంగా ఉండేవారు. ముతక దుస్తులు ధరించేవారు. ఒక్కొక్కసారి అనేక పూటలు పస్తులుండేవారు. భోజనం కొద్దిగా ఉన్నప్పుడు దాన్ని ఇతరులకు పెట్టి తాను పస్తుండేవారు.

**అమరగతి:** హజ్రత్ అలీ (రజి) పుణ్యాత్ముడయినప్పటికీ లోకం ఆయన్ని ప్రశాంతంగా ఉండనివ్వలేదు. దుర్మార్గులు ఆయన ప్రాణం తీయడానికే ఒడిగట్టారు. ఓ రోజు తెల్లవారుజామున ఫజర్ నమాజు చేస్తుంటే ఇబ్నె ముల్జమ్ అనే దుర్మార్గుడు ఖడ్గంతో ఆయనపై ఒక్క వేటు వేసి పారిపోయాడు. అయితే జనం అతడ్ని పట్టుకొని బంధించారు. హజ్రత్ అలీ (రజి) ఒక్క వేటుకే తల్లడిల్లిపోయారు. కారణం విషం పూసిన ఖడ్గంతో వేటు వేశాడు దుర్మార్గుడు. దాంతో ఆ విషం దేహం నిండా వ్యాపించింది. చివరికి రమజాన్ నెల ఇరవయ్యో తేది, శుక్రవారం రాత్రి హజ్రత్ అలీ (రజి) ఇహలోకం నుంచి శాశ్వతంగా వీడిపోయారు. "ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్" (మనమంతా దేవుని సొత్తే. చివరికి మనం దేవుని వైపునకే తిరిగి పోవలసిన వాళ్ళం.)

## హజ్రత్ అలీ (రజి) ప్రత్యేకతలు

1. ప్రియప్రవక్త (సఅసం) ఇలా అన్నారు: "హజ్రత్ మూసా (అలై)కు హజ్రత్ హారూన్ (అలై) ఎలాంటివారో అలీ నాకు అలాంటి వాడే".
2. దైవప్రవక్త (సఅసం) ఖైబర్ యుద్ధ పతాకాన్ని హజ్రత్ అలీ (రజి) చేతికిచ్చారు. అప్పుడు అల్లాహ్ ముస్లింలకు విజయభాగ్యం ప్రసాదించాడు.
3. మదీనాలో దైవప్రవక్త (సఅసం) ముహాజిర్లు, అన్సారీల మధ్య సోదర సంబంధం ఏర్పరిచినప్పుడు హజ్రత్ అలీ (రజి), "మీరు నాకు ఎవరినీ సోదరునిగా చేయలేదేమిటీ?'' అని అడిగారు. దానికి దైవప్రవక్త (సఅసం) సమాధానమిస్తూ "నీవు ఇహలోకంలో, పరలోకంలో ఉభయ లోకాల్లోనూ నా సోదరుడివి" అన్నారు.
4. హిజ్రత్ సమయంలో ప్రియప్రవక్త (సఅసం) హజ్రత్ అలీ (రజి)ని తన పడకపై పడుకోమని చెప్పి ప్రజలు తన వద్ద దాచుకున్న ధనకనక వస్తువుల్ని వారికి తిరిగి అప్పగించేందుకు వాటిని హజ్రత్ అలీ (రజి)కు అప్పగించారు.
5. బదర్ యుద్ధంలో అనేక మంది అవిశ్వాసులు హజ్రత్ అలీ (రజి) చేతిలో హతమయ్యారు. ఆ విధంగా అల్లాహ్ ఇస్లాంకు గౌరవం ప్రసాదించాడు.
6. మక్కా అవిశ్వాసులకు బరాత్ (తౌబా) సూరా వినిపించడానికి ప్రియప్రవక్త (సఅసం) హజ్రత్ అలీ (రజి) ని నియమించారు.
7. ప్రియప్రవక్త (సఅసం) భౌతిక కాయానికి హజ్రత్ అలీ (రజి)యే స్నానం చేయించారు.

## అభ్యాసం

**అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వండి.**

1. 'ఖులఫాయె రాషిదీన్'ల పేర్లు తెలుపండి.
2. ఇస్లాం స్వీకరించక ముందు హజ్రత్ అబూ బక్ర్(రజి) ఎలా ఉండేవారు?
3. హజ్రత్ అబూ బక్ర్(రజి) కృషి వల్ల ఎవరెవరు ఇస్లాం స్వీకరించారు?
4. హజ్రత్ అబూ బక్ర్ సిద్దీఖ్(రజి) జీవితం ఎలా ఉండేది?
5. హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి) ఇస్లాం స్వీకరించిన సంఘటనను వివరించండి?
6. ప్రియప్రవక్త(స) హజ్రత్ ఉమర్(రజి)కు 'ఫారూఖ్' అనే బిరుదు ఎందుకిచ్చారు?
7. హజ్రత్ ఉమర్ ఫారూఖ్(రజి) తమ పరిపాలనా కాలంలో ఏ ఏ ఏర్పాట్లు చేశారు?
8. ఖుర్ఆన్ ప్రచురణ ఎవరి పరిపాలనా కాలంలో జరిగింది?
9. హజ్రత్ అలీ(రజి) షహాదత్ (అమర మరణం) ఎలా జరిగింది?
10. హజ్రత్ అలీ(రజి) జీవితం ఎలా ఉండేది?

**అ) క్రింది ఖాళీలను పూరించండి.**

1. హజ్రత్ అబూ బక్ర్ (రజి) పేరు అబ్దుల్లాహ్, ఇంకా మారు పేరు అబూబక్ర్‌గా ఉండేది, ప్రియప్రవక్త(స) ఆయన గారికి...................... అనే బిరుదు ఇచ్చారు.
2. ప్రియప్రవక్త(స)కు అల్లాహ్ వైపు నుండి హిజ్రత్ (వలస వెళ్ళే) అనుమతి లభించినప్పుడు హజ్రత్ ............ ను తనకు తోడుగా తీసుకెళ్ళారు.
3. హిజ్రీ 13వ సంవత్సరం, జమాదిఉల్ ఆఖిర్ నెల 21న హజ్రత్ ........... పరమపదించారు.
4. హజ్రత్ ఉమర్(రజి) కాలంలో ........... నమాజు సామూహికంగా చేయటం ప్రారంభమైంది.
5. హిజ్రీ 24వ సంవత్సరం, ముహర్రముల్ హరామ్ నెల మొదటి తేదీన హజ్రత్ ............ పరమపదించారు.
6. మూసా(అలై)కు .............. ఎలాగో, అలీ నీవు నా కొరకు అలాంటివాడివి.
7. హజ్రత్ అలీ(రజి) పరిపాలనా కాలం దాదాపు ............. వరకు ఉంది.
8. మరణించిన తరువాత ప్రియప్రవక్త(స)కు హజ్రత్ ........... గుస్ల్ (స్నానం) చేయించారు?

**ఇ) (ఈ వాక్యాలు) ఎవరన్నారో వ్రాయండి**

1. షైతాన్ అయితే ఉమర్(రజి) నీడ చూసే పరుగెత్తిపోతాడు ..............
2. ఓ అల్లాహ్! నేను కఠిన స్వభావుణ్ణి, నన్ను మృదు స్వభావిని చెయ్యి, నాకు నీ ప్రియ గ్రంథమైన దివ్యఖుర్ఆన్‌ను గ్రహింపజెయ్యి ............................
3. ఉస్మాన్(రజి)తోనయితే దైవదూతలు కూడా బిడియపడతారు. ............................
4. నీవు ప్రపంచం, పరలోకం రెండుచోట్ల నాకు సోదరునివి ............................

**ఈ) క్రింది వాటిని జత పరచండి**

| | అ | ఇ |
|---|---|---|
| 1. | హ్రజత్ ఉస్మాన్(రజి) | ఫెరోజ్ పేరు గల పారశీక బానిస హతమార్చాడు. |
| 2. | హ్రజత్ ఉమర్ ఫారూఖ్(రజి) | జున్నూరైన్ |
| 3. | హ్రజత్ అలీ (రజి) | దివ్యఖుర్ఆన్ ఒకే సంపుటంగా సంకలనం చేయబడింది. |
| 4. | హ్రజత్ అబూబక్ర్(రజి) | ఇబ్ను ముల్‌జిమ్ హతమార్చాడు. |

## చేయాల్సిన మరి కొన్ని పనులు

మాయెల్ ఖైర్ఆబాది గారి గ్రంథం 'ప్యారె ఖలీఫ' లైబ్రరీ నుండి పొంది అధ్యయనం చేయండి.



# 20. నలుగురు ఇమాములు

నేరుగా ఖుర్ఆన్, హదీసుల ద్వారా ఇస్లాం గురించిన ఆజ్ఞలన్నిటిని క్షుణ్ణంగా అర్థం చేసుకోవడం ప్రతి మనిషికి సాధ్యమయ్యే పనికాదు. దాని కోసం ఇస్లాంను లోతుగా అధ్యయనం చేసి, దానికి సంబంధించిన ప్రతి విషయం పట్ల సరయిన అవగాహన కలిగి ఉండాలి. అలాంటి జ్ఞానసంపన్నులు, ధర్మవేత్తలలో కొందరు ఎంతో శ్రమపడి ఖుర్ఆన్, హదీసులను అర్థం చేసుకొని వాటి నుండి అనేక ఆజ్ఞలను గ్రహించి ఒకచోట క్రోడీకరించారు. ధర్మం, అధర్మాలకు సంబంధించిన ఈ ఆజ్ఞలు, సమస్యల సముదాయాన్నే "ఫిఖా" అంటారు. ఆ ధర్మవేత్తలను 'ఫిఖావేత్తలు' లేక 'ఇమాములు' అంటారు. ప్రారంభంలో అనేక దృక్పథాలుగల ఫిఖాలు ఉండేవి. ఇప్పుడు నలుగురు ఇమాములకు చెందిన ఫిఖాలు మాత్రమే మిగిలాయి. ఈ ఇమాములకు మనం ఎంతో రుణపడి ఉన్నాం. వారి పేర్లు ఈ విధంగా ఉన్నాయి:

1. హజ్రత్ ఇమామ్ అబూ హనిఫా (రహ్మా)
2. హజ్రత్ ఇమామ్ మాలిక్ (రహ్మా)
3. హజ్రత్ ఇమామ్ షాఫయి (రహ్మా)
4. హజ్రత్ ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మా).

ఇప్పుడు మనం వీరి జీవిత విశేషాలను గురించి తెలుసుకుందాం.

### (1) ఇమామ్ అబూ హనీఫా (రహ్మా)

ఈయన అసలు పేరు నోమాన్ బిన్ సాబిత్ (రహ్మా). కాని ప్రజలలో ఆయన కునియత్ పేరే ఖ్యాతిగాంచింది. ఆయన హిజ్రీ శకం 80లో జన్మించారు. ఆయన స్వస్థలం కూఫా. ఆనాడు కూఫా ధర్మవిద్యకు ప్రధాన కేంద్రంగా ఉండేది. దైవప్రవక్త (సఅసం) తదనంతరం మక్కా, మదీనా, కూఫా పట్టణాలు ధర్మవిద్యకు ప్రధాన కేంద్రాలుగా ఉండేవి. మక్కాలో హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ధర్మవేత్తల నాయకునిగా పేరు పద్దారు. మదీనాలో హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి), కూఫాలో హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్వూద్ (రజి)లు గొప్ప మతనాయకులుగా ప్రఖ్యాతిగాంచారు. ఇమామ్ సుఫ్యాన్ (రహ్మా) చెప్పిన ఒక విషయాన్ని ఇమామ్ అహ్మద్ (రహ్మా) ఇలా ఉల్లేఖించారు: "హజ్ ఆజ్ఞలకు మక్కా, ఖుర్ఆన్ పఠనం (ఖిరాత్)కు మదీనా, హలాల్-హరాం (ధర్మాధర్మాల) సమస్యల పరిష్కారానికి కూఫా పట్టణాలు ప్రధాన కేంద్రాలు అయ్యాయి." కూఫాలో ఆనాడు వందలాది మంది సహాబీలు (ప్రవక్త అనుచరులు) ఉండేవారు. వారి తరువాత కూడా గొప్ప గొప్ప ధర్మవేత్తలు, ఫిఖావేత్తలకు ఈ పట్టణం ప్రధాన కేంద్రంగా కొనసాగింది.

ఇమామ్ అబూ హనీఫా (రహ్మా) ఎంతో విజ్ఞతావివేచనాపరులు, గొప్ప జ్ఞానసంపన్నులు, సద్గుణశీలి, దైవభీతిపరులు, భక్తిపరాయణులు. ఎల్లప్పుడూ క్రియాశీలక విషయాలే మాట్లాడుతారు. పనికిమాలిన

విషయాలలో తమ సమయాన్ని వృథా చేసుకోరు. ఉపాధ్యాయులను ఎంతో గౌరవిస్తారు. స్నేహితులతో సత్ప్రవర్తన కలిగి ఉంటారు. ఎల్లప్పుడూ దైవధ్యానంలో నిమగ్నులై ఉంటారు. నమాజు చేస్తున్నప్పుడు ఎంతో ఏకాగ్రతతో ఖుర్‌ఆన్ పఠించేవారు. ఖుర్‌ఆన్ పఠన సమయంలో ఒక్కొక్కసారి కంటతడి కూడా పెట్టుకునేవారు. ఎంతో నిజాయితీపరులు. అధికారులు, ధనికుల దగ్గరకు ఎన్నడూ పోయేవారు కాదు. దేవుడు ఆయనకు అపార సిరిసంపదలు కూడా అనుగ్రహించాడు. కాని ఆయనకు ఐశ్వర్యం పట్ల ఏ మాత్రం వ్యామోహం ఉండేదికాదు. తన ధనాన్ని ధర్మవిద్యను వ్యాపింపజేయడానికి, విద్యార్థుల అవసరాలను తీర్చడానికి మాత్రమే ఎక్కువగా ఖర్చుచేసేవారు. దేవుడు ఆయనకు విస్తృతమైన ధర్మజ్ఞానం ప్రసాదించాడు. సుదూర ప్రాంతాల నుంచి అనేక మంది విద్యార్థులు ఆయన దగ్గరకు వచ్చి విద్య నేర్చుకునేవారు ఎన్నో సమస్యలను గురించి అడిగి తెలుసుకునేవారు. ఆయనకు వందలాది మంది శిష్యులయ్యారు. వారిలో ఇమామ్ అబూ యూసుఫ్ (రహ్మ), ఇమామ్ ముహమ్మద్ (రహ్మ), ఇమామ్ జాఫర్ (రహ్మ), అబ్దుల్లా బిన్ ముబారక్ (రహ్మ), లైస్ బిన్ సాద్ (రహ్మ), ఫజీల్ బిన్ అయాజ్ (రహ్మ), దావూద్ తాయి (రహ్మ) అనే శిష్యులు సుప్రసిద్ధులు.

హజ్రత్ ఇమామ్ షాఫయి (రహ్మ) ఆయన్ని గురించి చెబుతూ, "ఫిఖా విద్యలో అందరూ ఇమామ్ అబూ హనీఫా (రహ్మ) ముందు పిల్లలే" అన్నారు. ఆయనే మరో సందర్భంలో, "ఫిఖా విద్యను అర్థం చేసుకోదలచినవారు ఇమామ్ అబూ హనీఫా (రహ్మ)తో, ఆయన అనుచరులతో సంబంధం పెట్టుకోవలసిన అవసరముంది" అని చెప్పారు. ఇమామ్ వకీ మాట్లాడుతూ, "ఇమామ్ అబూ హనీఫా (రహ్మ) కంటే మించిన జ్ఞానసంపన్నుడిని ఆయనకంటే మెరుగైన నమాజు చేసే మనిషిని నేనింతవరకు చూడలేదు" అని చెప్పారు.

ఖలీఫా మన్సూర్ ఒకసారి ఇమామ్ అబూ హనీఫా (రహ్మ)ను ఖాజీ (న్యాయమూర్తి)గా నియమించ దలిచాడు. కాని ఇమామ్ అబూ హనీఫా (రహ్మ) అందుకు తిరస్కరిస్తూ, "నేనా పదవికి అర్హుణ్ని కాను" అని సమాధానమిచ్చారు. ఖలీఫా దానికి తీవ్రంగా స్పందిస్తూ, "మీరు అబద్ధమాడుతున్నారు" అన్నాడు. అప్పుడు ఇమామ్ అబూహనీఫా సమాధానమిస్తూ, "నేను అబద్ధమాడుతుంటే ఇలాంటి అబద్ధాలకోరు ఖాజీ ఎలా కాగలుగుతాడు? ఒకవేళ నిజమే చెబుతున్నా అప్పుడు కూడా నేను ఖాజీగా నియమించబడటానికి అర్హుణ్ని కాలేను" అని అన్నారు.

ఇమామ్ అబూ హనీఫా (రహ్మ)కు 'ఇమామ్ ఆజం' అనే బిరుదు ఉంది. అల్లాహ్ ఆయనకు మంచి తెలివితేటలు ప్రసాదించాడు. ఎంత పెద్ద చిక్కు సమస్యనైనా ఆయన సునాయాసంగా పరిష్కరించే వారు. ఒకసారి కొందరు వ్యక్తులు ఒకచోట కూర్చొని ఉంటే హఠాత్తుగా ఎక్కడ్నుంచో ఒక పాము వచ్చి ఒకతనిపై పడింది. అతను కంగారుపడుతూ దాన్ని విదిలించాడు. అప్పుడా పాము పోయి మరొకతనిపై పడింది. అతను కూడా కంగారుపడుతూ విదిలిస్తే అది వేరొకతనిపై పడింది. అతను విదిలిస్తే అది నాల్గవ వ్యక్తిపై పడి అతడ్ని కాటు వేసింది. దాంతో అతను చనిపోయాడు. అతని చావుకు కారకుడెవరయి ఉంటాడని భావిస్తూ జనం ఆశ్చర్యపోయారు. ఇమామ్ అబూ హనీఫా (రహ్మ) ఈ వృత్తాంతం విని ఇలా తీర్పిచ్చారు:

"మొదటి వ్యక్తి పామును విదిలించి వేసి దాని బారి నుండి తప్పించుకున్నాడు. కనుక అతని మీద ఎలాంటి నిందలేదు. అలాగే రెండవ వ్యక్తి మీద కూడా ఎలాంటి నిందలేదు. మూడవ వ్యక్తి విదిలించి వేయగా పాము నాల్గవ వ్యక్తి మీద పడిపోయింది. అయితే అది నాల్గవ వ్యక్తి మీద పడిన వెంటనే అతడ్ని కాటేసిందా లేక కాస్సేపటి తరువాత కాటేసిందా అనే విషయం తేలాలి. పడిన వెంటనే కాటేస్తే మూడవ వ్యక్తి నేరస్థుడవుతాడు. ఒకవేళ మీద పడిన కాస్సేపటికి కాటేస్తే మాత్రం నాల్గవ వ్యక్తి ఏమరుపాటులో పడి ఉన్నాడని భావించవలసి ఉంటుంది. కనుక ఎవరిపై ఎలాంటి నిందలేదు." ఈ తీర్పు విని అందరూ ఇమామ్ గారి న్యాయశీలతను కొనియాడుతూ సంతోషం వ్యక్తపరిచారు.

## (2) ఇమాం మాలిక్ (రహ్మా)

ఇమామ్ మాలిక్ (రహ్మా) మదీనాలోనే నివసిస్తూ ప్రవక్త సంప్రదాయాలకు సంబంధించిన విద్యలో నిష్ణాతులయ్యారు. అందుచేత ఆయన్ని 'దారుల్ హిజ్రత్' అని కూడా అంటారు. చదువుకునే రోజుల్లో ఆయన ఎంతో పేదరికం అనుభవించారు. తరువాత దేవుడు ఆయనకు ఐశ్వర్యం ప్రసాదించాడు. ఇమామ్ మాలిక్ (రహ్మా) తన శిష్యులకు ఖుర్ఆన్ పాఠాలు హృదయానికి హత్తుకునేలా చెప్పేవారు. ఆయనకు ఎంతో మంది శిష్యులయ్యారు. ఇమామ్ షాఫయి (రహ్మా) కూడా ఆయన శిష్యుడే. అంతేకాదు ఖలీఫా హారూన్ రషీద్ కొడుకులిద్దరు కూడా ఇమామ్ మాలిక్ (రహ్మా) దగ్గరే చదువుకున్నారు. ఈ విధంగా ఇమామ్ మాలిక్ (రహ్మా) వరుసగా 62 సంవత్సరాలపాటు చదవడం, చదివించడం, ఫత్వాలు ఇవ్వడంలో కాలం గడిపారు. ఆయనకు 1300 మందికి పైగా శిష్యులు ఉన్నట్లు తెలుస్తోంది. ఆయన రాసిన గ్రంథాలలో 'ముఅత్తా' గ్రంథం చాలా ప్రసిద్ధి చెందింది. హదీసు గ్రంథాలలో దీనికి ఎంతో ప్రాముఖ్యం ఉంది. హజ్రత్ షాహ్ వలియుల్లా దీన్ని మొత్తం హదీసు గ్రంథాలలో ఉన్నతమైన గ్రంథంగా పరిగణించారు.

ఇమామ్ మాలిక్ (రహ్మా) గొప్ప దానశీలురు. ఒకసారి ఆయన తన అశ్వశాలలోని గుర్రాలను తనిఖీ చేస్తున్నారు. ఆ సమయంలో ఇమామ్ షాఫయి (రహ్మా) కూడా ఆయనతోపాటు ఉన్నారు. ఇమామ్ షాఫయి (రహ్మా) కొన్ని గుర్రాలను ప్రశంసించారు. అది విని ఇమామ్ మాలిక్ (రహ్మా) ఆ గుర్రాలన్నిటినీ ఇమామ్ షాఫయి (రహ్మా)కు ఇచ్చివేశారు. ఇమామ్ మాలిక్ (రహ్మా) ఖరీదైన మంచి బట్టలు ధరిస్తారు. అత్తరు పూసుకుంటారు. సాధారణంగా ఆయన తెల్లబట్టలే వేసుకుంటారు. "దేవుడు నాకు భాగ్యం ప్రసాదించినపుడు దాన్ని నేను ఎందుకు బహిర్గతం చేయకూడదు?" అని అనేవారు. హదీసు బోధ చెప్ప దలచుకున్నప్పుడు ముందుగా ఆయన స్నానం చేసి, ఉతికిన బట్టలు ధరించి, అత్తరు పూసుకునేవారు. ఆ తరువాత కుర్చీ మీద ఠీవిగా కూర్చొని హదీసు బోధ చేసేవారు. ఇమామ్ మాలిక్ (రహ్మా) దగ్గర ఖరీదైన మేలు జాతి గుర్రాలు ఉండేవి. కాని ఆయన ఏనాడూ మదీనా వీధుల్లో గుర్రాలు ఎక్కి తిరగలేదు. అందుకాయన కారణం వివరిస్తూ, "విశ్వనాయకుడు (సఅసం) విశ్రాంతి తీసుకుంటున్న పవిత్ర నేలను గుర్రాలతో తొక్కించాలంటే నాకు సిగ్గుగా ఉంది" అని చెప్పారు.

ఇమామ్ మాలిక్ (రహ్మా) హి(జ్రీ శకం 93లో పుట్టారు. ఆయన జారీ చేసిన ఒక ఫత్వా మదీనా గవర్నర్‌కు కోపం తెప్పించింది. దాంతో అతను ఇమామ్ మాలిక్ (రహ్మా)ని కారాగారంలో వేసి డెబ్బయి కొరడా దెబ్బలు కొట్టించాడు. దానివల్ల ఇమామ్ గారి రెండు చేతులు చచ్చుబడిపోయాయి. నమాజులో చేతులు పైకెత్తలేకపోయేవారు. చివరికి ఆయన 90 సంవత్సరాల వయస్సులో హి(జ్రీ శకం 179లో ఇహలోకం వీడిపోయారు. ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్.

## (3) ఇమామ్ షాఫయి (రహ్మా)

ఈయన అసలు పేరు ముహమ్మద్ బిన్ ఇద్రీస్. ఇమామ్ అబూ హనీఫా (రహ్మా) చనిపోయిన సంవత్సరమే ఈయన జన్మించారు. అంటే హి(జ్రీ శకం 150వ సంవత్సరంలో అన్నమాట. చిన్నతనంలోనే తండ్రి నీడ కోల్పోయారు. ఇమామ్ షాఫయి (రహ్మా) బాల్యం నుంచే పండితుల సహవాసంలో ఉండేవారు. ఏడేండ్ల ప్రాయంలోనే ఖుర్‌ఆన్ కంఠస్థం చేశారు. 12 సంవత్సరాల వయసులో హదీసు విద్యనభ్యసించారు. ఇమామ్ మాలిక్ రచించిన 'ముఅత్తా' గ్రంథాన్ని పూర్తిగా కంఠస్థం చేశారు. 13వ ఏట ఇమామ్ మాలిక్ (రహ్మా) దగ్గరకు పోయి ముఅత్తాలోని విషయాలన్నీ ఆయనకు వినిపించారు. అరబీ భాషలో మంచి ప్రావీణ్యం సంపాదించారు. అల్లాహ్ ఆయనకు మంచి జ్ఞాపకశక్తి కూడా ప్రసాదించాడు.

ఒకసారి ఆయన ఇమామ్ ముహమ్మద్ (రహ్మా) నుండి ఇమామ్ అబూ హనీఫా గారి పుస్తకం 'అవుసత్' చదవడానికి తీసుకున్నారు. ఆ రోజు రాత్రంతా దాన్ని చదివి కంఠస్థం చేసి మరునాడు ఉదయం వాపసు చేశారు. పదిహేనేళ్ళ వయసులో ఆయన ఫత్వాలు ఇవ్వడం మొదలెట్టారు. ఆయన గురువు కూడా అందుకు ఆయన్ని ప్రోత్సహించారు. ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మా) ఒకసారి మాట్లాడుతూ, "కలం, కాగితం పట్టుకున్న ప్రతి మనిషీ ఇమామ్ షాఫయి (రహ్మా)కు రుణపడి ఉంటాడు" అన్నారు. ఇమామ్ మాలిక్ రాసిన పుస్తకం 'కితాబుల్ ఉమ్' చాలా ప్రసిద్ధి చెందింది.

హదీసు, ఫిఖా విద్యలలోనేగాక ఆయన గుర్రపు స్వారీ, ఈటె విసురుడు లాంటి పనులలో కూడా మంచి ప్రావీణ్యం సంపాదించారు. ఆయన ఈటె విసిరితే గురి తప్పేదికాదు. అయితే ఆయన ఎల్లప్పుడూ ఏదో ఒక వ్యాధితో బాధపడుతుండేవారు. అయినప్పటికీ చదవడం, చదివించడం, బోధించడం, రచించడం వగైరా జ్ఞాన సంబంధమైన కార్యకలాపాలు మాత్రం కొనసాగేవి. చివరికి ఆయన ఖలీఫా మామూన్ రషీద్ కాలంలో హి(జ్రీ శకం 204లో గురువారం రోజు చనిపోయారు. దేవుడు ఆయనకు స్వర్గప్రాప్తి భాగ్యం కలిగించుగాక! ఆమీన్.

## (4) ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మా)

ఈయన పేరు అహ్మద్. హి(జ్రీ శకం 164లో బగ్దాద్ పట్టణంలో జన్మించారు. హి(జ్రీ శకం 241లో బగ్దాద్‌లోనే చనిపోయారు. బాల్యంలోనే ఆయన ఖుర్‌ఆన్ కంఠస్థం చేశారు. హదీసు విద్యలో మంచి ప్రావీణ్యం సంపాదించి 'ఇమాముల్ ముహద్దిసీన్' (హదీసువేత్తల నాయకుడు)గా పేరు పొందారు.

ఖుర్‌ఆన్, హదీసులలో లోతుపాతులను తరచి చూశారు. పదహారేళ్ళ వయసులో ఆయన "ముస్నద్ అహ్మద్" గ్రంథ రచనకు శ్రీకారం చుట్టారు. జీవితాంతం దాని రచనలోనే నిమగ్నులైపోయారు. ఆయన ఈ గ్రంథంలో అప్పటివరకు ఎవరూ సమీకరించలేనన్ని హదీసులు సమీకరించారు. తాను ఏడున్నర లక్షల హదీసుల నుండి ఎన్నుకొని ఈ హదీసులను సమీకరించానని ఆయన స్వయంగా చెప్పారు.

ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మ) సాధారణంగా ఇంటి పట్టునే ఉండి ధార్మిక కార్యకలాపాలలో నిమగ్నులయి ఉండేవారు. ఆయన ఎంతో పుణ్యాత్ముడు, దైవభీతిపరాయణుడు, నిరాడంబర జీవి, గొప్ప దానశీలుడు. తరచుగా ఉపవాసాలు పాటిస్తుంటారు. ఒకసారి హసన్ బిన్ అబ్దుల్ అజీజ్ ఆయనకు మూడు వేల రూపాయలు పంపుతూ, "ఇది ధర్మసమ్మతమైన సంపాదన, దీన్ని మీరు వాడుకోండి" అని అన్నాడు. కాని ఇమామ్ అహ్మద్ (రహ్మ) ఆ డబ్బును నిర్లక్ష్యంగా చూసి వాపసు చేశారు. ఆయన జీవి తాంతం సత్కార్యాలు చేస్తూ ఎంతో నిరాడంబరంగా ఉండేవారు. ఎండిపోయిన రొట్టెలు నీటిలో నానబెట్టి తినేవారు. దేవుణ్ణే నమ్ముకొని ఉంటూ ఎవరి దయాదాక్షిణ్యాల మీద ఆధార పడేవారు కాదు.

దైవమార్గంలో ఆయన అనేక కష్టాలు ఎదుర్కోవలసి వచ్చింది. ఖలీఫా మామూన్ పరిపాలనా కాలంలో ముఅతజిల వర్గం "ఖుర్‌ఆన్ సృష్టితం" అనే సమస్యను లేవనెత్తింది. మామూన్ కూడా ఖుర్‌ఆన్ సృష్టితమే అని భావించేవాడు. దాన్ని ప్రచారం కూడా చేసేవాడు. కాని ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్(రహ్మ) ఆ మతవిశ్వాసాన్ని తీవ్రంగా ఖండించేవారు. మామూన్‌కు వంతపాడే ఆయన గవర్నర్ దీన్ని సహించలేక ఇమామ్ అహ్మద్ (రహ్మ)ని జైల్లో వేయించాడు. మామూన్ తరువాత ఖలీఫా అయిన ముఅతసిమ్ కూడా అదే విశ్వాసం కలిగిన వాడు. అతను ఇమామ్ అహ్మద్ (రహ్మ)ను జైల్లో కొరడా దెబ్బలు కొట్టిం చాడు. ఆ దెబ్బలతో ఇమామ్ అహ్మద్ (రహ్మ) శరీరం పూర్తిగా రక్తసిక్తమయిపోయింది. అయితే ఆయన తన వీపు మీద పడే ప్రతి కొరడా దెబ్బను సహిస్తూ దైవాన్ని స్మరించేవారు కలిమా (సద్వచనం) పఠించేవారు.

ముఅతసిమ్ తరువాత ముతవక్కిల్ ఖలీఫా అయ్యాడు. ఆయన ఇమామ్ అహ్మద్ (రహ్మ) మత విశ్వాసానికి అనుకూలుడయ్యాడు. అందుచేత ఆయన ఇమామ్ అహ్మద్ (రహ్మ) గారిని ఎంతో గౌరవించేవాడు.

ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మ), ఇమామ్ షాఫయి (రహ్మ) గారి శిష్యులు. హదీసులో అందరికన్నా ప్రసిద్ధికెక్కిన ఇమామ్ బుఖారీ (రహ్మ), ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మ) శిష్యుడే. ఇమామ్ అహ్మద్ (రహ్మ) 77 ఏళ్ళ వయస్సులో అశాశ్వితమైన ఈ ప్రపంచం నుండి శాశ్వతంగా వెళ్ళిపోయారు. అల్లాహ్ ఆయనకు తన కారుణ్యాశ్రయంలో చోటివ్వుగాక. ఆయన జనాజాలో అసంఖ్యాక మంది పాల్గొన్నారు. అదే రోజు వేలాది మంది అవిశ్వాసులు ఇస్లాం స్వీకరించడం కూడా జరిగింది. దేవుడు మనకు ఆ మహనీయుని అడుగు జాడల్లో నడచుకునే సద్బుద్ధి ప్రసాదించుగాక.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. 'ఫికాహ్'కు అర్థం ఏమిటి?
2. 'పుఖహా' అని ఏ మహానుభావుల్ని పిలుస్తారు?
3. ప్రఖ్యాతిగాంచిన 'పుఖహాలు' ఎంత మంది? వారి పేర్లేమి?
4. ప్రియప్రవక్త(స) తరువాత ధార్మిక విద్యకు ప్రఖ్యాతిగాంచిన కేంద్రాలు ఎన్ని ఉండేవి? వాటిలో ప్రవక్త సహచరుల్లో ఎవరు ధార్మికవేత్తల నాయకునిగా గుర్తించబడేవారు?
5. ఇమామ్ అబూ హనీఫా(రహ్మ) గారి ప్రఖ్యాతిగాంచిన శిష్యుల పేర్లు వ్రాయండి?
6. ఇమామ్ మాలిక్(రహ్మ) హదీసు పాఠం చెప్పేముందు ఏ సన్నాహాలు చేసుకునేవారు?
7. ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మ)ను గవర్నర్ ఎందుకని బంధించాడు?
8. ఇమామ్ షాఫయి (రహ్మ) జ్ఞాపకశక్తి గురించి మీకేం తెలుసు?

**(ఆ) క్రింది ఖాళీలను పూరించండి**

1. కూఫాలో ............ గారి జననం జరిగింది.
2. హజ్రత్ ఇమామ్ మాలిక్(రహ్మ) గారి మరణం.............లో జరిగింది. మరణించే సమయంలో ఆయన గారి వయస్సు ఎనభై ఆరు సంవత్సరాలు.
3. హజ్రత్ ఇమామ్ షాఫయి (రహ్మ) హదీసు, ఫికాహ్‌తోపాటు.......... మరియు .............లో కూడా గొప్ప ప్రావీణ్యం కలిగి వుండేవారు.
4. ఇమామ్ అబూ హనీఫా(రహ్మ) గారి జనాజాలో.......... మంది ప్రజలు పాల్గొన్నారు.
5. ఇమామ్ .............. ఇమామ్ షాఫయి(రహ్మ)కు గురువులు.
6. ఇమామ్ మాలిక్ (రహ్మ) గారి శిష్యుల సంఖ్య ................. పైగా తెలుపబడింది.
7. హదీసులో అందరికన్నా ప్రఖ్యాతిగాంచిన ఇమామ్, 'ఇమామ్ బుఖారి', ఇమామ్ .................... గారి శిష్యులు.
8. ఇమామ్ మాలిక్ (రహ్మ) గారి గ్రంథం .......................... అత్యంత ప్రఖ్యాతిగాంచింది.
9. 'ఇమాముల్ ముహద్దిసీన్' అనేది, ఇమామ్ ...................... గారి బిరుదు.

**ఇ) ఈ క్రింది వాటిని జత పరచండి?**

| | అ | ఇ |
|---|---|---|
| 1. | ఇమామ్ అబూ హనీఫా (రహ్మ) | ఇమామ్ దారుల్ హిజ్రత్ |
| 2. | ఇమామ్ మాలిక్ (రహ్మ) | నోమాన్ బిన్ సాబిత్ |
| 3. | ఇమామ్ షాఫయి (రహ్మ) | ఇమాముల్ ముహద్దిసీన్ |
| 4. | ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మ) | ముహమ్మద్ బిన్ ఇద్రీస్ |

**ఇ) ఈ క్రింది మాటలు ఎవరన్నారో తెలుపండి**

1. ఫికాహ్ జ్ఞానంలో అందరూ కూడా ఇమామ్ అబూ హనీఫా(రహ్మ) ముందు పిల్లలు ....................
2. ఒకవేళ నేను అసత్యం పలికితే అసత్యవాది ఖాజీ ఎలా అవగలుగుతాడు? నేను సత్యం చెబితే అప్పుడూ (ఖాజీ) అవలేను ..............................
3. ఏ నగరంలోనైతే ప్రవక్త మహనీయుల(స) పవిత్ర శరీరం ఖననం చేయబడి ఉందో, ఆ నగరపు భూమిని అశ్వాల డెక్కలతో తొక్కించటానికి నాకు సిగ్గేస్తున్నది ...........................
4. కలం, సిరాబుడ్డిని ముట్టిన ప్రతి వాడు ఇమామ్ షాఫయి (రహ్మ)కు తప్పక రుణపడి వుంటాడు .................

## చేయాల్సిన మరి కొన్ని పనులు

ఇమామ్ అబూ హనీఫా(రహ్మ) గారి గురించి మీ గురువును అడిగి ఇంకా వివరాలు సేకరించండి.



# 21. అహ్లె హదీస్

ఈ నలుగురు ఇమాములను అనుసరించేవారితోపాటు మరో వర్గం కూడా ఉంది. ఆ వర్గాన్ని 'అహ్లె హదీస్' అంటారు. ఈ వర్గంవారు ఏ ఇమామ్‌ని అనుసరించడమైనా సరైన పద్ధతి కాదంటారు. పరిపూర్ణ ధర్మజ్ఞానం కలిగి ఉన్న వారు ఇమాములను అనుకరించడం సరి కాదని, జీవితంలోని ప్రతి వ్యవహారంలో ఖుర్‌ఆన్, హదీసుల నుండి నేరుగా ఆజ్ఞలు తెలుసుకోవలసిన బాధ్యత వారిపై ఉందని అంటారు. ఒకవేళ ఖుర్‌ఆన్, హదీసుల్లో పరిపూర్ణ జ్ఞానం లేకపోతే అలాంటివారు తమకు నచ్చిన ధర్మ వేత్తను అనుసరించవచ్చని చెబుతారు. మన ప్రియప్రవక్త (సఅసం) ఖుర్‌ఆన్ ఆజ్ఞలన్నిటినీ ఎంతో విపులంగా వివరించారని, సహాబీలు (ప్రవక్త అనుచరులు) ఆయన (సఅసం) సంప్రదాయాలను తు.చ. తప్పకుండా పాటించి మనకు ఎంతో సౌలభ్యం చేకూర్చారని, అందుచేత మనం దైవప్రవక్త (సఅసం), ఆయన సహాబీల సంప్రదాయాల నుంచే నేరుగా విషయాలు తెలుసుకొని ఆచరించాలని వీరు చెబుతారు.

ప్రతి ఆజ్ఞ, ప్రతి సమస్యను గురించి నేరుగా హదీసు నుండి గ్రహించాలని, ఆ విషయంలో ఏ ఇమామ్‌ని కూడా అనుసరించకూడదని చెబుతారు. గనక వీరిని 'అహ్లె హదీస్' అంటారు. మా దృష్టిలో ఈ అయిదు వర్గాలు కూడా సరైన మార్గంలో ఉన్నారు. వారందరూ ప్రతి విషయంలోనూ దైవప్రవక్త (సఅసం)ను అనుసరించాలని చిత్తశుద్ధితో చెబుతున్నారు. కనుక వీలైనంత వరకు మనం మనస్ఫూర్తిగా ప్రవక్త (సఅసం) సంప్రదాయాలను అనుసరించడానికి ప్రయత్నించాలి. ఈ వర్గాల చిన్న చిన్న విభేదాలు ధర్మంపై అమితాసక్తి, దాని పట్ల అవగాహన, దైవప్రవక్త (సఅసం)పై ఉన్న అపార ప్రేమాభిమానాల కారణంగానే ఏర్పడ్డాయి. అదీగాక అందరి మనస్తత్వం, అవగాహనలు ఒకేలా ఉండవు కదా! కనుక మనం అన్ని వర్గాలను ప్రేమించాలి. ఎవరినీ ద్వేషించకూడదు. ఎవరినీ విమర్శించడం, అపహాస్యం చేయకూడదు. నిజానికి ఈ వర్గాలన్నీ ఇస్లాంను ప్రేమిస్తున్నాయి. అందరూ ప్రజలను ఇస్లాం బోధనలకు, దాని ఆదర్శానికి అనుగుణంగా తీర్చిదిద్దాలని కోరుతున్నవారే. కనుక మనం ఈ చిన్న చిన్న విభేదాలను సహించాలి. ఒకరికి వ్యతిరేకంగా ఒకరు వాదోపవాదాలు చేయకూడదు. ఇతరులలో లోపాలను ఎత్తిచూప డానికి ప్రయత్నించకుండా వారిలో ఉండే మంచి విషయాలపై దృష్టి ఉంచాలి. అందరూ కలసిమెలసి దైవారాధన చేయాలి. అందరూ దేవుని పార్టీగా తయారయి అధర్మాన్ని అంతమొందించడానికి, సత్యధర్మాన్ని నెలకొల్పడానికి కృషిచేయాలి. ఈ విధంగా చేసినప్పుడే మనం దేవుని ప్రియదాసులుగా మారి ఇహపర లోకాలలో బహుమానం, గౌరవప్రతిష్ఠలు పొందగలం.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి?**

1. అహ్లె హదీసు వారిని అహ్లె హదీసు అని ఎందుకంటారు?
2. ఫికాహ్‌కు చెందిన నాలుగు వర్గాలు, అహ్లె హదీసు వారి మధ్య గల వ్యతిరేకతకు కారణం ఏమిటి?
3. ఈ అన్ని వర్గాల వారి గురించి మనం అనుసరించాల్సిన పద్ధతి ఎలా ఉండాలి?

# 22. ప్రముఖ హదీసువేత్తలు

కొందరు మహానుభావులు ఎంతో శ్రమకోర్చి, కృషిచేసి మన ప్రియప్రవక్త (సఅసం) సంప్రదాయాలను, ఆయన వచనాలను సేకరించి, కంఠస్థం చేసి తప్పొప్పులను పరిశోధించి వాటిని గ్రంథాలలో క్రోడీకరించారు. ఈ మహాకార్యం కోసం వారు సుదూర ప్రాంతాలను సైతం పర్యటించి ప్రయాణ కష్టాలు భరించారు. దానికోసం జీవితాలను ధారపోశారు. కనుక మనం వారికి ఎంతో రుణపడి ఉన్నాం. ఆనాడు వారు చేసిన కృషి వల్లనే హదీసులు మనదాకా చేరాయి. ఈ రోజు మనం నిశ్చింతగా వాటిని ఆచరించగలుగుతున్నాము. వారిపై దేవుడు తన కారుణ్యాన్ని కురిపించుగాక! దేవుడు మనకు కూడా హదీసులను అర్థం చేసుకునే, హదీసు సేవ చేసే భాగ్యం ప్రసాదించుగాక!

హదీసు పండితులు చాలా మంది ఉన్నారు. హదీసులను సంకలనం చేసి గ్రంథాలుగా రాసినవారు కూడా చాలా మంది ఉన్నారు. వారిలో మేమిక్కడ ఆరుగురు ప్రఖ్యాత హదీసువేత్తల జీవిత విశేషాలను మాత్రమే సంక్షిప్తంగా పేర్కొంటున్నాం. వారు రాసిన ఆరు గ్రంథాల పేర్లు ఇవి: సహీహ్ బుఖారి, సహీహ్ ముస్లిం, సునన్ అబూదావూద్, జామె తిర్మిజి, సునన్ నిసాయి, ఇబ్నెమాజ. ఈ గ్రంథాలను 'సిహాహ్‌సిత్తా' అంటారు.

### (1) ఇమామ్ బుఖారీ (రహ్మా)

ఈయన అసలు పేరు ముహమ్మద్ బిన్ ఇస్మాయీల్. ఆయన తన స్వస్థలం బుఖారాలో హిజ్రీ శకం 94వ ఏట షవ్వాల్ నెల 13వ తేదీన శుక్రవారం నమాజు తరువాత జన్మించారు. చిన్నతనంలోనే తండ్రి నీడ కోల్పోయి అనాథ అయ్యారు. తల్లి ఎంతో గారాబంతో పెంచుతూ తగిన శిక్షణ ఇచ్చారు. ఆయన బాల్యదశలో ఉండగానే ఆయన చూపు తగ్గిపోసాగింది. ఎన్ని మందులు వాడినా లాభం కన్పించలేదు. ఆయన తల్లి ఆయన చూపు కోసం ఎల్లప్పుడూ దైవాన్ని ప్రార్థిస్తూ ఎంతో విచారంగా ఉండేవారు. చివరికి ఒకరోజు రాత్రి ఆమె కలలో హజ్రత్ ఇబ్రాహీం ప్రవక్త (అలై)ను చూశారు. కలలో ఆయన, "నీ ప్రార్థన దేవుడు ఆలకించి నీ కొడుక్కి చూపు ప్రసాదించాడు" అని చెప్పారు. తెల్లవారిన తరువాత లేచి చూస్తే నిజంగానే ఇమామ్ బుఖారి (రహ్మా)కి చూపు వచ్చేసింది. తల్లీ కొడుకులు ఎంతో సంతోషించి దైవానికి కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

పదకొండు సంవత్సరాల ప్రాయంలో ఆయన చదువు పూర్తి చేశారు. పదహారు సంవత్సరాల వయస్సులో హజ్రత్ అబ్దుల్లా బిన్ ముబారక్ (రహ్మా), హజ్రత్ వకీ (రహ్మా)ల గ్రంథాలను కంఠస్థం చేసుకున్నారు. పద్దెనిమిదేండ్ల వయస్సులో మదీనా పట్టణానికి ప్రయాణమయ్యారు. అక్కడ ఆయన వెన్నెల రాత్రులలో మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) సమాధి దగ్గర కూర్చొని, "ఖజాయా సహాబా వత్తాబియీన్", "తారీఖుల్ కుబ్రా" అనే తన మొదటి రెండు గ్రంథాలను రచించారు. దేవుడు ఆయనకు అసాధారణమైన జ్ఞాపకశక్తి ప్రసాదించాడు. ఉపాధ్యాయుల నోట ఒకసారి వింటే చాలు గుర్తుంచుకునేవారు. చిన్నతనంలోనే

ఆయన డెబ్బయివేల హదీసులు కంఠస్థం చేశారు. ఆయన సంకలనం చేసిన "సహీహ్ బుఖారీ" గ్రంథం ఎంతో ప్రసిద్ధి చెందింది. దివ్యఖుర్ఆన్ తరువాత ఇది అన్నిటికంటే ఎక్కువ ప్రామాణిక గ్రంథంగా గుర్తించబడింది. ఇమామ్ బుఖారీ (రహ్మ) ఒకసారి ఈ గ్రంథాన్ని గురించి చెబుతూ, "నాకు ఒక లక్ష సహీహ్ హదీసులు, రెండు లక్షల గైర్‌సహీహ్ హదీసులు జ్ఞాపకం ఉన్నాయి. నేనీ గ్రంథాన్ని ఆరు వేల హదీసుల నుండి ఎంపిక చేశాను." అని అన్నారు.

ధర్మవిద్యతోపాటు ఆయనకు అల్లాహ్ ప్రాపంచిక సంపద కూడా ప్రసాదించాడు. కాని ఎప్పుడూ ఆయన భోగభాగ్యాల జీవితం గడపలేదు. ఆయన తన సంపదనంతా దైవమార్గంలోనే వెచ్చించారు. ధనికులు, భూస్వాముల దగ్గరికి వెళ్ళేవారు కాదు.

ఒకసారి ఆయన జబ్బుపడ్డారు. వైద్యులు ఆయన మూత్రాన్ని పరీక్షించి "ఈయనగారు కూరలు అసలు వాడటం లేదని తెలుస్తోంది" అన్నారు. ఇమామ్ బుఖారీ (రహ్మ) ఈ మాట విని, "నిజమే. నేను నలభై ఏండ్ల నుంచి కూరలు తినడం లేదు" అన్నారు. ఆయన ఎవరినీ ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని నిందించేవారు కాదు. ఆయన ఎల్లప్పుడూ హదీసు సేవలో నిమగ్నులై ఉండేవారు. ఆ మహాకార్యంలోనే ఆయన జీవితమంతా గడచిపోయింది. అందుకే ఆయనకు హదీసులో "అమీరుల్ మోమినీన్ ఫిల్ హదీస్" అనే బిరుదు లభించింది. చివరకు ఇమామ్ బుఖారీ (రహ్మ) హిజ్రీ శకం 256వ సంవత్సరం 62 ఏళ్ళ వయస్సులో చనిపోయారు. అల్లాహ్ ఆయనపై తన కారుణ్యం చిలికించుగాక! దేవుడు మనకు కూడా హదీసు విద్య నేర్చుకునే ఆసక్తి ప్రసాదించుగాక!

### (2) ఇమామ్ ముస్లిం (రహ్మ)

ఈయన పేరు ముస్లిం బిన్ హజ్జాజ్. నీషాపూర్ స్వస్థలం. హిజ్రీ శకం 204లో జన్మించారు. ఆనాడు నీషాపూర్ గొప్ప గొప్ప విద్యావేత్తలతో ధర్మవిద్యకు ప్రధాన కేంద్రమై ఉండేది. ఇమామ్ ముస్లిం(రహ్మ) హదీసు విద్య నేర్చుకోవడానికి సుదూర ప్రాంతాలు కూడా పర్యటించారు. చివరికి అందులో విశిష్ఠ స్థానం సంపాదించారు. ఆయన ఎంతో పుణ్యాత్ముడు, దైవభీతిపరుడు, న్యాయబుద్ధి కలవారు, జీవితంలో ఏనాడూ ఎవరి పట్లా చెడుగా ప్రవర్తించలేదు ఎవరిని గురించీ చెడుగా మాట్లాడలేదు. ఆయన తన గురువులను ఎంతగానో గౌరవించేవారు. ఆయన హదీసుకు సంబంధించిన ఎన్నో గ్రంథాలు రాశారు. ఆయన సంకలనం చేసిన హదీసు గ్రంథం "సహీహ్ ముస్లిం" ఖ్యాతిగాంచింది. ఈ గ్రంథంలో ఆయన ఎంతో ప్రామాణికమైన హదీసులు సేకరించారు. వాటి ప్రామాణికతను ఆనాటి హదీసువేత్తలంతా ధృవపరిచారు. హదీసు గ్రంథాలలో సహీహ్ బుఖారీ తరువాత సహీహ్ ముస్లిమే గొప్ప గ్రంథం. ఒకతను ఒక హదీసు గురించి అడిగితే ఇమామ్ ముస్లిం (రహ్మ)కు అప్పుడా హదీసు గుర్తుకు రాలేదు. తరువాత ఆయన ఇంటికి పోయి ఆ హదీసును గురించి వెతకడంలో మునిగిపోయారు. అప్పుడాయన దగ్గర ఖర్జూర పండ్లున్న బుట్ట ఉంది. ఆయన ఎండు ఖర్జూర పండ్లు తింటూ హదీసు వెతకసాగారు. హదీసు

అన్వేషణలో తాను ఎన్ని ఎండు ఖర్జూరాలు తిన్నారో గమనించలేదు. చివరికి దానివల్ల ఆయన జబ్బుపడి హిజ్రీ శకం 241లో చనిపోయారు. నీషాపూర్ శివార్లలోని నశీరాబాద్‌లో ఆయన సమాధి ఉంది.

**(3) ఇమామ్ అబూదావూద్ (రహ్మా)**

ఈయన అసలు పేరు సులైమాన్ బిన్ అష్అస్ (రహ్మా). అయితే ఆయన తన కునియత్ పేరు అబూ దావూద్‌తోనే ప్రసిద్ధిచెందారు. హిజ్రీ శకం 202 లో ఆయన తన స్వస్థలం సబిహస్తాన్‌లో జన్మించారు. జీవితంలో అత్యధిక భాగం బగ్దాదు పట్టణంలో గడిపారు. అక్కడే ఉంటూ తన ప్రఖ్యాత గ్రంథం "సునన్ అబూ దావూద్" రచించారు. హదీసు విద్యార్జన కోసం ఆయన సుదూర ప్రాంతాలు పర్యటించారు. గొప్ప గుణవంతులు, ధర్మపరాయణులు. ఆయన్ని గురించి హజ్రత్ మూసా బిన్ హారూన్ మాట్లాడుతూ, "అబూ దావూద్ గారు ప్రపంచంలో హదీసు రచన కోసం, పరలోకంలో స్వర్గం కోసం జన్మించారు" అని అన్నారు. ఇమామ్ అబూ దావూద్ (రహ్మా) అయిదు లక్షల హదీసుల నుండి ఎంపికచేసి "సునన్ అబూ దావూద్" గ్రంథాన్ని సంకలనం చేశారు. అందులో 4,600 హదీసులు ఉన్నాయి. ధర్మవేత్తలు ఈ గ్రంథాన్ని సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింల తరువాత గొప్ప ప్రామాణిక గ్రంథంగా పరిగణించారు. ఇమామ్ అబూ దావూద్ (రహ్మా) హిజ్రీ శకం 275లో శుక్రవారం రోజు ఇహలోకం వీడిపోయారు. ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్.'

**(4) ఇమామ్ తిర్మిజి (రహ్మా)**

ఈయన అసలు పేరు ముహమ్మద్ బిన్ ఈసా (రహ్మా). స్వస్థలం తిర్మిజ్‌లో పుట్టారు, విద్యార్జన కోసం అనేక ప్రాంతాలు తిరిగారు. ఆయన ఇమామ్ బుఖారీ (రహ్మా)గారి ప్రియ శిష్యులు. ఇమామ్ బుఖారీ (రహ్మా) ఆయన యోగ్యతా సామర్థ్యాల పట్ల గర్వించేవారు. ఇమామ్ తిర్మిజి (రహ్మా) గొప్ప ధర్మ పరాయణులు, దైవభీతిపరులు, గుణవంతులు. తరచుగా ఆయన దైవభీతితో కంటతడి పెట్టేవారు. దేవుడు ఆయనకు అసాధారణమైన జ్ఞాపకశక్తి ప్రసాదించాడు. ఆయనకు విషయం ఒకసారి వింటే చాలు మనసులో నాటుకుపోతుంది. హదీసుతోపాటు ఫిఖా, వ్యాఖ్యానాలలో కూడా మంచి ప్రావీణ్యం సంపాదించారు. ఆయన ఎన్నో గ్రంథాలు రాశారు. అన్నిటికంటే "సహీహ్ తిర్మిజి" ప్రసిద్ధి చెందింది. "ఏ ఇంట్లో తిర్మిజి గ్రంథం ఉంటుందో ఆ ఇంట్లో దైవప్రవక్త (సఅసం) మాట్లాడుతుంటారు" అనే మాట వ్యాప్తిలోకి వచ్చింది. ఆయన హిజ్రీ శకం 279లో తిర్మిజి పట్టణంలో చనిపోయారు. తన డెబ్బయి యేళ్ళ జీవితంలో అత్యధిక భాగం హదీసు సేవ కోసమే ధారపోశారు. దేవుడు ఆయనపై తన కారుణ్యం కురిపించుగాక! మనకు కూడా ఆయన అడుగుజాడలలో నడిచే భాగ్యం ప్రసాదించుగాక! ఆమీన్.

**(5) ఇమామ్ నసాయి (రహ్మా)**

ఈయన అసలు పేరు అహ్మద్ బిన్ షుఐబ్ (రహ్మా). ఆయన హిజ్రీ శకం 215లో ఖురాసాన్‌లోని సుప్రసిద్ధ పట్టణం 'నసా'లో జన్మించారు. అదే ఆయన స్వస్థలం కూడా. రేయింబవళ్ళలో అత్యధిక

భాగం దైవారాధనలో గడిపారు. తరచుగా ఉపవాసాలు పాటించేవారు. అనేకసార్లు హజ్ యాత్ర జరిపారు. 'జిహాద్' పట్ల కూడా ఎంతో ఆసక్తి ఉండేది. ఒకసారి ఈజిప్టు గవర్నర్‌తో కలసి జిహాద్‌లో పాల్గొని అనన్య ధైర్యసాహసాలు ప్రదర్శించారు. ఆయన యదార్థవాది. ఎవరికీ భయపడని నిర్భయుడు. ఈ కారణంగానే ఆయన జనం మధ్య నిలబడి "అమీర్ ముఆవియాను ప్రశంసిస్తూ ఉన్న ఒక్క హదీసు తప్ప మరేమీ నాకు లభించలేదు" అన్నారు. ఈ మాట వినగానే ప్రజలు కోపోద్రేకాలతో ఊగిపోతూ ఆయన్ని చితకబాదారు. ఇమామ్ నసాయి (రహ్మా) అధైర్యం చెందకుండా రక్తసిక్త దేహంతో ఇంటికి వచ్చారు. రాగానే "నన్నిక్కడ్నుంచి మక్కా తీసుకెళ్ళండి. మక్కాలోనే నేను చనిపోవాలి" అన్నారు. మక్కా తరలిపోయిన తరువాత హిజ్రీ శకం 303లో సోమవారం రోజు అక్కడే అంతిమశ్వాస విడిచారు. సఫా, మర్వా కొండల మధ్య ఆయన సమాధి ఉంది. హదీసు కూర్పు విషయంలో మొట్టమొదట ఆయన 'సునన్ కుబ్రా' అనే గ్రంథం సంకలనం చేశారు. తరువాత రమలా పాలకుని కోరికపై ఆ గ్రంథంలోని అత్యధిక ప్రామాణికత ఉన్న హదీసులను ఎంపిక చేసి మరో గ్రంథం సునాన్ లిల్ ముజ్‌తబా సంకలనం చేశారు. అదే 'సునన్ నసాయి' పేరుతో ప్రసిద్ధి చెందింది. ఇది ముఖ్యమైన ఆరు హదీసు గ్రంథాలలో ఒకటిగా చేరింది.

### (6) ఇమామ్ ఇబ్నెమాజ (రహ్మా)

ఈయన అసలు పేరు ముహమ్మద్ బిన్ యజీద్. మాజా అనేది తండ్రిగారి బిరుదు. అందుచేత ఇబ్నెమాజ పేరుతో ఆయన ప్రఖ్యాతిగాంచారు. ఇమామ్ ఇబ్నెమాజ హిజ్రీ శకం 209లో ఈరాన్‌లోని ఖజ్‌వీన్ అనే పట్టణంలో పుట్టారు. ఆయన హదీసు విద్యార్జన కోసం ఇరాఖ్, బస్రా, కూఫా, బగ్దాద్, మక్కా, సిరియా మొదలైన ప్రాంతాలు పర్యటించారు. ఎంతో కష్టపడి హదీసులు సేకరించారు. ఆయన గొప్ప మేధాసంపన్నులు, ధర్మపరాయణులు, అసాధారణమైన జ్ఞాపక శక్తి కలవారు. చరిత్ర, వ్యాఖ్యానాలను గురించి కూడా ఆయన గ్రంథాలు రాశారు. అయితే ఆయన రచనలలో "సునన్ ఇబ్నెమాజ" మాత్రమే ఎక్కువ ప్రాచుర్యం పొందింది. ఇది కూడా ముఖ్యమైన ఆరు హదీసు గ్రంథాల జాబితాలో చేర్చబడింది. ఇమామ్ ఇబ్నెమాజ (రహ్మా) 64 ఏండ్ల వయస్సులో రమజాన్ నెల సోమవారం రోజు ఇహలోకం నుంచి శాశ్వతంగా నిష్క్రమించారు. ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి?**

1. ఏ మహానుభావుల్ని 'ముహద్దిసీన్'లని అంటారు?
2. 'సహహ్ సిత్త' అంటే ఏ గ్రంథాలు? వాటి పేర్లు తెలుపండి.
3. ఇమాం బుఖారి(రహ్మా) గారి ప్రథమ రెండు గ్రంథాలు ఏవి? వాటిని ఆయన ఎప్పుడు, ఎక్కడ సంకలనం చేశారు?

4. ఇమాం బుఖారి (రహ్మ)కు సంబంధించిన ఏదైనా ఒక సంఘటనను వినిపించండి.
5. ఇమాం తిర్మిజీ(రహ్మ) ఎవరి శిష్యులు?
6. ఇమాం నసాయి (రహ్మ) ఎలాంటివారు?
7. ఇమాం ఇబ్నె మాజ(రహ్మ) ఎప్పుడు, ఎక్కడ జన్మించారు?

**ఆ) క్రింది ఖాళీలను పూరించండి.**

1. దివ్యఖుర్ఆన్ తరువాత 'సహీహ్ బుఖారి' అన్నిటిలోకెల్లా అత్యధిక ...................... గ్రంథంగా అంగీకరించబడింది.
2. ఇమాం తిర్మిజీ(రహ్మ)కు అల్లాహ్ అసామాన్యమైన ...................... ప్రసాదించాడు.
3. ఇమాం ...................... గారికి హదీసుతో పాటే ఫికాహ్, తఫ్సీర్ (వ్యాఖ్యానం)లో కూడా గొప్ప స్థానముండేది.
4. ఇమాం బుఖారీ(రహ్మ)కు బాల్యంలోనే...................... హదీసులు జ్ఞాపకముండేవి.
5. ...................... తన కాలంలో హదీసులో ఇమాంగా గుర్తించబడేవారు.
6. ఇమాం ..............గారు హదీసు జ్ఞానం పొందడానికి ఇరాక్, బస్రా, కూఫా, బగ్దాద్, మక్కా సిరియా, ఈజిప్ట్ మొదలుగా గల ప్రాంతాల ప్రయాణం చేశారు.

**ఇ) కాలం 'అ'లో ముహద్దిసీన్ల పేరు, కాలం 'ఇ'లో వారి అసలు పేరు, కాలం 'ఉ'లో వారి జన్మస్థలం, మరణించిన తేదీలు వ్రాయబడ్డాయి. కాలం అ, ఇ, ఉ లోని సంబంధిత, సముచిత వాటిని గుర్తించి, వాటి జతలు కలుపండి.**

| అ | ఇ | ఉ |
|---|---|---|
| 1. ఇమాం బుఖారి(రహ్మ) | ముహమ్మద్ బిన్ యజీద్ | ఖురాసాన్‌లోని ప్రఖ్యాత నగరం నసాలో, జననం 215 హిజ్రీ, మరణం 275వ హిజ్రీ |
| 2. ఇమాం ముస్లిం (రహ్మ) | ముహమ్మద్ బిన్ ఈసా | బుఖారా, జననం షవ్వాల్ 13, 94 హిజ్రీ, మరణం 256 హిజ్రీ |
| 3. ఇమాం అబూదావూద్(రహ్మ) | ముహమ్మద్ బిన్ ఇస్మాయీల్ | నీషాపూర్, జననం 204, హిజ్రీ– మరణం 261 హిజ్రీ |
| 4. ఇమాం తిర్మిజి(రహ్మ) | ముస్లిం బిన్ హజ్జాజ్ | సజిస్తాన్, జననం 202 హిజ్రీ, మరణం 275 హిజ్రీ |

| | | |
|---|---|---|
| 5. ఇమాం నసాయి (రహ్మ) | సులేమాన్ బిన్ అష్అస్ | తిర్మజ్, జననం 209 హిజ్రీ, మరణం 279 హిజ్రీ |
| 6. ఇమాం ఇబ్నె మాజ(రహ్మ) | అహ్మద్ బిన్ షుఐబ్ | ఖజ్వీన్, జననం 209 హిజ్రీ, మరణం 273 హిజ్రీ |

**ఈ) కాలం 'అ'లో హదీసు ఇమాముల పేర్లు, కాలం 'ఇ'లో వారి ప్రఖ్యాత కార్య కాలం 'ఉ'లో వారు సంకలనం చేసిన హదీసు గ్రంథాల పేర్లు ఇవ్వబడ్డాయి. సంబంధిత, సముచిత వాటిని గుర్తించి వాటి జతలు కలుపండి.**

| అ | ఇ | ఉ |
|---|---|---|
| 1. ఇమాం బుఖారి (రహ్మ) | ఈ గ్రంథంలో 4,800 హదీసులున్నాయి | అల్‌జామివుల్ సహీహుల్, ముస్లిం |
| 2. ఇమాం ముస్లిం (రహ్మ) | అమీరుల్ మోమినీన్ ఫిల్ హదీసు | సునన్ అబీ దావూద్ |
| 3. ఇమాం అబూదావూద్ (రహ్మ) | ఇమాం బుఖారి గారి గర్వించదగ్గ శిష్యుడు | అల్‌జామివుల్-సహీహ్- లిల్ తిర్మిజి |
| 4. ఇమాం తిర్మిజి(రహ్మ) | సఫా, మర్వాల మధ్య ఈయనగారి సమాధి ఉంది | సునన్- నసాయి |
| 5. ఇమాం నసాయి(రహ్మ) | తఫ్సీర్ (ఖుర్‌ఆన్ వ్యాఖ్యానం), చరిత్రలో కూడా ఈయన గ్రంథాలు వ్రాశారు | సునన్ ఇబ్నెమాజ |
| 6. ఇబ్నెమాజ (రహ్మ) | వీటి ప్రామాణికతను ఆయన కాలపు హదీసువేత్తలు ఏకగ్రీవంగా అంగీకరించిన హదీసుల్ని మాత్రమే ఈయన తన గ్రంథంలో తీసుకున్నారు | అల్ జామ ఉల్ సహీహ్ |



# 23. దేవుని ప్రియ దాసులు

ఖుర్ఆన్ అల్లాహ్ ప్రసాదించిన దివ్యగ్రంథం. ఈ గ్రంథంలో అల్లాహ్ ప్రియదాసుల గుణగణాలు ఎలా ఉంటాయో తెలియజేయబడ్డాయి. హదీసులలో కూడా దేవుని ప్రియదాసుల గుణగణాలు వర్ణించబడ్డాయి. వారిలో కొందరిని గురించి ఇక్కడ తెలుసుకుందాం.

1. దేవుని ప్రియదాసులు నేల మీద (విర్రవీగకుండా) నమ్రతగా నడుస్తారు. మూర్ఖులు వారితో వాదనకు దిగితే, మీకు సలాం అంటారు.
2. దేవుని ప్రియదాసులు తమ ప్రభువు సన్నిధిలో నిలబడి నమాజు చేస్తూ, సాష్టాంగపడుతూ రాత్రిళ్ళు గడుపుతారు. వారు దైవాన్ని వేడుకుంటూ, "ప్రభూ! మమ్మల్ని నరకయాతనల నుండి కాపాడు. ఆ యాతనలు ఎంతో బాధాకరంగా, దారుణంగా ఉంటాయి" అని అంటారు.
3. దేవుని ప్రియదాసులు అల్లాహ్‌ను మాత్రమే తమ దైవంగా అంగీకరిస్తారు. అల్లాహ్‌కు తప్ప మరెవరికీ వారు మొరపెట్టుకోరు. వారు అన్యాయంగా ఎవరినీ హతమార్చరు. అశ్లీల విషయాలకు దూరంగా ఉంటారు.
4. దేవుని ప్రియదాసులు అసత్యానికి ఎన్నడూ సాక్షులుగా ఉండరు. అబద్ధ మాడరు. ఎప్పుడైనా వారు పనికిమాలిన వ్యవహారం మీదుగా పోవలసి వస్తే దాన్ని పట్టించుకోకుండా హుందాగా, గౌరవప్రదంగా దాటి వెళ్తారు.
5. వారికి దేవుని సూక్తులు విన్పించినప్పుడు ఎంతో శ్రద్ధగా వింటారు. తరువాత వాటిని ఆచరించడానికి ప్రయత్నిస్తారు.
6. వారు అల్లాహ్‌ను వేడుకుంటూ, "దేవా! మా భార్యాపిల్లల ద్వారా మా కంటికి చలువ ప్రసాదించు. మమ్మల్ని సజ్జనుల కోసం ఆదర్శంగా చెయ్యి." అంటారు.
7. వారు నమాజు క్రమం తప్పకుండా, నియమబద్ధంగా చేస్తారు. తమ ధనం నుండి అర్థించేవారికి, అర్థించనివారికి కూడా సహాయం చేస్తారు.
8. వారు పరలోకాన్ని దృఢంగా విశ్వసిస్తారు. తమ ప్రభువు శిక్ష పట్ల ఎల్లప్పుడూ భయపడుతూ ఉంటారు. అసలు దేవుని శిక్ష పట్ల నిర్భయంగా ఉండటం కూడా దైవదాసులకు తగదు.
9. వారు ఎంతో నిజాయితీపరులు. తమ అప్పగింతలు, ప్రమాణాలు, ఒప్పందాల విషయంలో నిజాయితీగా వ్యవహరిస్తారు. సత్యానికి కట్టుబడి ఉంటారు. తమ నమాజుల పట్ల ఎంతో శ్రద్ధవహిస్తారు.
10. వారు దేవుని మీద గల ప్రేమాభిమానాలతో నిరుపేదలకు, నిరాధారులకు, అనాథలకు, ఖైదీలకు అన్నదానం చేస్తారు. అయితే వారి నుండి ఎలాంటి ప్రతిఫలం ఆశించరు.

11. వారు ఒకరికొకరు సహాయం చేసుకుంటూ పరస్పరం శ్రేయోభిలాషులుగా ఉంటారు. వారు ప్రజలను చెడుల నుంచి వారిస్తూ సత్కార్యాల వైపు ప్రేరేపిస్తారు. సరైన రీతిలో నమాజు చేస్తారు. దైవప్రవక్త (సఅసం) ఆజ్ఞలను పాటిస్తారు.

12. దేవుని ప్రియదాసుల ముందు దేవుని ప్రస్తావన వస్తే వారి గుండెలు దడదడలాడిపోతాయి. దేవుని పట్ల, ఆయన సూక్తుల పట్ల వారి విశ్వాసం మరింత దృఢమవుతుంది. వారు తమ ప్రభువునే నమ్ముకుంటారు. నమాజు వ్యవస్థ నెలగొల్పుతారు. సత్కార్యాల కోసం తమ ధనాన్ని వెచ్చిస్తారు.

13. వారు కన్పించని తమ ప్రభువుకు భయపడుతుంటారు. ప్రళయ దినాన్ని జ్ఞాపకం చేసుకొని కంపించిపోతారు.

14. దేవుని ప్రియదాసులు దైవమార్గంలో స్థిరంగా నిలబడి సంఘటితంగా పోరాడుతారు.

15. దేవుని ప్రియదాసులు పరిశుభ్రంగా ఉంటారు.

16. దేవుని ప్రియదాసులు ఎల్లప్పుడూ న్యాయానికి కట్టుబడి ఉంటారు.

17. దేవుని ప్రియదాసులు దేవుణ్ని అమితంగా అభిమానిస్తారు. తోటి విశ్వాసులతో మృదువుగా మసలుకుంటారు  అవిశ్వాసుల విషయంలో కఠినంగా వ్యవహరిస్తారు.

18. వారు దేవుని విషయంలో చేసిన ప్రమాణాలు ఎట్టి పరిస్థితుల్లోనూ నెరవేరుస్తారు.

19. వారు తమ పాపక్షమాపణ కోసం తమ ప్రభువుని వేడుకుంటారు. దైవారాధనలో నిమగ్నులయి ఉంటారు. ఉపవాసాలు పాటిస్తారు. ప్రార్థనలు చేస్తారు. ప్రజలను సత్కార్యాల వైపు ప్రేరేపిస్తారు. చెడుల నుండి వారిస్తారు. దేవుడు నిర్ణయించిన హద్దులను కాపాడుతారు.

ఇవి ఖుర్ఆన్ వర్ణించిన సుగుణాలు. ఇక దైవప్రవక్త (సఅసం) తెలిపిన విషయాలు కూడా విందాం:

1. తోటి మానవుల పట్ల సత్ప్రవర్తనతో మసలుకునేవారే దేవునికి అందరికంటే ఎక్కువ ప్రియమైన దాసులు.

2. ప్రాపంచిక వ్యామోహంలో పడకుండా ఆత్మసంతృప్తి కలిగి ఉంటూ, తన ప్రభువుని రహస్యంగా ఆరాధించేవాడే దేవునికి అందరికంటే ప్రియమైన దాసుడవుతాడు.

3. విశ్వాసి ప్రతి ఒక్కరికీ అభిమానవంతుడవుతాడు. ఇతరులను ప్రేమించని, ఇతరులచే ప్రేమించబడని మనిషిలో ఎలాంటి మంచితనం లేదు.

4. ఒకతను దైవప్రవక్త (సఅసం) దగ్గరకు వచ్చి, "నేను దేవునికి, ప్రజలకు కూడా అభిమానవంతు డనయ్యేందుకు ఏదైనా మంచి పని చెప్పండి, చేస్తాను" అన్నాడు. దైవప్రవక్త సమాధానమిస్తూ, "ప్రాపంచిక వ్యామోహానికి దూరంగా ఉండు, దేవునికి అభిమానవంతుడవతావు. ప్రజల సిరిసంపద లను ఆశించకు, ప్రజలకు అభిమానవంతుడవతావు" అని అన్నారు.

5. ఎవరు నా కోసం దరూద్ ఎక్కువ సార్లు పఠిస్తాడో అతను ప్రళయ దినాన నాకు ఎక్కువ దగ్గరగా ఉంటాడు అని చెప్పారు దైవప్రవక్త (సఅసం).

ప్రతి ముస్లిం దేవునికి ప్రియమైన దాసుడయి ఉండాలనే కోరుకుంటాడు. అలాంటి వారు ఖుర్‌ఆన్, హదీసులలో పేర్కొనబడిన ప్రియదాసుల లక్షణాలను, సుగుణాలను అలవరచుకోవడానికి ప్రయత్నించాలి.

## అభ్యాసం

**అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వండి?**

1. అల్లాహ్‌కు ప్రీతికరమైన దాసుల ఏ సుగుణాలయితే ఖుర్‌ఆన్‌లో వివరించబడ్డాయో వాటిలో నుండి ఐదు సుగుణాలను పేర్కొండి.
2. భూమిపై మెత్తగా పాదం మోపి నడవడం అంటే ఏమిటి?
3. స్త్రీలను, పిల్లల్ని 'కంటికి చలువ కల్గించడం' అంటే భావం ఏమిటి?
4. నమాజులకు సంబంధించి పూర్తిశ్రద్ధ కనబరచాలంటే అర్థం ఏమిటి?
5. ముమ్మరంగా దరూద్ షరీఫ్ పఠిస్తే ఏ ప్రతిఫలం లభిస్తుందని ప్రియప్రవక్త(స) తెలిపారు?
6. అల్లాహ్ ప్రియ దాసులు ఆయన్ను ఏమని వేడుకుంటారు?
7. అల్లాహ్ ప్రియదాసులు చెడుకార్యాల్ని చూసి ఎలా వ్యవహరిస్తారు?
8. అల్లాహ్ ప్రియ దాసులు తమ సంపదను ఎలా ఖర్చు చేస్తుంటారు?
9. అల్లాహ్‌కు, దైవదాసులకు ప్రీతిపాత్రం కావాలంటే నేనేం చేయాలని ఒక వ్యక్తి అడిగిన దానికి ప్రియప్రవక్త(స) ఏమని సమాధానమిచ్చారు?

**2. క్రింది ఖాళీలను పూరించండి?**

1. అల్లాహ్‌కు ప్రీతిపాత్రులయిన దైవదాసులు అల్లాహ్‌నే తమ ........... గా గుర్తిస్తారు.
2. ఎవరయితే అల్లాహ్ సృష్టితాల పట్ల మంచి .......... చేస్తారో, వారే దైవదాసులందరిలోకెల్లా అల్లాహ్‌కు ప్రీతిపాత్రులు.
3. ఎవరయితే ఇతరుల్ని ప్రేమించరో, ఇతరులూ వారిని ప్రేమించరు, అలాంటి వారిలో ఎలాంటి ............ లేదు.
4. ఎప్పుడయితే వారి ముందు అల్లాహ్ ప్రస్తావన వస్తుందో, వారి హృదయాలు .......... పోతాయి. కేవలం ఇలాంటి వారే అల్లాహ్‌కు ప్రీతిపాత్రులైన దైవదాసులు.



# 24. సుగుణ సంపద

ప్రియప్రవక్త (సఅసం) నైతికతను గురించి ప్రస్తావిస్తూ, "నేను సుగుణ సంపద పరిపూర్తిచేయడానికి పంపబడ్డాను" అని అన్నారు. అబద్ధం, దౌర్జన్యం, గర్వం, అసూయ వగైరా దుర్గుణాలు మాని, సత్యం, పవిత్రత, లజ్జ, సానుభూతి, ఓర్పు, సహనం, పరోపకారం మొదలైన సద్గుణాలను అలవరచుకోవాలి.

ప్రతి పనీ తగిన రీతిలో చేయాలి. ప్రతి ఒక్కరి హక్కును నెరవేర్చాలి. ప్రతి ఒక్కరితో సత్ప్రవర్తన కలిగి ఉండాలి. మన ప్రియప్రవక్త (సఅసం) ప్రపంచ మానవులందరికంటే ఎక్కువ సద్గుణసంపన్నులు. ఆయన ప్రజలకు మంచి నీతి నడవడికలను గురించి బోధించేవారు. ఎల్లప్పుడూ సత్యమే పలికేవారు. అందుకే జనం ఆయన్ని "సాదిఖ్" (సత్యసంధుడు) అన్నారు. ఆయన ఎంతో నిజాయితీ పరులు అయి నందున ప్రజలు ఆయన్ని "అమీన్" (నిజాయితీపరుడు) అని కూడా పిలిచేవారు. ఆయన అశ్లీల చేష్టలకు, అశ్లీల విషయాలకు దూరంగా ఉండేవారు. బిడియం కూడా విశ్వాసంలోని భాగమే అని చెప్పేవారు. ఆయన అనాథలను, వితంతువులను ఆదరించేవారు. అతిథి సత్కారాలు చేసేవారు. ప్రతి ఒక్కరి హక్కును సదా గౌరవించేవారు. "దేవా! నన్ను ఉత్తమోత్తమ సుగుణవంతుణ్ణి చెయ్యి. చెడుల నుండి కాపాడు" అని ప్రార్థించేవారు.

అల్లాహ్ ఏవిధమైన చెడులులేని పరమ పవిత్రుడు. నీతికి, శ్రేయానికి సంబంధించిన సమస్త విషయాలు ఆయనలో ఉన్నాయి. దేవుడు మనల్ని తన భూమిపై ఖలీఫాగా నియమించి, ఇక్కడున్న అనేక వస్తువులు మనకు అధీనం చేశాడు. అందుచేత మనం కూడా యావత్తు సుగుణ సంపత్తిని అలవరచు కోవాలి. హక్కులు, సుగుణాలు చాలా ఉన్నాయి. వాటిలో మనం కొన్నిటిని గురించి తెలుసుకున్నాం కూడా. ఇక్కడ మరికొన్నిటిని గురించి తెలుసుకుందాం.

### (1) సత్యసంధత

సత్యం సకల సుగుణాలకు మూలం. సత్యం అల్లాహ్ సుగుణం. అందుకే దైవప్రవక్త (సఅసం) ఎన్నడూ అబద్ధమాడలేదు. సత్యసంధతలో ఇహపర లోకాల శ్రేయం ఉంది. ఇహలోకంలో కూడా ప్రజలు సత్యవంతుడి పట్ల నమ్మకం ఉంచుతారు అతడ్ని గౌరవదృష్టితో చూస్తారు. పరలోకంలో కూడా సత్యసంధుడికి మోక్షం లభిస్తుంది. సత్యం పలికేవారు అన్ని చెడులకు దూరంగా ఉంటారు.

మనం ముస్లిములం. అంటే దేవుని విధేయులం. దేవుడ్ని, ఆయన ప్రవక్త (సఅసం)ను హృదయ పూర్వకంగా విశ్వసించాం. ఇస్లాం సత్యధర్మం. మన ప్రవక్త (సఅసం) కూడా సత్యవంతులే. మన ప్రభువు సత్యానికి ప్రతీక. ఆయన చేసిన వాగ్దానాలు సత్యవాగ్దానాలు. కనుక మనం ఎల్లప్పుడూ సత్యమే పలకాలి. మనసులో ఏముంటుందో అదే నోటితో వ్యక్తపరచాలి. చెప్పిందే చేయాలి. చేసిందే చెప్పాలి. లోకులకు భయపడి సత్యాన్ని దాచకూడదు. సత్యం మాట్లాడటానికి ఎన్నటికీ జంకకూడదు. అసత్య సాక్ష్యం చెప్ప

కూడదు. ప్రాణం పోయినా సరే అబద్ధమాడరాదు. సత్యసంధులకు ఉభయ లోకాలలోనూ విజయం సిద్ధిస్తుంది.

**(2) బిడియం**

మన ప్రియప్రవక్త (సఅసం) బిడియం ఎంతో శ్రేష్ఠమైన విషయం అన్నారు. సిగ్గు, బిడియంగల మనిషి నీటి నుండి బయటపడిన చేప ఎలా భయపడుతుందో అలా చెడుకు భయపడతాడు. లజ్జావిహీనుడు ఎలాంటి చెడ్డ పని చేయడానికైనా సిగ్గుపడడు. దైవప్రవక్త (సఅసం) అందరికన్నా ఎక్కువ లజ్జ, బిడియం కలవారు. చిన్నతనం నుండే ఆయన బిడియం కలవారు. దైవప్రవక్త అయిన తరువాత కూడా ఆయన పరిస్థితి ఇలాగే ఉండేది. ఒక్కమాటలో చెప్పాలంటే ఆయన పరదా పాటించే పడుచుపిల్లల కంటే కూడా సిగ్గు కలవారు.

“విశ్వాసానికి సంబంధించిన 70కి పైగా శాఖలున్నాయి. సిగ్గు కూడా విశ్వాసంలోని ఒక భాగమే” అన్నారు దైవప్రవక్త (సఅసం). ఆయన (సఅసం) మరొక సందర్భంలో మాట్లాడుతూ, “నగ్నం కాకండి. మీ వెంట ఎల్లప్పుడూ దేవదూతలు ఉంటారు. మలమూత్ర విసర్జన సమయంలో మాత్రమే వారు మీ నుండి వేరవుతారు. వారి పట్ల సిగ్గుపడండి” అని అన్నారు. “సిగ్గు బిడియం వల్ల మనిషికి మేలే జరుగు తుంది” అని కూడా ఆయన (సఅసం) చెప్పారు. దివ్యఖుర్‌ఆన్‌లో, “దేవుడు మిమ్మల్ని సిగ్గుమాలిన పనుల నుండి, పాపకార్యాల నుండి వారిస్తున్నాడు” అని ఉంది. మనిషికి సిగ్గు అనేది లేకపోతే అతను తన ఇష్టమొచ్చినట్లు వ్యవహరిస్తాడు. “మీలో సిగ్గూఎగ్గూ లేకపోతే మీకిష్టం వచ్చినట్లు ప్రవర్తించండి” అన్నారు దైవప్రవక్త (సఅసం). “దేవుడు అందరికన్నా సిగ్గు, ఆత్మాభిమానం కలవాడు” అని హదీసులో ఉంది. దేవుడు సిగ్గుమాలిన విషయాలన్నిటినీ నిషేధించాడు. అందుకే మనం సిగ్గుమాలిన విషయాలన్నిటికీ దూరంగా ఉంటున్నాం. సిగ్గుమాలిన విషయాలు మాట్లాడేవారితో కలసిమెలసి ఉండము. ఎప్పుడైనా యాదృచ్ఛికంగా అశ్లీల విషయాలు మాట్లాడేవారి దగ్గర్నుంచి, అశ్లీల విషయాలు జరిగే చోటు నుంచి పోవడం జరిగితే మనం చూపులు మరల్చుకొని సిగ్గుపడుతూ గౌరవప్రదంగా దాటిపోతాం.

**(3) ప్రేమ, సానుభూతులు**

ముస్లిం ప్రేమ, సానుభూతులకు ప్రతీక. అతను ప్రతి ఒక్కరి పట్లా ప్రేమ, సానుభూతులతో ప్రవర్తిస్తాడు. మన ప్రియప్రవక్త (సఅసం) ఇలా అన్నారు: “ప్రేమ, సానుభూతి, శ్రేయోభిలాషలకు ప్రతిరూపమే ఇస్లాం. కనుక (ముస్లిం) దేవుని పట్ల, ఆయన ప్రవక్త (సఅసం) పట్ల ప్రేమ విశ్వాసాలు తన పెద్దల పట్ల, ఇరుగుపొరుగువారి పట్ల, సామాన్య ముస్లింల పట్ల ప్రేమసానుభూతులు (కలిగి ఉంటాడు)” పంచు కొంటాడు.” ముస్లిం ప్రతి ఒక్కరికీ శ్రేయోభిలాషియే. ప్రతి ఒక్కరి పట్లా సానుభూతితో ప్రవర్తిస్తాడు. అతను దేవుడ్ని, ఆయన ప్రవక్త (సఅసం)ను ప్రేమిస్తాడు. మంచితనం, పుణ్యకార్యాలను ప్రేమిస్తాడు. సజ్జనులను ప్రేమిస్తాడు. వారిపట్ల సానుభూతి చూపుతాడు. ఇతరుల కష్టాలలో పాలుపంచు

కుంటాడు. యావత్తు మానవులు ఒకే తల్లిదండ్రుల సంతానమని, అందరూ పరస్పరం అన్నదమ్ములని అతను భావిస్తాడు. అందుకే అతను అందరి పట్లా సమభావంతో మెలుగుతాడు. "ప్రజలను కరుణించనివాడ్ని దేవుడు కరుణించడు" అని మన ప్రియప్రవక్త (సఅసం) అన్నారు.

వితంతువుల పట్ల ఆదరణ, నిరుపేదలు-అనాథల పట్ల సానుభూతి, అతిథుల పట్ల సత్కారం, రోగగ్రస్తులు-బలహీనుల పట్ల సానుభూతి, సంతానం పట్ల వాత్సల్యం, బంధువుల పట్ల ప్రేమ, పొరుగు వారితో సద్వర్తనం...ఇలా ప్రతి ఒక్కరి పట్లా ప్రేమసానుభూతులు కలిగి ఉండాలని మన ప్రియప్రవక్త (స) బోధించారు. ఆయన బోధన ప్రభావంతోనే ఆయన సహాబీలు (అనుచరులు) ప్రతి ఒక్కరి పట్లా ప్రేమసానుభూతులతో ప్రవర్తించేవారు. తాము స్వయంగా పస్తుండి ఇతరులకు అన్నం పెట్టేవారు. తాము స్వయంగా కష్టాలు భరించి ఇతరులకు సుఖాన్ని పంచిపెట్టేవారు. అందుకే వారిని ప్రతి ఒక్కరూ అభిమానించే వారు. ముస్లిములు ముస్లింని అభిమానించడం సహజమే. కాని ముస్లిమేతరులు సైతం తమవారికంటే కూడా వారిని ఎక్కువగా అభిమానించేవారు.

## అభ్యాసం

**అ) క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వండి?**

1. మంచి నైతికతలు (నడవడికలు) అంటే ఏమిటి?
2. సత్యంలో (ఇహపర) ఇరు ప్రపంచాల సాఫల్యం ఉంది, ఎలా?
3. సిగ్గు, బిడియాల గురించి ప్రియప్రవక్త(స) ఏ ఏ విషయాలు చెప్పారు?
4. ముస్లిం ప్రతి ఒక్కరి శ్రేయోభిలాషి అయివుంటాడు' - వివరించండి.

**ఆ) ఖాళీ స్థలాల్ని పూరించండి**

1. మంచి నైతికతల (నడవడికల)........... కోసమే నేను పంపబడ్డాను.
2. సిగ్గు (బిడియం) విశ్వాసంలోని ....................
3. సత్యవంతుడైన మనిషి ఇహపరాల్లో ..................
4. ఒకవేళ ఎప్పుడయినా కాకతాళీయంగా చెడుమాటలు లేక చెడు ప్రాంతం గుండా వెళ్ళాల్సి వస్తే చూపులు వాల్చి సిగ్గు మరియు ............................తో సాగిపోతారు.



# 25. దుఆ (ప్రార్థన)

ఓ ప్రభూ!
జీవితమిచ్చావు, నా మీద దయచూపావు
సృష్టిలోనే శ్రేష్ఠునిగా నన్నాదరించావు

ఓ ప్రభూ!
తారలను చేశావు వెలుగుమయం
సూర్యచంద్రులకిచ్చావు కిరణ సముదాయం
నా ఆలోచనలను చెయ్యి ప్రకాశవంతం.

ఓ ప్రభూ!
పుష్పగుచ్ఛాలకిచ్చావు తాజాదనం
విశ్వాసంతో నా హృదయాన్ని చేయి తేజోమయం

ఓ ప్రభూ!
నా జీవిత లక్ష్యానికివ్వు పరిమళం
దుష్టశక్తుల దాస్యాన్నుండి రక్షించు
దైవప్రవక్త విధేయత నాలో కలిగించు
దైవమార్గాన నాకు అమరగతి ప్రసాదించు

ఓ ప్రభూ!
నీవిచ్చావు నాకు సుఖం, ఆనందం
ప్రసాదించు నాకు నీ ప్రసన్నతాభాగ్యం.



# 26. ప్రతి రోజూ పఠించవలసిన కొన్ని దుఆలు

### 1. నిద్ర నుండి మేల్కొన్నప్పుడు

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِي أَحْيَانَا بَعْدَ مَا أَمَاتَنَا وَإِلَيْهِ النُّشُوْرُ

**అల్‌హమ్‌దులిల్లాహిల్లజీ అహ్‌యానా బ'అద మా అమాతనా వ ఇలైహిన్నుషూర్.**

సమస్త స్తోత్రాలు అల్లాహ్ కొరకే. ఆయనే మేము చని పోయాక మాకు జీవం పోశాడు. చివరికి ఆయన వైపునకే మేము మరలిపోవలసి వుంది. *(బుఖారి మఅల్‌ఫతహ్ 113/11, ముస్లిం 2083/4)*

### 2. వస్త్రధారణ సమయంలో దుఆ

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِيْ كَسَانِيْ هٰذَا (الثَّوْبَ) وَرَزَقَنِيْهِ مِنْ غَيْرِ حَوْلٍ مِنِّيْ وَلَا قُوَّةٍ

**అల్‌హమ్దులిల్లాహిల్లజీ కసానీ హాజా (అస్సౌబ) వరజ ఖనీహి మిన్‌గైరి హౌలి మిన్నీ వలా ఖువ్వహ్** *(అబూ దావూద్, తిర్మిజి, ఇబ్నెమాజ, అర్‌వాఉల్ గలీల్ 47/7 చూడండి)*

సమస్త స్తోత్రాలు అల్లాహ్‌కే శోభిస్తాయి. ఆయనే నాకు ఈ వస్త్రాలను తొడిగాడు. నా శక్తిసామర్థ్యాల ప్రమేయం లేకుండానే వీటిని నాకు ప్రసాదించాడు.

### 3. నూతన వస్త్రాలు ధరించేటప్పటి దుఆ

اَللّٰهُمَّ لَكَ الْحَمْدُ أَنْتَ كَسَوْتَنِيْهِ أَسْأَلُكَ مِنْ خَيْرِهِ وَخَيْرِ مَا صُنِعَ لَهُ، وَأَعُوْذُ بِكَ مِنْ شَرِّهِ وَشَرِّ مَا صُنِعَ لَهُ

**అల్లాహుమ్మ లకల్‌హమ్‌దు అన్‌త కసౌతనీహి, అస్‌అలుక మిన్ ఖైరిహీ వ ఖైరి మా సునిఅ లహూ వ అవూజుబిక మిన్‌షర్రిహీ వ షర్రి మా సునిఅలహూ.** (అబూదావూద్)

ఓ ప్రభూ! స్తోత్రం నీ కొరకే. నీవే వీటిని తొడిగించావు నాకు. ఏ శుభం, ప్రయోజనం కొరకు వీటిని తయారు చేశావో అలాంటి ప్రయోజనాన్నే నేను ఆశిస్తున్నాను. ఇంకా ఏ కీడు కోసం ఇవి తయారు చేయబడ్డాయో ఆ కీడు నుండి నీ శరణు కోరుతున్నాను. *(అబూదావూద్, తిర్మిజి)*

### 4. బట్టలు విడిచేటప్పటి దుఆ

بِسْمِ اللهِ బిస్మిల్లాహ్

అల్లాహ్ పేరుతో *(తిర్మిజి)*

### 5. మలమూత్ర విసర్జనకు వెళ్ళేటప్పటి దుఆ

[بِسْمِ اللهِ] اَللّٰهُمَّ إِنِّيْ أَعُوْذُ بِكَ مِنَ الْخُبُثِ وَالْخَبَائِثِ

**'బిస్మిల్లాహి' అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మినల్ ఖుబుసి వల్ ఖబాయిస్.**

అల్లాహ్ పేరుతో. ఓ అల్లాహ్ నేను మగ జిన్నాతుల కీడు నుండి ఆడ జిన్నాతుల కీడు నుండి నీ శరణు కోరుతు న్నాను. *(బుఖారి)*

### 6. మరుగుదొడ్డి నుండి బయటికి వచ్చేటప్పటి దుఆ

غُفْرَانَكَ గుఫ్‌రానక

ఓ అల్లాహ్! నా పాపమన్నింపుకై నిన్ను వేడుకుంటున్నాను. *(తిర్మిజి అబూదావూద్, ఇబ్నెమాజ)*

### 7. వుజూకు ముందు దుఆ

بِسْمِ اللهِ బిస్మిల్లాహ్

అల్లాహ్ పేరుతో *(అబూదావూద్, ఇబ్నెమాజ)*

### 8. వుజూ చేసిన పిదప దుఆ

أَشْهَدُ أَنْ لاَّ إِلٰهَ إِلاَّ اللهُ وَحْدَهُ لاَ شَرِيْكَ لَهُ وَأَشْهَدُ أَنَّ مُحَمَّداً عَبْدُهُ وَرَسُوْلُهُ.

**అష్‌హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లా షరీక లహూ వ అష్‌హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహు.**

అల్లాహ్ తప్ప మరెవడూ ఆరాధ్యుడు లేడని నేను సాక్ష్యం ఇస్తున్నాను. ఆయన ఒక్కడే. ఆయనకు సహవర్తులు ఎవరూలేరు. ముహమ్మద్(స) ఆయన దాసుడు, ప్రవక్త అని కూడా నేనుసాక్ష్యం ఇస్తున్నాను. *(ముస్లిం 209/1)*

### 9. ఇంటినుండి బయలుదేరేటప్పటి దుఆ

بِسْمِ اللهِ تَوَكَّلْتُ عَلَى اللهِ وَلاَ حَوْلَ وَلاَ قُوَّةَ إِلاَّ بِاللهِ

**బిస్మిల్లాహి తవక్కల్‌తు అలల్లాహి వలా హౌల వలా ఖువ్వత ఇల్లాబిల్లాహి**

అల్లాహ్ పేరుతో. నేను అల్లాహ్‌పై భారంమోపాను. అల్లాహ్ సహాయం లేకుండా దేని నుంచీ రక్షణ పొందే శక్తి నాలో లేదు. లేక మరేమైనా చేసే శక్తి కూడా లేదు. *(అబూదావూద్)*

### 10. ఇంట్లో ప్రవేశించే ముందు దుఆ

بِسْمِ اللهِ وَلَجْنَا، وَبِسْمِ اللهِ خَرَجْنَا، وَعَلَى رَبِّنَا تَوَكَّلْنَا

**బిస్మిల్లాహి వలజ్‌నా వబిస్మిల్లాహి ఖరజ్‌నా వఅలా రబ్బినా తవక్కల్‌నా.**

అల్లాహ్ నామంతో ప్రవేశించాము. అల్లాహ్ నామంతోనే బయలుదేరాం ఇంకా మేము మా ప్రభువుపైనే ఆశలు పెట్టుకున్నాం. *(అబూదావూద్)*

### 11. మస్జిద్‌లో ప్రవేశించే ముందు దుఆ

اَللّٰهُمَّ افْتَحْ لِيْ أَبْوَابَ رَحْمَتِكَ

**అల్లాహుమ్మఫ్ తహ్‌లీ అబ్‌వాబ రహ్మాతిక్.**

ఓ అల్లాహ్! నా కొరకు నీ కారుణ్య ద్వారాలు తెరిచివుంచు. *(అబూదావూద్)*

### 12. మస్జిద్ నుంచి నిష్క్రమించే ముందు దుఆ

اَللّٰهُمَّ إِنِّيْ أَسْأَلُكَ مِنْ فَضْلِكَ، اَللّٰهُمَّ اعْصِمْنِيْ مِنَ الشَّيْطَانِ الرَّجِيْمِ

**అల్లాహుమ్మ ఇన్నీ అస్‌అలుక మిన్ ఫజ్‌లిక. అల్లాహుమ్మ అ'అసిమ్‌ని మినష్షైతానిర్రజీమ్.**

ఓ అల్లాహ్! నేను నీ నుండి నీ అనుగ్రహాన్ని కోరుతున్నాను. ఓ అల్లాహ్! భ్రష్టుడైన షైతాన్ బారి నుండి నన్ను రక్షించు. (ఇబ్నెమాజా)

### 13. అజాన్ వేళ చేసే దుఆ

اَللّٰهُمَّ رَبَّ هٰذِهِ الدَّعْوَةِ التَّامَّةِ وَالصَّلاَةِ الْقَائِمَةِ آتِ مُحَمَّدَاً الْوَسِيْلَةَ وَالْفَضِيْلَةَ وَابْعَثْهُ مَقَاماً مَحْمُوْداً الَّذِيْ وَعَدْتَهُ [إِنَّكَ لاَ تُخْلِفُ الْمِيْعَادَ]

**అల్లాహుమ్మ రబ్బ హాజిహిద్దావతి త్తామ్మతి వస్సలాతిల్ ఖాయిమతి ఆతి ముహమ్మదనిల్ వసీలత వల్ ఫజీలత వబ్‌అస్‌హు మఖామమ్ మహ్‌మూదనిల్లజీ వ అద్‌త్తహు (ఇన్నక లా తుఖ్‌లిఫుల్ మీఆద్)**

ఓ అల్లాహ్! సంపూర్ణ సందేశప్రదాతా! నమాజ్ వ్యవస్థ సంస్థాపనకర్తా! ప్రభూ! ముహమ్మద్(స)కు నీ అత్యంత సాన్నిహిత్యాన్ని ప్రసాదించు, నీ ప్రత్యేక శుభాలను ఒసగు, ఇంకా 'మఖామె మహ్‌మూద్' (ప్రసంశాపూర్వక స్థానం)పై నిలబెట్టు. ఇది నీ వాగ్దానం. నిస్సందేహంగా నీవు నీ వాగ్దానాన్ని భంగం చేయవు. (బుఖారి)

**14. భోజనం చేయటానికి ముందు దుఆ**

بِسْمِ اللّٰهِ وَعَلٰى بَرَكَةِ اللّٰهِ

బిస్మిల్లాహి వ అలా బరకతిల్లాహ్

అల్లాహ్ పేరుతో మరియు అల్లాహ్ అనుగ్రహంతో తింటున్నాను.

**15. భోజనం చేసిన తరువాత దుఆ**

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِيْ اَطْعَمَنَا وَسَقَانَا وَجَعَلَنَا مِنَ الْمُسْلِمِيْنَ

**అల్‌హమ్దులిల్లాహిల్లజీ అత్‌అమనా వసఖాన వజఅలనా మినల్ ముస్లిమీన్.**

సకల స్తోత్రాలు అల్లాహ్‌కే చెందుతాయి. ఆయనే మాకు తినిపించాడు. త్రాపించాడు. మమ్మల్ని ముస్లిములుగా చేశాడు.

**16. పాలుత్రాగడానికి ముందు దుఆ**

اَللّٰهُمَّ بَارِكْ لَنَا فِيْهِ وَزِدْنَا مِنْهُ

**అల్లాహుమ్మ బారిక్ లనా ఫీహి వజిద్‌నా మిన్‌హు**

ఓ అల్లాహ్ మా కోసం ఇందులో శుభాన్ని ప్రసాదించు. మాకు దీనికంటే అధికంగా ప్రసాదించు.

**17. అద్దంలో చూసుకునేటప్పుడు దుఆ**

اَللّٰهُمَّ اَنْتَ حَسَّنْتَ خَلْقِيْ فَحَسِّنْ خُلُقِيْ

**అల్లాహుమ్మ అన్‌త హస్సన్త ఖల్‌ఖీ ఫహస్సిన్ ఖులుఖీ**

ఓ అల్లాహ్ నువ్వు నా రూపాన్ని అందంగా తీర్చిదిద్దావు. నా నడవడికను అందంగా తీర్చి దిద్దు.

**18. ప్రయాణపు దుఆ**

سُبْحَانَ الَّذِيْ سَخَّرَ لَنَا هٰذَا وَمَا كُنَّا لَهُ مُقْرِنِيْنَ وَإِنَّا إِلٰى رَبِّنَا لَمُنْقَلِبُوْنَ

**సుబ్‌హానల్లజీ సఖ్ఖరలనా హాజా వ మాకున్నా లహూ ముఖ్‌రినీన్. వ ఇన్నా ఇలా రబ్బినా లమున్ ఖలిబూన్.**

మాకు దీన్ని స్వాధీనం చేసినవాడు పరిశుద్ధుడు. నిజానికి మాకు ఆ శక్తి లేదు. మేము మా ప్రభువు దిశరూ మనలి పోవలసినవారము. (ముస్లిం)

**19. నిద్రపోయేటప్పుడు చేసే దుఆ**

بِاسْمِكَ اللّٰهُمَّ أَمُوْتُ وَأَحْيَا

**బిస్మిక అల్లాహుమ్మ అమూతు వ అహ్‌యా.**

ఓ అల్లాహ్! నీ నామంతోనే మరణిస్తున్నాను, మళ్ళీ బ్రతుకున్నాను. (బుఖారి)

**20 తుమ్మినప్పుడు దుఆ**

**اَلْحَمْدُ لِلّٰهِ అల్‌హమ్దులిల్లాహ్**

సమస్త స్తోత్రాలు అల్లాహ్ కొరకే.

అది విన్న వ్యక్తి

**يَرْحَمُكَ اللّٰهُ యర్‌హముకల్లాహ్.**

అల్లాహ్ నీపై కరుణించుగాక! అనాలి.

దీనికి జవాబుగా...

يَهْدِيْكُمُ اللّٰهُ وَيُصْلِحُ بَالَكُمْ

**యహ్‌దీకుముల్లాహు వ యుస్‌లిహు బాలకుమ్**

అని పలకాలి.

అల్లాహ్ నీకు సద్బుద్ధిని ప్రసాదించి నీ వ్యవహారాన్ని చక్కబెట్టుగాక!

**21. తల్లిదండ్రుల కోసం చేసే దుఆ**

رَبِّ ارْحَمْهُمَا كَمَا رَبَّيٰنِيْ صَغِيْرًا

**రబ్బిర్‌హమ్‌హుమా, కమా రబ్బయానీ సగీరా**

నా ప్రభూ! వారిద్దరి (తల్లిదండ్రుల)పై కరుణచూపు. ఎలాగైతే వారు నాపై బాల్యంలో కరుణచూపారో.

(17: 24)

**22. విద్య కోసం దుఆ**

**رَبِّ زِدْنِيْ عِلْمًا రబ్బి జిద్‌నీ ఇల్మా**

ఓ అల్లాహ్ నాకు మరింత జ్ఞానాన్ని ప్రసాదించు.